భారత ప్రభుత్వ సమ్మత దృక్సిద్ధాంత

## శ్రీ దుర్ముఖి నామ సంవత్సర

# గ్రహభూమి

### వాస్తవ వైజ్ఞానిక శాస్త్రీయ పరిశోధనాత్మక అంతర్జాతీయ తొలి తెలుగు ముహూర్త పంచాంగం

**2016** **2017**

న్యూయార్క్, లండన్, లాస్‌ఏంజిల్స్ పంచాంగము - శుభముహూర్తములతో...






**PRANATHI TV**
నిత్య జ్యోతిష ప్రవచకులు

పండిత శ్రీపొన్నలూరి శ్రీనివాస గార్గేయ దైవజ్ఞ

వెల : 120-00

# గ్రహభూమి

## శ్రీ దుర్ముఖి నామ సంవత్సర

### భారత ప్రభుత్వామోద గణిత వాస్తవ, వైజ్ఞానిక, పరిశోధనాత్మక, శాస్త్రీయ

### తొలి తెలుగు అంతర్జాతీయ పంచాంగం

**2016** **2017**




( న్యూయార్క్, లండన్, లాస్‌ఏంజిల్స్ శుభసమయాలతో )


పంచాంగకర్తలు **దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ**

**&**

**కుమారి నందినీ గార్గేయ**

ప్లాట్ నెం 149, రోడ్ నెం 11, అలకాపురి, కొత్తపేట, రంగారెడ్డిజిల్లా

హైద్రాబాద్ 9348032385, 9348632385,9346032385 (only 11 am to 3.00 pm)





మోహన్ పబ్లికేషన్స్, అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం, రాజమహేంద్రవరం-1. (0883) 2462565

# విషయసూచిక

# గ్రహభూమి

## పంచాంగ విశిష్ఠత

సూర్యోదయ చంద్రోదయ, సూర్యాస్తమ చంద్రాస్తమ సమయాలతో, తిథి నక్షత్ర యోగ కరణ వర్జ్య దుర్ముహూర్త అమృతకాల సమయాలు, నిత్యం ఖచ్చిత రాహుకాల సమయం, అభిజిత్ సమయాలతోను, నక్షత్రపాదప్రవేశాలు, నిత్య గ్రహస్ఫుటాలు, లగ్నాంతకాలాలు, సందిగ్ధ పితృతిథి నిర్ణయాలు, పండుగలు వ్రతాదుల వివరములతో పాటు నిత్య గ్రహ సంచార రాశిచక్రము ఒకే పేజీలోనే పేర్కొన్న భారత ప్రభుత్వ సమ్మత దృక్సిద్ధాంత ఏకైక పంచాంగమే మా 'గ్రహభూమి'.

దృక్సిద్ధాంత అయనాంశలతో గణితము చేయబడిన ఈ గ్రహభూమి పంచాంగము నందలి గ్రహస్థితులు మరియు తిథి, నక్షత్ర, యోగ, కరణ, సమయములన్నియు శాస్త్రమునకు మరియు ప్రత్యక్షమునకు ఖచ్చితముగా సరిపోవును. రెండు తెలుగు రాష్ట్రములకు మధ్యనగల విజయవాడ (16.32 ఉత్తర అక్షాంశము 80.32 తూర్పురేఖాంశము) పట్టణమునకు ఈ పంచాంగము సంస్కారయుతమై గణించబడినది. దీనితోపాటు న్యూయార్క్, లాస్‌ఏంజిల్స్, లండన్ నగరములకు కూడా తిథి,నక్షత్ర, వర్జ్య, దుర్ముహూర్త, రాహుకాల వివరములు, శుభసమయాలు, పండుగ తేదీలు ఇవ్వడమైనది.

ఇందలి తిథి, నక్షత్ర, యోగ, కరణములకిచ్చినవి అంత్యసమయాలు, వర్జ్య దుర్ముహూర్త అమృతకాల, రాహుకాల, అభిజిత్ సమయాలకు ప్రారంభ, అంత్యములను, నిత్య నక్షత్రపాద ప్రవేశాలు, సందిగ్ధ రోజులలోని పితృతిథి నిర్ణయాలతో నిత్యం ఉదయం 5గం॥30ని॥లకు గ్రహస్ఫుటాలను తెలియజేయుటమైనది.

ముహూర్తాలలో పంచకరహితమైనవి, మతాంతరరహితమైనవి, శాస్త్రవచనాధారంగా గణించి ముహూర్తములను నిర్ణయించితిమి. ముహూర్త నిర్ణయాలలో శుభాంశ, వర్గోత్తమాంశ, పుష్కరాంశ సమయాలతోను, ప్రతి ముహూర్తానికి లగ్న ప్రారంభ అంత్య సమయాలనిచ్చిన ఏకైక పంచాంగమే మా 'గ్రహభూమి'.

ఎప్పటివలె మీ ఆదరాభిమానాలు మాపై ఉంచాలని కోరుకుంటూ,

మీ శ్రీనివాసగార్గేయ......



కేంద్రప్రభుత్వ ఆమోద గణిత పంచాంగకర్త,
హైదాబ్రాద్.

## తిరుమల, శ్రీశైల పంచాంగాల భిన్నత్వాలు

తెలుగులో ప్రామాణిక శాస్త్రీయ పంచాంగాన్ని భారతప్రభుత్వం రాష్ట్రీయ పంచాంగమనే పేరుతో ముద్రిస్తున్ననూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పాలిత తిరుమల తిరుపతి, శ్రీశైల దేవస్థానాలు ప్రామాణిక విలువలకు తిలోదకాలిచ్చి ఋజువునకి నిలబడని పూర్వగణిత పంచాంగాలకు పెద్దపీట వేస్తున్నారు. తిరుమల, శ్రీశైల దేవస్థాన పంచాంగాలలో తిథి, నక్షత్ర సమయాలు ఒకేలా ఉంటాయి. ప్రతి సంవత్సరం వచ్చే పుష్కర ప్రవేశ సమయాలలో రెండు దేవస్థాన పంచాంగాలకు వారం రోజుల వ్యత్యాసం ఉంటుంటే... ఎందుకొస్తుందని అడిగే అధికారులు లేరు.

మీ జన్మనక్షత్ర జన్మరాశులు రెండు పంచాంగ గణితాలలో తేడాలుం డుటచే విద్యాభ్యాసం నుంచి, షష్ఠిపూర్తి వరకు తికమకతోనే ముహూర్తాలను చేసుకుంటున్నారు. ఓ గణిత పంచాంగంలో అనూరాధ నక్షత్రంలో ముహూర్త ముంటే, మరో గణిత పంచాంగంలో ఆ సమయానికి జ్యేష్ఠ ఉంటుంది. మరి శుభకార్యములాచరించేవారు... అనూరాధ నక్షత్రమున్న పంచాంగాన్ని అనుసరించాలా? లేక ముహూర్తం కూడని జ్యేష్ఠ నక్షత్రంతో ఉన్న పంచాంగాన్ని అనుసరించాలా? ఇట్టి రెండు భిన్న పంచాంగాలు ఉన్నందున, నిత్యం పాఠకులతో పాటు ప్రజలు పలు సమస్యలకు లోనవుతున్నారు.

అందుకే భారత మాజీ ప్రధాని నెహ్రూ గారి పట్టుదలతో దేశవ్యాప్తంగా ఒకే గణిత పంచాంగముండాలని, పంచాంగ సంస్కరణల కమిటీని ఏర్పాటు చేశారు. ఈ కమిటీ దేశవ్యాప్త పండితులందరినీ ఆహ్వానించి, చర్చించి, సరియైన పద్ధతి గల ఖచ్చిత పంచాంగగణితం... దృగ్గణితమేనని నిర్ధారించి, 22 మార్చి 1957 నుంచి భారత ప్రభుత్వం ప్రతి సంవత్సరం 14 భాషలలో ముద్రించటం జరుగుతున్నది. దీనినే రాష్ట్రీయ పంచాంగం లేదా దృక్ పంచాంగమందురు. తెలుగులో కూడా ఈ రాష్ట్రీయ పంచాంగం ప్రతి సంవత్సరం విడుదలవుతూ ఉంటుంది.

కానీ దురదృష్టం ఏమిటంటే ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఎండోమెంట్ శాఖలో ఉన్న తిరుమల తిరుపతి దేవస్థాన ఈవోలు ఐ.ఎ.యస్ ఆఫీసర్లు అయినప్పటికీ... దేవస్థానం ముద్రించే పంచాంగం తప్పు గణితమని తెలుసుకోలేకపోవటం విచారకరం. తిరుమలలో కంచి పీఠాధిపతుల ఆధ్వర్యంలో దేశవ్యాప్త పంచాంగ కర్తలందరూ 2010 డిశంబరులో 3 రోజుల పాటు సమావేశమై సరియైన శాస్త్రీయమైన ప్రామాణికమైనది దృగ్గణితమేనని ఏకగ్రీవామోదం జరిగింది.

జ్వరము, బి.పి, మధుమేహం, ఇతర అనారోగ్యాలకు, స్థల విస్తీర్ణములకు, వస్తు బరువులు, ద్రవపరిమాణాలు, వస్త్రకొలతలకు కొలమానాలు ఉన్నవి. మరి తిథి నక్షత్రాల సమయాలు తెలుసుకోవ టానికి కొలమానం లేదా అని అనుకోవచ్చు. సూర్య, చంద్రుల మధ్య దూరాన్ని తిథి అంటారు. చంద్ర స్థితిని నక్షత్రమంటారు. ఈ దూరం తెలుసుకొనుటకు... మరియు ఖగోళంలో ఏ గ్రహాలు ఎక్కడెక్కడ ఉన్నాయో, ఏ సమయాలలో గ్రహాలు రాశి ప్రవేశాలు కానున్నవో ఖచ్చితంగా కంటితో చూసే విజ్ఞానం ఈనాడు అందుబాటులో ఉంది.

ఇప్పటికైనా శ్రీశైల మరియు తిరుమల దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్లు విజ్ఞతతో ఆలోచించి పూర్వగణితం కాక, ఖచ్చిత ఋజువుకు నిలబడే శాస్త్రీయ దృగ్గణిత పంచాంగాన్ని అందిస్తే, సమస్య పరిష్కారమై.... సర్వులు ఆమోదిస్తారు. పుష్కరాలు, పండుగలు వ్యత్యాసాలు లేకుండా ప్రజలందరూ సంతోషంతో ఉంటారు.

ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబు నాయుడు గారు కూడా ఖగోళ ఋజువులను, సుప్రీంకోర్టు తీర్పును, కేంద్రప్రభుత్వ నిర్ణయాలను గౌరవిస్తూ శ్రీశైలం, టిటిడి దేవస్థానాలలో దృగ్గణిత పంచాంగాలు అధికారికంగా ఉండేలా తక్షణ చర్యలు తీసుకొనాలని విజ్ఞులైన పండిత, పురోహిత వర్గీయులు మరియు అవగాహనతో ఉన్న పాఠకులు కోరుకుంటు న్నారు. **- పొన్నలూరి శ్రీనివాసగార్గేయ**

## ద్వాదశ రాశుల నిత్య పారాయణకై శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రంలోని అష్టాక్షరీ నామ వివరణ

మత్స్యపురాణంలో 'లక్ష్మీర్మేధా ధరా పుష్టిః గౌరీ తుష్టిః ప్రభా ధృతిః ఏతాభిః పాహి తనుభి రష్టాభిర్మాం సరస్వతీ' అని సరస్వతీ దేవి 8 విధములైన ప్రాణస్వరూపిణిగా చెప్పబడింది. 'ప్రాణశక్తి సరస్వతీ' అని వేదం చెప్పింది. ఈ ప్రాణశక్తి ప్రపంచమంతా వ్యాపించి 8 విధాలుగా మనల్ని రక్షిస్తున్నది. సరస్వతి అనే శబ్దానికి ప్రవాహము కలది అని అర్థము కూడా ఉంది. శరీరంలో ఈ ప్రవాహలక్షణము ప్రతి అణువు నందు ప్రసరిస్తుంటుంది. ఇట్టి ప్రాణస్వరూపిణిగా నున్న అష్టమూర్తిత్వంలో లక్ష్మీ అనగా ఐశ్వర్యము సంపద, మేధా అంటే బుద్ధిశక్తి, ధరా అంటే ధరించునది అనగా భూమి అనగా భావము, పుష్టి అంటే ఇంద్రియాలకు కావల్సిన శక్తి, గౌరీ అనగా వాక్స్వరూపిణీ, తుష్టి అనగా తృప్తి, ప్రభా అనగా వెలుగు, ధృతి అనగా ధైర్యమని అర్థములు.

ఈ 8 శక్తులు మానవులకు మనకు సహకరించి రక్షిస్తుంటాయి. అలాగే యోగశాస్త్రం ప్రకారం ఆత్మకు కూడా జీవాత్మ, అంతరాత్మ, పరమాత్మ, నిర్మలాత్మ, సిద్ధాత్మ, జ్ఞానాత్మ, మహాత్మ, భూతాత్మ అనబడే ఎనిమిది రూపములున్నవి. శ్రీచక్రంలో కూడా ఎనిమిదవ ఆవరణంలో అనంగకుసుమ, అనంగమేఖలా, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగరేఖా, అనంగవేగినీ, అనంగాంకుశా, అనంగమాలినీ అనే 8 దేవతలుండి రక్షిస్తున్నారు. అదేవిధంగా బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, ఇంద్రాణి, చాముండీ, మహాలక్ష్మీ అనబడే అష్టమాతృకా దేవతలు కూడా ఉన్నారు. అలాగే కామాక్షీ దేవిని కూడా ధరణిమయీ, భరణిమయీ, పవనమయీ, గగనమయీ, దహనమయీ, హవన మయీ, అంబుమయీ, ఇందుమయీ అనే 8రూపాలలో ప్రార్థిస్తుంటాం.

ఆదిశంకరులు కూడా దక్షిణామూర్తి స్తోత్రంలో భవ, శర్వ, ఈశాన, పశుపతి, రుద్ర, ఉగ్ర, భీమ, మహాదేవ అనే ఎనిమిది పేర్లను అష్ట మూర్తులుగా తెలియజేశారు. ఈ అష్టమూర్తులకు సంబంధించిన శక్తి అమ్మవార్లే భవానీ, శర్వాణి, ఈశాని, పశుపాశవిమోచనీ, రుద్రాణి, ఉగ్రాణి, భీమాణి, మహాదేవీ అను ఎనిమిది శివుని యొక్క శక్తులు. ప్రత్యక్షంగా మనం అర్థం చేసుకుంటే ఈ 8 అంకెలో ఉన్నదంతా శక్తి స్వరూపిణి అయిన జగన్మాతే.

'అష్టమీచంద్రవిభ్రాజదళికస్థలశోభితా' అను శ్రీ లలితా సహస్ర నామావళి లోని 15వ నామంలో 8వ తిథి అయిన అష్టమి నాడు ప్రకాశించు చంద్రుని కళవలె ప్రకాశించు తల్లి అని భావము. శుక్ల పక్షంలోని పాడ్యమి నుంచి పూర్ణిమ వరకు నిత్యం చంద్రుడు క్రమ క్రమంగా పెరుగుతూ తిరిగి కృష్ణపక్షంలోని పాడ్యమి నుంచి అమావాస్య వరకు చంద్రుడు క్రమక్రమంగా క్షీణిస్తూ ఉండటం అందరికీ తెలిసిందే. మాసం 30 తిథులలో... ఒక్కోతిథి నాడు ఒక్కొక్క కళతో జగన్మాత ప్రకాశిస్తూ నిత్యాదేవతగా ఆరాధింపబడుతుంటుంది.

శుక్లపక్ష పాడ్యమి నుంచి దేవీకళ మొదలై కామేశ్వరీ, భగమాలినీ, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్నివాసినీ, మహావజ్రేశ్వరీ, శివదూతీ, త్వరితా, కులసుందరీ, నిత్యా, నీలపతాకా, విజయా, సర్వమంగళా, జ్వాలామాలినీ, విచిత్రా అనే 15 నిత్యదేవతలు ఆరాధింపబడుతుంటారు. అలాగే కృష్ణ పక్షంలో వెనుక నుంచి వరుసగా విచిత్రా, జ్వాలామాలినీ, సర్వమంగళా, విజయా, నీలపతాకా, నిత్యా, కులసుందరీ, త్వరితా, శివదూతీ, మహావజ్రేశ్వరీ, వహ్నివాసినీ, భేరుండా, నిత్యక్లిన్నా, భగమాలినీ, కామేశ్వరీ నిత్యతిథి దేవతలుగా చంద్రకళలు ఉంటాయి.

శుక్లపక్షంలో వచ్చే 15 దేవతలలో 8వ(శుక్లఅష్టమికి) నిత్యాదేవత త్వరితా. కృష్ణపక్షంలో 8వ(బహుళ అష్టమి) నిత్యాదేవత త్వరితా. మిగిలిన అన్నీ తిథులకు వేరు వేరు నిత్యాదేవతలు ఉంటారు. కానీ శుక్ల అష్టమి,బహుళ అష్టమి తిథులలో మాత్రం ఒకే నిత్యాదేవతయైన త్వరితా మాత్రమే ఉండును. అష్టమితిథి నాడు తిథి దేవత మారదు. ఈ 8వ చంద్రకళకు ఎంతో ప్రాముఖ్యం ఉన్నది.

అష్టమంటే భయపడతారు. అష్టమి ప్రశస్తమైనదని చాలామందికి తెలియదు. గ్రహచార స్థితులచే వచ్చే దోష సమయాలలోని అష్టమి రోజులలో ఆచరించే శాంతిపూజా క్రతువులచే... అనేక దోషాలు పరిహారమవుతాయని పురాతన శాస్త్రవచనాలు తెలియజేస్తున్నాయి. 12 రాశులపై గోచార గురుసంచార దోష నివృత్తికై, 8 అక్షరాలతో కూడిన లలితా సహస్రనామ స్తోత్రంలోని మొత్తం 240 నామాలను విధివిధానాలతో పారాయణం చేసినచో పరోక్షంగా పరిహారముండును.

240 నామాలను గానీ లేదా 20 నామాలను గానీ పారాయణం చేసే సంకల్పమున్నవారు దిగువ విధివిధానంతో ఆచరించండి. ఒక్కొక్కరాశికి అవసరమైన 20 నామాలను తదుపరి పేజీలలో ఇవ్వటం జరిగింది. కనుక ఆయానామాలను పారాయణం చేయటానికి ప్రయత్నించండి. శ్రీ లలితాసహస్రంలో 240 అతిరహస్యమైన నామాలు 8 అక్షరాలతో ఉంటాయి. వాటికి ముందు ఓం బీజాక్షరాన్ని, చివరన నమః ను కలుపుతాము. ఇలా కలిపే సందర్భంలో కొన్ని నామాలు సంధితో కలిసి 8 అక్షరాలుగానే ఉంటాయి, మరికొన్ని నామాలు 9 అక్షరాలతో ఉంటాయి. ఈ 240 నామాలను నిత్యంగానీ, శుక్రవారాలు లేక ముఖ్యదినాలు లేక ప్రతిమాసంలోని శుక్ల, బహుళ అష్టమిలలో పారాయణం చేయవచ్చు.

శుక్ల, బహుళ అష్టమి నిత్యాతిథి దేవత పేరు త్వరితా. ఈ దేవత 3 నేత్రాలు, 4 చేతులతో పద్మముఖంతో శాంతస్వరూపిణియై చిరు మందహాసం చేస్తూ సుగంధాలు వెదజల్లే శరీరంతో ఉండును. తలపై కిరీటరూపంలో 5 నెమలి పింఛములు, 4 విధాలైన 8 గొప్ప సర్పాలను ధరించి ఉండును. అనంత కౌళికలను సర్పాలను కర్ణాభరణ ములుగా, వాసుకి శంఖపాల సర్పాలను ముంజేతి గాజులుగా, తక్షక మహాపద్మ సర్పాలను వడ్డాణంగా, పద్మ కర్కొటక సర్పాలను కాలి ఆభరణములుగా ధరించును. జయ,విజయులనే శక్తి స్వరూపిణులు బంగారు చెరకు గడలను చేతబూని ఈ దేవతకు ఇరువైపులా ఉందురు.

240 అష్టాక్షరీ నామాలతో మరియు అష్ట జ్యోతులతో శుక్ల బహుళ అష్టమి తిథులలోగానీ, ముఖ్య పర్వదినాలలో గానీ, సంక్రమణ, శుక్ర వారాలలో గానీ ప్రాతః లేక సాయంసంధ్యా సమయాలలో పూజించినచో విశేష లబ్ధి కల్గునని పురాతన శాస్త్ర గ్రంథాలు తెలియజేస్తున్నాయి.

పై ముఖ్యదినాలలో గృహంలోని అనువైన ముఖ్యస్థలంలో అష్టదళ పద్మమును పసుపు కుంకుమలతో చిత్రీకరించాలి. అష్టదళాలలో ప్రమిదలో ప్రమిద ఉంచి, ఒక్కో ప్రమిదలో 2వత్తులతో వెలిగించేది. తైలం మీ నిర్ణయం. ప్రతి ప్రమిదలో వెలిగించే 2 వత్తులలో ఒకటి అష్టదళ పద్మానికి లోనికి ఉండేలా, రెండవ వత్తి అష్టదళ పద్మానికి బయటికి ఉండేలా వెలిగించుకోవాలి. పద్మం మధ్యలో కొద్దిపాటి బియ్యం పోసి దానిపై తమలపాకును ఉంచాలి. పసుపుతో చేసిన గౌరీదేవిని (నిత్యతిథి దేవత త్వరితను) తమలపాకుపై ఉంచాలి. (చంద్రబింబ షోడశకళలలో సగభాగమే ఎనిమిది. కనుక ఈ ఎనిమిది పద్మదళాలలో 16 ప్రమిదలలో 16 వత్తులు ఉంటాయి.)

పుష్పాలు లేక అక్షతలతో అష్టోత్తర, సహస్రనామ పూజ చేస్తుంటారు. కానీ ఈ నిత్యతిథి దేవత **'త్వరితా'** పూజకు పఠించే నామాలకు అక్షతలను వినియోగించవద్దు. ఈ దేవతకు సుగంధభరిత గంధ జలం కానీ, గులాబీజలం కానీ తమలపాకుతో తీసుకుని నామాలను పఠిస్తూ... ప్రోక్షించాలి. మీ ఇష్ట వర్ణపుష్పాలతో ధూప, దీప, కర్పూర నీరా జనాలతో పూజ ఆచరించేది.

కుటుంబములో ఎవరైననూ ఈ త్వరితాదేవీ పూజను ఆచరించ వచ్చును. తమ తమ గోత్ర నామాలతో త్వరితా దేవతను ఆరాధించేది. తేనె లేక ఇతర తీపిపదార్థాన్ని నివేదించేది. అవకాశమున్నవారు కొబ్బరి కాయను కూడా సమర్పించేది. పూజనాచరించే సమయంలో అష్టమి తిథి తప్పక ఉండాలి. ఉదయము లేక సాయంత్ర సమయాలలో తిథి ఉంటే, మీ వీలును బట్టి ఉదయసమయం గానీ లేక సాయంత్ర సమయం గానీ ఎంచుకొనేది.

ఈ పూజకు ఎలాంటి ప్రత్యేక నియమాలు లేవు. సాయంత్రం ప్రదోషసమయంలో అనగా 6 నుంచి 8గంటల లోపల పూజను ఆచరించేవారు మధ్యాహ్నం భోజనాన్ని స్వీకరించవచ్చును. స్త్రీలు, పురుషులు, బాలలు, బాలికలు అవకాశముంటే వృద్ధులు కూడా పూజలో పాల్గొనేది. అష్టదళపద్మంతో కాక మానసికంగా కూడా ఈ నామాలను ఉదయ, సాయంత్ర సమయాలలో పారాయణం చేసినచో 'త్వరితా' దేవత అభయ, వరద ముద్రలతో అనుగ్రహించును.

**ద్వాదశరాశుల వారు పారాయణం చేయవలసిన అష్టాక్షరీ నామాలను రాశిఫలిత పేజీలలో చూడండి.**



**గమనిక**

దిగువ చిత్రములో చూపినట్లు అష్టదళపద్మమును చిత్రించి జ్యోతులను వెలిగించుకునేది.



# అరుదైన నాగబంధనం

శతాబ్దాల తర్వాత సింహరాశిలో రాహువుచే గురువునకు
2016 జూన్ 25 శనివారం నాగబంధనం జరగనుంది.
సింహరాశి అధిపతి సూర్యగ్రహానికి మార్చి 9, సెప్టెంబరు 1న
సంపూర్ణ సూర్యగ్రహణాలు సంభవించటం,
వైరి గ్రహాలైన శని, కుజులు ఏకకాలంలో వక్రం కావటం,
ఆగస్టు 24న శని కుజులు కలవటం
మొదలైన గ్రహస్థితుల నడుమ ఈ నాగబంధనం రావటం అరుదైనది.
దీని ప్రభావం ఆర్థిక, వ్యాపార, వృత్తి, వ్యవహార, సంతాన, వివాహ,
కుటుంబ, ఋణ, శతృ అంశాలపైనే కాక దేశాల నడుమ పాలకులపైన కూడా
వ్యతిరేక ప్రభావములు చూపుతుందును.
దైవజ్ఞ శ్రీనివాసగార్గేయ
మరియు స్టూడియో ఎన్ న్యూస్ వారి అనుబంధ సంస్థ ఐన
యోగి టెలివిజన్ ఛానల్ వారి సంయుక్త ఆధ్వర్యంలో
రెండు తెలుగు రాష్ట్రాలలో 7 పర్యాయములు సప్త మహా సూర్యయాగాలు జరుగనున్నవి.
ఇందులో అతిముఖ్యమైనది నాగబంధనం. కనుక 2016 జూన్ 24 శుక్రవారం రోజున
హైదరాబాద్‌లో విశేషరీతిలో అనుభవజ్ఞులైన పండితులతో

## నాగబంధన నివృత్తికై
## మహా సూర్యయాగం జరుగును

1వ మహా సూర్యయాగం 2016 మార్చి 6 ఆదివారం
2వ మహా సూర్యయాగం 2016 ఏప్రిల్ 3 ఆదివారం
3వ మహా సూర్యయాగం 2016 మే 1 ఆదివారం
4వ మహా సూర్యయాగం 2016 మే 29 ఆదివారం
5వ మహా సూర్యయాగం 2016 జూన్ 24 శుక్రవారం
6వ మహా సూర్యయాగం 2016 జూలై 1 ఆదివారం
7వ మహా సూర్యయాగం 2016 జూలై 31 ఆదివారం

పై 7 కార్యక్రమములు యోగి టెలివిజన్ ఛానల్‌లో
ప్రత్యక్షప్రసారం ద్వారా వీక్షించవచ్చును.
పూర్తి వివరములకు సంప్రదించవలసిన ఫోన్ నంబర్లు
7337596524, 7337596521, 7702021818

# సప్త మహా సూర్యయాగాలు

**6 మార్చ్ 2016 - 1వ యాగ ఛాయాచిత్రములు**



















శ్రీ మహాగణాధిపతయే నమః | శ్రీమాత్రే నమః | శ్రీ మద్వేంకటేశాయ నమః

# శ్రీ దుర్ముఖి నామ సంవత్సర ప్రామాణిక సూర్యసిద్ధాంత పంచాంగం

కలియుగ శతాబ్దములు **5117**
శ్రీ ఆదిశంకరాచార్యాబ్దములు **2087**
శాలివాహనశకాబ్దములు **1938**
భారత స్వాతంత్ర్య శకము **69-70**



ఫసలీ శతాబ్దములు **1424 -1425**
హిజరీ శకాబ్దములు **1436 - 1437**
శ్రీరామానుజాబ్దములు **999**
క్రీస్తు శకము **2016 - 2017**

*కలియుగ ప్రమాణము 4లక్షల 32వేల సంవత్సరములు. శ్వేతవరాహకల్పము నందలి 7వదైనటువంటి వైవస్వత మన్వంతరములోని 28వ మహాయుగమునందలి కలియుగ ప్రథమ పాదములో 5117వదియు, ప్రభవాది 60 సంవత్సరాలలో 30వ దైనటువంటి ఈ సంవత్సరమును చాంద్రమానంచే శ్రీ 'దుర్ముఖి' నామ సంవత్సరముగా పేర్కొందురు. ప్రతి ఐదు సంవత్సరాలను ఒక యుగముగా లెక్కించినచో, ప్రభవాది అరవై సంవత్సరాలను పన్నెండు యుగాలుగా భావించాలి. ప్రతి యుగములోని ఐదు సంవత్సరాలను వరుసగా సంవత్సర, పరివత్సర, ఇదావత్సర, అనువత్సర, ఇద్వత్సరములని పిలువబడును.*
*ఈ పరంపరలో 6వయుగములోని 'ఇద్వత్సర' మను నామంతో ఉన్న ఐదవ సంవత్సరమే శ్రీ దుర్ముఖి నామ సంవత్సరం.*

## రాజాధి నవనాయక నిర్ణయాలు

**మంత్రి : బుధుడు**
**సేనాధిపతి: కుజుడు**
**సస్యాధిపతి : శని**
**ధాన్యాధిపతి : గురువు**




**అర్ఘాధిపతి: కుజుడు**
**మేఘాధిపతి: కుజుడు**
**రసాధిపతి : చంద్రుడు**
**నీరసాధిపతి: శని**

### రాజ్యాధిపతి - శుక్రుడు

శ్రీ దుర్ముఖి సంవత్సరానికి రాజు శుక్రుడు. జూలై 31 నుంచి ఆగస్టు 25 వరకు సింహరాశిలో రాహువుతో రాజైన శుక్రుడు కలిసినందున ప్రజా ప్రయోజనాలకు విఘాతాలు కల్గే అవకాశములున్నవి. సంవత్సర ప్రారంభం నుంచే వ్యతిరేక గ్రహస్థితుల కారణంగా శతృత్వ పోకడలతోనే పరిపాలన సాగును. చిత్తశుద్ధి, సూక్ష్మపరిశీలన లేని వ్యక్తులు రాజుకి తోడైనందున స్తబ్దతతో పరిపాలన సాగును. ఆర్ధికస్థితి అంతంతమాత్రమే. సమస్యలు సృష్టించే దుష్టశక్తులు అధికమగును.ఇరుగుపొరుగు రాష్ట్రాలతో స్నేహ సంబంధాల మెరుగుకై చేసే ప్రయత్నాలు పూర్తిస్థాయిలో ఫలించవు. ప్రకృతి వైపరీత్యాలనుంచి ప్రజలను కాపాడటంలో కృతకృత్యులగుదురు. ఆరోగ్య వ్యవసాయ సంక్షేమ రంగాలలో విశేష అభివృద్ధి కనపడును.

### సేనాధిపతి - కుజుడు

శ్రీ దుర్ముఖి సంవత్సరానికి సేనాధిపతి కుజుడు. శాంతిభద్రత పరిరక్షణలో కఠిన చర్యలు చేపట్టలేరు. ప్రజలు సంతోషంతో ఉండలేక పోవుదురు. నిజనేరస్థులు పల్లకీలలో ఊరేగుదురు. ప్రకృతి వైపరీత్య సమయాలలో బుద్ధిబలంతో రక్షణశాఖ చర్యలు చేపట్టినందున ప్రాణ నష్టాన్ని అరికట్టబడును. ధైర్యసాహసాలతో పరిపాలనపర నిర్ణయాలను తీసుకొనగలరు. వింత వింత రోగములు, అగ్నిభయములు, ఉగ్రవాద చర్యలు మితిమీరును. అధికవృష్టి ఉన్నందున వ్యవసాయ పనులకు ఆటంకాలు ఏర్పడును. ప్రజల సొమ్మును కొల్లగొట్టుటకై అసత్య ప్రచారకులు అధికమగుదురు. రాజ్యాధిపతికి సేనాధిపతికి పలు సందర్భాలలో వ్యక్తిగతవిద్వేషాలు రాగల అవకాశం అత్యధికము.

### మంత్రి - బుధుడు

శ్రీ దుర్ముఖి సంవత్సర మంత్రి బుధుడు. ఆకర్షణీయ ప్రజాపథకాలను ప్రవేశపెట్టాలని సలహాలు ఇచ్చినప్పటికీ ఆచరణలో సమస్యలు కల్గును. ప్రజలలో వ్యతిరేకతలు ఎదురయ్యే అవకాశం. మంత్రి చతురతతో ఉన్నప్పటికీ రాజు వైఫల్యాలచే సమస్యలు చెలరేగును. ప్రజల అవసరాలను గుర్తెరిగి ప్రభుత్వదృష్టికి తీసుకెళ్లి సమన్వయ పాత్ర పోషించే ప్రసారమాధ్యమాలు ద్వందనీతిని పాటించును.యాంత్రిక జీవనంతో ఉద్యోగస్తులు మానసిక ధైర్యాన్ని కోల్పోయే అవకాశముంది. ప్రజలు సంయమనంతో ఉంటూ తమ కష్టాలు తీరుటకై భక్తి భావాలతో యజ్ఞ యాగాదులు చేయుట ఉత్తమం.

### సస్యాధిపతి - శని

శ్రీ దుర్ముఖి సంవత్సరానికి సస్యాధిపతి శని. సంవత్సర మొత్తంలో 159 రోజులపాటు శని, కుజుల సంఘర్షణ అధికంగా ఉండటంతో వ్యవసాయ దారులు కష్టాలను ఎదుర్కొనవలసి ఉండును. ఆగష్టు 24న శని,కుజుల సంఘర్షణ తీవ్రంగా ఉన్నందున రైతులకు సస్యాధిపతి విశేష మేలును అందించలేడు. మేలు జాతి విత్తనాలున్నప్పటికీ, వాతావరణ అనుకూలత లేకపోవటంతో రైతాంగానికి తీవ్ర నష్టం వాటిల్లే అవకాశముంది. అక్టోబరు నుంచి సస్యాధిపతి శని అనుకూలంగా ఉండును. దీనిని గమనించి వ్యవసాయదారులు అక్టోబరు నుంచి తమ పనులను ప్రారంభించుకొనుట ఉత్తమం.

### ధాన్యాధిపతి - గురువు

శ్రీ దుర్ముఖి సంవత్సర ధాన్యాధిపతి గురువు. 126 రోజులపాటు గురుచండాలయోగం ఏర్పడినందున పండిన పంటలకు సరియైన ధరలుండవు. ప్రభుత్వం మేలుచేయాలనే ఉద్దే శ్యంతో ఉన్ననూ, స్వార్ధపరులు పరోక్షంగా ప్రభుత్వ నిర్ణయాలను నీరుకార్చుదురు. స్వార్ధపరులు నిత్యావసర వస్తువులను అక్రమమార్గంలో నిల్వచేయటంతో ధరలు పెరిగి వినియోగదారులు పలు సమస్యలు ఎదుర్కొందురు. రాజ్యాధిపతికి, ధాన్యాధిపతికి పరస్పర శతృత్వమున్నందున... సంపన్న వర్గీయులు లబ్ది పొందేలా ప్రభుత్వాధి నేతలు నిర్ణయాలు చేస్తున్నందున,న్యాయాన్ని సరియైన రీతిలో సాధారణ ప్రజలు పొందలేరు.

### మేఘాధిపతి కుజుడు

నైఋతి ఋతుపవనాలు స్వల్ప ఆలస్యంగా ప్రవేశించును. ఆశలు చిగురుచును. సంవత్సర ప్రారంభం నుంచి వ్యతిరేక గ్రహస్థితులధికంగా ఉన్నందున, ప్రజలకు అవసరమైన జలవనరులు సకాలంలో తృప్తిని ఇవ్వలేవు. సముద్రంలో అల్ప పీడనాలు ఏర్పడినను కెరటాలు గరిష్ఠంగా గాలులు వీస్తున్నప్పటికీ వర్షాలు మాత్రం సకాలంలో పడక అడపాదడపా అధికవర్షంగా కురుస్తున్ననూ నిరుపయోగమగును.

### రసాధిపతి చంద్రుడు

రసవస్తువుల ఉత్పత్తి తగ్గును. నూనె నువ్వులు నెయ్యి బెల్లం ఉప్పు ధరలు నిలకడుండవు. గత సంవత్స రాలతో పోలిస్తే, ప్రస్తుతం అనేక శాస్త్రీయ పద్ధతులు వస్తున్నప్పటికీ, అధికారులు రాబందుల కబంధ హస్తాలలో నలిగిపోతూ సరియైన సమయంలో సక్రమమైన సలహాలను ఇవ్వలేరు. ఇందుచేత ప్రజలు నష్ట పోవుదురు. సంవత్సరం మధ్య భాగం తదుపరి రసవస్తువుల ఉత్పత్తి స్వల్పంగా పెరుగును.

### నీరసాధిపతి శని

బంగారం, వెండి, కర్పూరం, తగరం, మత్తువస్తువుల ధరలు నిలకడగా ఉండవు. తీపిమిఠాయి తయారీదారులు తగ్గుదురు. ఎర్ర చందనం దొంగరవాణా అరికట్టిననూ, నాయకుల కనుసన్నలలో దొంగ వ్యాపారము యథేచ్ఛగా సాగును. ప్రజలకు భక్తివిశ్వాసాలను అందిస్తామని చెప్పే వారు అధికమై కోట్లాది రూపాయలు దోచుకుంటారు. వారి గుట్టు బయటపడినను, ప్రజలు మూర్ఖంగానే నమ్ముతుంటారు.

### అర్ఘాధిపతి కుజుడు

ఎరుపు వస్తువులకు ధరలధికము. దక్షిణాయణంలో ఎండు మిర్చికి అధికధరలుండును. అప్పుల వ్యాపారం దెబ్బతినును. కందుల వ్యాపారస్థులు అధికలాభాలను గడించిననూ, అనుకోని కారణాలచే ప్రభుత్వానికి అపరాధంగా మూల్యాన్ని చెల్లించుకుందురు. పలు సందర్భాలలో దౌర్జన్యంతోనే వినియోగ వస్తువుల ధరలను పెంచి సొమ్ము చేసుకునే వారిని ప్రభుత్వాధినేతలు అదుపు చేయలేరు. శిక్షించలేరు.

### 1వ శుక్ర మౌఢ్యమి (2016 ఏప్రిల్ 30 - జూలై 13)

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర చైత్రమాసం బ.నవమి శనివారం 30 ఏప్రిల్ 2016 రాత్రి 11గం॥26ని॥లకు మేషరాశిలో తూర్పుదిశన అశ్వని నక్షత్ర 3వపాదంలో శుక్రగ్రహం అస్తమించుటచే శుక్రమౌఢ్యమి ప్రారంభమైనది. తిరిగి ఆషాఢ శు.నవమి బుధవారం 13 జూలై 2016 ఉదయం 7గం॥39ని॥లకు పుష్యమి 2వపాదంలో పశ్చిమదిశన శుక్ర గ్రహం ఉదయించుటచే శుక్రమౌఢ్యమి త్యాగమగును.

### గురుమౌఢ్యమి ( 2016 సెప్టెం 12 - అక్టో 10)

శ్రీ దుర్ముఖి భాద్రపద శు.దశమి సోమవారం 12 సెప్టెంబరు 2016 సూర్యోదయ పూర్వం తె3గం॥09ని॥లకు కన్యారాశిలో ఉత్తర నక్షత్ర 3వపాదంలో పశ్చిమదిశన గురుగ్రహం అస్తమించుటచే గురు మౌఢ్యమి ప్రారంభమై, తిరిగి ఆశ్వీజమాసం శు.నవమి సోమవారం 10 అక్టోబరు 2016 సాయంత్రం 5గం॥51ని॥లకు తూర్పుదిశన హస్త నక్షత్ర 1వ పాదంలో గురుగ్రహం ఉదయించుటచే గురుమౌఢ్యమి త్యాగమగును.

### 2వ శుక్ర మౌఢ్యమి ( 2017 మార్చి 20 - 30 )

శ్రీ దుర్ముఖి ఫాల్గుణ బ.అష్టమి సోమవారం 20 మార్చి 2017 సాయంత్రం 4గం॥13ని॥లకు పశ్చిమదిశన ఉత్తరాభాద్ర నక్షత్ర 4వ పాదంలో వక్ర శుక్రగ్రహం అస్తమించుటచే శుక్రమౌఢ్యమి ప్రారంభమై, శ్రీ హేవిళంబి సంవత్సర చైత్రమాస శు.తదియ గురువారం 30 మార్చి 2017 మధ్యాహ్నం 3గం॥49ని॥లకు తూర్పుదిశన ఉత్తరాభాద్ర నక్షత్ర 2వ పాదంలో వక్ర శుక్రుడు ఉదయించుటచే శుక్ర మౌఢ్యమి త్యాగమగును.

### కార్తిక పూర్ణిమకు అతి

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర కార్తికపూర్ణిమ 14 నవంబరు 2016 సోమవారం మహాకార్తికీ పర్వదినాన అతి పెద్దజాబిలి కృత్తిక నక్షత్ర మేషరాశిలో దర్శనమివ్వబోతున్నది. సూర్యుడు విశాఖ3వ పాదంలో ఉండి, చంద్రుడు కృత్తిక మొదటిపాదంలో ఉన్నస్థితిని శాస్త్రరీత్యా మహతీ అని పిలుస్తారు. ఈ సమయంలో చేసే స్నాన, దానాదులచే పుణ్య ఫలితాలు కల్గునని శాస్త్ర వచనం. దీనికి తోడు ఖగోళంలో నవంబరు 14 సాయంత్రం 5గం॥36ని॥ల నుంచి రాత్రి 7గం॥22ని॥ల వరకు కనపడే పూర్ణచంద్రుడు సాధారణ స్థితికంటే అతిపెద్ద జాబిలిగా కనపడును. ఈ మహతీ సమయంలోనే కృత్తికా దీపాన్ని వెలిగించి చంద్రదర్శనం చేయాలి. అంతేకాక మరునాడు 15 నవంబరు మంగళ వారం కృత్తికా నక్షత్రం ఉన్నందున సూర్యోదయం తదుపరి పూజా మందిరాలలో భౌమకృత్తిక జ్యోతిని ప్రజ్వలించేది. - శ్రీనివాసగార్గేయ

### వాస్తు కర్తరి మే 4 నుంచి 28 వరకు

శ్రీ దుర్ముఖి చైత్ర బ.ద్వాదశి బుధవారం 4 మే 2016 ఉదయం 8గం॥31ని॥లకు శ్రీ సూర్యనారాయణుడు భరణి నక్షత్ర తృతీయపాద ప్రవేశంతో వాస్తుకర్తరి ప్రారంభమై, మే 28 శనివారం వైశాఖ బ.సప్తమి మధ్యాహ్నం 1గం॥28ని॥లకు రోహిణి నక్షత్ర ద్వితీయ పాదంలోకి ప్రవేశించ టంతో వాస్తుకర్తరి త్యాగమగును. ఈ సమయంలో శంఖుస్థాపనలు చేయరాదు. గృహప్రవేశాలు, మర్మమత్తులు చేయవచ్చును.

### అగ్ని కర్తరి మే 11 నుంచి 24 వరకు

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర వైశాఖ శు.పంచమి 11 మే 2016 బుధవారం ఉ5గం॥49ని॥లకు జగద్రక్షకుడైన శ్రీ సూర్యనారాయణుడు కృత్తిక 1వపాద ప్రవేశంతో అగ్ని కర్తరి ప్రారంభం. వైశాఖ బ.తదియ మే 24 మంగళవారం అర్ధరాత్రి తదుపరి 2గం॥07ని॥లకు శ్రీ సూర్యనారాయణుడు కృత్తికా నక్షత్రాన్ని విడుచుటచే అగ్నికర్తరి త్యాగమగును. నూతులు త్రవ్వుట, గడ్డితో ఇండ్లకప్పులు వేయుట నిషిద్ధం.

### ఆరుద్రకార్తె జూన్ 21న ప్రవేశం

శ్రీ దుర్ముఖి జ్యేష్ఠ బ.విదియ మంగళవారం 21 జూన్ 2016 పూర్వాషాఢ నక్షత్ర కుంభలగ్న సమయం రాత్రి 11గం॥00ని॥లకు, ఆరుద్రకార్తె ప్రవేశించును. నైఋతి ఋతుపవన ప్రభావం అధికంగా ఉన్నప్పటికీ ఎల్‌నినో ప్రభావంచే వర్షములు ఆలస్యంగా కురియును. ఉష్ణోగ్రతలు అధికస్థాయిలోనే ఉండును. అరేబియా, బంగాళాఖాతాలలో ఆవర్తనలు ఏర్పడి, ఆలస్యంగా భారీవర్షములు కలవు.

### కృష్ణా పుష్కర నిత్యకృత్యములు

12.8.2016 శుక్రవారం: హిరణ్య, ధాన్య, భూదానములు
13.8.2016 శనివారం: మణి, గో, లవణ, వస్త్రదానములు
14.8.2016 ఆదివారం: గుడ,ఫల,శాక,రజత అశ్వప్రతిమ దానములు
15.8.2016 సోమవారం: ఘృత, తైల, క్షీరదానములు
16.8.2016 మంగళవారం: ధాన్య, వృషభ, మహిష, నాగలి దానములు
17.8.2016 బుధవారం: ఘనసార, చందన, ఔషధ, కస్తూరాదులు
18.8.2016 గురువారం: గృహ, పీట, శయ్య, ఆందోళికా దానములు
19.8.2016 శుక్రవారం: చందన, కందమూల, పుష్పదానములు
20.8.2016 శనివారం: పిండప్రదాన, షోడశదానములు
21.8.2016 ఆదివారం: పుష్పహార, ముత్యాలహార, రజతదానములు
22.8.2016 సోమవారం: గ్రంధ, యజ్ఞోపవీత, తాంబూల దానములు
23.8.2016 మంగళవారం: షోడశదానములు, నువ్వులు

## మకరసంక్రమణం

రాక్షస నామకుడు
ఏనుగు వాహనం

శ్రీ దుర్ముఖి పుష్య బ.విదియ శనివారం 14 జనవరి 2017 ఆశ్లేష నక్షత్ర ప్రీతియోగ, గరజికరణం ఉ7గం॥39ని॥లకు జగద్రక్షకుడైన శ్రీ సూర్యభగవానుడు ఉత్తరాషాఢ నక్షత్ర 2వపాదమైన మకరరాశి ప్రవేశంతో ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమగును.

శ్రీ దుర్ముఖి సంవత్సర మకరసంక్రాంతి పుణ్యపురుషుడు **కాశ్యపస గోత్రోద్భవుడై,** రాక్షస నామధేయం కలిగి, శుద్ధమైన నీటితో స్నానమాచరించి, నీలాంబర వస్త్రమును ధరించి, పారాణిని లేపనముగా, జపాపుష్పమును చేతనుంచి, గోమేధిక ఆభరణములను... కోదండ మును ఆయుధముగా ధరించి, బంగారు ఛత్రమును గైకొని, సీసపాత్ర లోని పాలను మరియు రేగుపండ్లను ఆహారంగా తీసుకుంటూ, చిరు నవ్వుతో ఏనుగువాహనంపై ఆగ్నేయ దిక్కుగా ప్రయాణం సాగిస్తున్నాడు.

ఈ కారణంగా ప్రజలను భయాందోళనలు రేకెత్తించి వారి మధ్య శతృత్వం ప్రబలే విధంగా చేసే వారందరినీ రక్షణశాఖ వారు కట్టు దిట్టం చేస్తారు. అలాగే సమాజానికి సమస్యలు సృష్టించే కొంతమంది స్త్రీలను కూడా అదుపులోకి తీసుకుందురు. రాజవంశీయులకు విశేషస్థితి తగ్గును. అతిముఖ్య రోగాలకు తగిన మందులను కనుగొందురు. భారీ వర్షములు దక్షిణభారతంలో ఎక్కువగా ఉండును. రాష్ట్రాల మధ్య, దేశాలమధ్య నేతలు కాలుదువ్వేరీతిలో పరిస్థితులు ఎదురవుతుండును. మొత్తం మీద శ్రీ దుర్ముఖిలో దుర్మార్గులకు తగిన రీతిలో కఠినదండనలు ఉండగలవు.

2017 జనవరి 14 శనివారం మకరసంక్రాంతి పర్వదినాన తమ వంశాభివృద్ధిని కాంక్షిస్తూ, పితృదేవతల సంతోషించేలా, మానవతాభావంతో శక్తి కొలది ముఖ్య దానములను చేయుచూ, తర్పణ కార్యక్రమాలను కూడా ఆచరించినచో సర్వసౌఖ్యములతో పాటు వంశాభి వృద్ధి కల్గి మనశ్శాంతినుండునని శాస్త్రవచనము.

## శ్రీకృష్ణ జన్మాష్టమి 2016 ఆగస్టు 24నే

శ్రావణ బహుళ అష్టమితిథి నిశీధి వ్యాప్తిలో ఉంటేనే శ్రీకృష్ణాష్టమిని నిర్ణయిస్తారు. ఆరోజునే స్మార్తులు, మాధ్వులు ఆచరిస్తారు. వైష్ణవులు మాత్రం వారి శాస్త్రనిర్దేశాల ప్రకారం ఆరోజుంటే ఆచరిస్తారు లేదా వారి సంప్రదాయం ప్రకారం మరోరోజున ఆచరిస్తారు. వైష్ణవ సాంప్రదాయరీత్యా శ్రావణ బ.అష్టమికి సూర్యుడు సింహరాశిలో ఉండాలి. సప్తమితో కూడిన అష్టమి గానీ, కృత్తికతో ఉన్న రోహిణిగానీ ఉండకూడదు. నవమితిథి ఉన్న, దశమి తిథి ఉన్నప్పటికీ రోహిణి నక్షత్రం అర్ధరాత్రి వ్యాప్తి ఉంటే చేసుకుంటారు. ఒకవేళ ఆ సమయానికి సూర్యుడు సింహరాశిలో రాకపోతే, ఆ మాసాన్ని వదిలిపెట్టి తదుపరి వచ్చే భాద్రపదమాసంలో చేసుకుంటారు. ఇది వారి ఆచారం.

శ్రీకృష్ణాష్టమి, వైష్ణవ శ్రీకృష్ణ జయంతి ఒకేరోజు రావచ్చు. ఒకరోజు తేడాతో రావచ్చు, లేదా ఒక మాసం తేడాతో రావచ్చు.

పాఠకులకు కొన్ని ఉదాహరణలు

శ్రీ సర్వధారిలో 2008 ఆగస్టు 23 స్మార్త, మాధ్వ శ్రీకృష్ణాష్టమి.
2008 ఆగస్టు 24 వైష్ణవ శ్రీకృష్ణజయంతి
శ్రీ విరోధిలో 2009 ఆగస్టు 13 స్మార్త, మాధ్వ శ్రీకృష్ణాష్టమి
2009 సెప్టెంబరు 13 వైష్ణవ శ్రీకృష్ణజయంతి

గతంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము శ్రీకృష్ణాష్టమికే ప్రభుత్వ సెలవుదినాన్ని ప్రకటిస్తారు కానీ వైష్ణవ శ్రీకృష్ణజయంతికి సెలవుదినాన్ని ప్రకటించరు. కానీ 2010లో సెప్టెంబరు 1 స్మార్త, మాధ్వ శ్రీకృష్ణాష్టమి కాగా, సెప్టెంబరు 2 వైష్ణవ శ్రీకృష్ణజయంతిగా చేసుకున్నారు. అయితే ఆనాటి రాష్ట్ర ప్రభుత్వం ఓ స్వామీజికి లొంగిపోయి వైష్ణవ శ్రీకృష్ణ జయంతిగా ఉన్న సెప్టెంబరు 2వతేదిని సెలవుదినంగా ప్రకటించింది. సెప్టెంబరు 2 నాటి విషయంలో ప్రజలలో పండుగ 1వతేదా లేక 2వతేదా అనే మీమాంస కల్లటము (ప్రభుత్వ తప్పిదం చేత), పంచాంగ కర్తలను నిందించటము, దీనిని ఆసరాగా చేసుకుని మీడియా సంస్థలు భూతద్దంలో చూపించటము సర్వ సాధారణమైనది. ఇది ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరికి ఓ తాజా ఉదాహరణ.

ప్రజలందరికీ తెలిసిందేమంటే.... సూర్యోదయంలో తిథి ఉండాలని, తెలిసీ తెలియక పండుగలను నిర్ణయించుకుంటారు. అధికభాగం ఆలయ అర్చకులకి పండుగలపై అవగాహన లేకపోవటంతో, వారి దగ్గరికి వచ్చే టి.వి ప్రతినిధులకి, భక్తులకి....సూర్యోదయంలో తిథి ఉందని అంచేత పండుగ చేసుకోవాలని తెలియని ధోరణితో చెప్పే వివరాలను టి.విలలో ప్రసారం చేయటం జరుగుతుంది. తెలిసీ తెలియని వారు టి.విలలో చెప్పటం చేత కొత్త విషయం మొదలవుతుంది.

ఈరోజులలో టి.వి మీడియా చాలా హెచ్చుస్థాయిలో ఉండి, ప్రపంచంలో ఏ మూల ఏది జరిగినా నిముషాలలో తెలుసుకుంటున్నాం. దేశంలో పలు ప్రాంతీయ ఆచారాలున్నందున దక్షిణాదిన పండుగను ఓరోజు చేసుకుంటే ఉత్తరాదిన మరోరోజు చేసుకుంటారు. ఎలక్ట్రానిక్ మీడియా వారు దీనిని వివాదంగా చూపిస్తారు.

ఉదాహరణకు శ్రీ సర్వధారి శ్రీకృష్ణజన్మాష్టమి ఉడిపిలో ఉండే వైష్ణవులకు, ద్వారకలో ఉండే వైష్ణవులకు వ్యత్యాసాలు ఉన్నట్లుగా చూపించారు. ఓ ప్రాంత వైష్ణవులు అర్ధరాత్రి వరకు రోహిణి నక్షత్ర ముంటే చాలని, సూర్యోదయంలో కృత్తిక ఉన్నా ఫర్వాలేదు అనుకుని 24.8.2008న కృష్ణజయంతిని ఆచరించారు. మరో ప్రాంత వైష్ణవులు కృత్తిక అసలు ఉండకూడదు, సూర్యోదయం నుంచే రోహిణి ఉండాలని 25.8.2008న కృష్ణ జయంతిని ఆచరించారు. ఇది వైష్ణవ సిద్ధాంత నిర్దేశాల ప్రకారం జరుపుకున్నారు. **కానీ స్మార్తులు, మాధ్వులు మాత్రం శ్రీకృష్ణాష్టమిని 2008లో ఆగస్టు 23నే ఆచరించారు.**

అయితే ఈ దుర్ముఖి నామ సంవత్సరంలో అసలు దృగ్గణితానికి, పూర్వ గణితానికే అష్టమి తిథిలోనే వ్యత్యాసం వచ్చేసింది. దృగ్గణితం ప్రకారం 2016 ఆగస్టు 24 శ్రావణ బహుళ అష్టమి రాత్రి 10.18ని॥లకి ప్రారంభమై, ఆనాటి నిశీధిలో ఉన్నందున 24వతేది బుధవారమే స్మార్త, మాధ్వ శ్రీకృష్ణాష్టమిగా దృగ్గణిత రీత్యా ప్రకటించటమైనది.

పూర్వగణితంలో 2016 ఆగస్టు 24 శ్రావణ బ.అష్టమి అర్ధరాత్రి తదుపరి 1.08ని॥లకు ప్రారంభం కావటంతో, ఆగస్టు 25 స్మార్త,మాధ్వ శ్రీకృష్ణాష్టమిగా, పూర్వగణితం వారు ప్రకటిస్తారు.

**ప్రస్తుతం గణిత వ్యత్యాసంతో పండుగలో తేడా వచ్చింది. ఇది గణిత వ్యత్యాసం వలన సమస్య వచ్చిందని, ఏ ఒక్కరూ ఆలోచించరు.** ఎవరికి తోచిన అభిప్రాయాన్ని వారు టి.విలలో చెప్పటం జరుగుతుంది. ఇలాంటి సమస్యలు వస్తుంటాయనే భారతప్రభుత్వం వారు అందరికీ ఆమోదమైన, ప్రామాణికమైన, ఖచ్చితమైన ఋజువుకి నిలబడే దృగ్గణిత పంచాంగాలనే సమ్మతించింది. 14 భాషలలో రాష్ట్రీయ పంచాంగం అనే పేరుతో దృగ్గణిత పంచాంగం ప్రభుత్వం ద్వారా వస్తున్నప్పటికీ, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వనేతలకు, ఉన్నతాధికారులకు చీమకుట్టినట్లు కూడా లేకపోవటం శోచనీయం.

ఇప్పటికైనా తిరుమల తిరుపతి దేవస్థాన ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ గారు విజ్ఞతతో ఆలోచించి, నాసా వారి సమయాలతో ఖచ్చితంగా ఏకీభవిస్తూ ఉండే దృగ్గణితరీత్యా పంచాంగముండాలని ఆదేశిస్తే.... జీవితకాలంలో తెలుగు రాష్ట్రాలలో... పర్వదిన తేడాలు రానే రావు.

కేవలం స్వార్ధానికి కొంతమంది చేసే కుట్రలు, కుతంత్రాలు వల్లనే ప్రజలు సమస్యలకు గురి అవుతున్నారు. **ఇప్పటికైనా పాఠకులు నిజానిజాలను గ్రహించి.... సకల చంద్ర,సూర్య గ్రహణాలను ఖచ్చితంగా చెప్పే దృగ్గణిత పంచాంగాలకే పెద్దపీట వేయాలని కోరుతూ, తిరుమల తిరుపతి దేవస్థానం వారు దృగ్గణిత పంచాంగకర్తను ఆస్థాన సిద్ధాంతిగా నియమించాలని కోరుతున్నాను.- శ్రీనివాసగార్గేయ**

## శరన్నవరాత్రులపై ధర్మశాస్త్ర నిర్ణయాలు

### దేవీ నవరాత్ర కలశస్థాపనకు సర్వోత్తమ రోజు

**అస్యామేవ ప్రతిపది పరవిద్ధాయాం శారదానవరాత్రప్రారంభః**

ఆశ్వీజ శుక్ల విదియతో కలిసిన పాడ్యమి నాడు శారదానవరాత్రులు ప్రారంభం చేయాలని ధర్మప్రవృత్తి, మత్స్యపురాణం తెల్పినది.

**కలశస్థాపనం కుర్యాన్నన్దాయామాశ్వినే సితే ।**
**పూజయేద్భక్తిభావేన చణ్డికాం భక్తవత్సలామ్ ॥**
**అస్మిన్ దినే కలశస్థాపనమ్ - ఉక్తఇఃు విశ్వరూపనిబన్దే**

ద్వితీయతో కూడిన పాడ్యమినాడే దేవీ కలశమును స్థాపించి చండీదేవిని పూజించాలని విశ్వరూప నిబంధనము స్పష్టం చేసింది.

**యా చాశ్వయుజమాసే స్యాత్ ప్రతిపద్భద్రయాన్వితా ।**
**శుద్ధా మమార్చనం తస్యాం శతయజ్ఞఫలప్రదమ్ ॥ - దేవీపురాణం**

విదియతో కూడిన పాడ్యమినాడు దేవిని పూజించినచో నూరు యజ్ఞములు చేసిన మహాఫలితములు కల్గునని దేవీపురాణం పేర్కొన్నది. కనుక అక్టోబరు 1 శనివారం కాకుండా 2 ఆదివారం నుంచి దేవీనవరాత్రులను ఆచరించటం ప్రజలందరికీ శ్రేయస్కరమని విజ్ఞులైన పెద్దలు గమనించగలరని ఆశిస్తాము.

### మూలలో సరస్వతీ ఆవాహన - పూర్వాషాఢలో పూజ

**మూలేషు స్థాపనం దేవ్యా పూర్వాషాధా సుపూజనం।**
**ఉత్తరాసు బలిందద్యాత్ శ్రవణేన విసర్జయేత్॥ - ధర్మసింధు**

మూల నక్షత్ర ప్రథమపాదంలో సరస్వతీ దేవిని ఆవాహనం చేసి, పూర్వాషాఢ నక్షత్రంలో విశిష్ట పూజలు గావించి, శ్రవణానక్షత్రంలో సరస్వతీ దేవిని విసర్జించాలి. ధర్మశాస్త్ర రీత్యా 2016 అక్టోబరు 7 శుక్రవారం మధ్యాహ్నం 3గం॥27ని॥ల నుంచి 5గం॥18ని॥ మధ్యకాలంలో సరస్వతీ దేవిని ఆవాహనం చేసి, 8 శనివారం సాయంత్రం 4.47 నుంచి రాత్రి 7.00 గం॥ల లోపల మరియు 9 ఆదివారం పగలు 6.02 నుంచి మధ్యాహ్నం 12.07 లోపల సరస్వతీదేవికి పూర్వాషాఢ నక్షత్ర విశేషపూజలు ఆచరించాలి.

## క్షీరాబ్ది ద్వాదశి, చుల్క వ్రత నిర్ణయములు

**ద్వాదశ్యాం కార్తికే శుక్లే హరిం క్షీరాబ్ధిశాయినమ్।**
**పూజయేత్ తులసీమూలే ప్రదోషే మునిపుజ్గవ॥ - విష్ణుపురాణం**

తా॥ కార్తిక శు.ద్వాదశి క్షీరాబ్ధిశయనుడైన శ్రీహరిని ప్రదోష సమయమున తులసీచెట్టు మొదలియందు పూజించవలెనని విష్ణుపురాణము తెల్పినది.

**2016 నవంబరు 11 శుక్రవారం ప్రదోషకాలంలో ద్వాదశితిథి ఉన్నది. విష్ణుపురాణ ప్రకారం నవంబరు 11 క్షీరాబ్దిద్వాదశిగా నిర్ణయం.**

ఊర్జే శుక్లే మునిశ్రేష్ఠ ద్వాదశ్యాముదయే రవేః।

చుల్కవ్రతం ప్రకర్తవ్యం సుతసౌభాగ్యవృద్ధయే॥ - స్మృతి చంద్రిక

తా॥ కార్తికమాసం శుక్ల ద్వాదశి రోజున చుల్కవ్రతమును ఆచరించాలి. దీనినే చుల్క ద్వాదశి అని కూడా అంటారు. ద్వాదశితిథి ఉదయవ్యాప్తి ఉన్నప్పుడే గ్రహించాలి. సంతాన, సౌభాగ్యానికై చుల్కవ్రతం ఆచరించ వలెనని స్మృతిచంద్రిక తెల్పినది.

నవంబరు 12 శనివారం కార్తికమాస శుక్లద్వాదశి తిథి ఉదయ వ్యాప్తిలో ఉన్నందున సంతాన సౌభాగ్యవృద్ధి కొరకు చుల్కవ్రతాన్ని ఆచరించ వలెను. (భారతప్రభుత్వ ఆమోదిత గణితమైన దృగ్గణిత ప్రకారంగా సమయాలను తీసుకుని పై పర్వదినాలని నిర్ణయించటం జరిగింది. ఖచ్చితమైన ఋజువుకు దృగ్గణితము నూటికి నూరు భాగాలు నిలబడును. కనుక దృగ్గణితమే శాస్త్రీయమైనది, ప్రామాణికమైనది, ఆచరణీయమైనది.)

## కృష్ణా పుష్కరాలు 2016 ఆగస్టు 12 నుంచి 23

శ్రీ దుర్ముఖి శ్రావణ శుక్లనవమి గురువారం 11 ఆగస్టు 2016 రా9గం॥28ని॥లకు పుష్కరరాజు గురుగ్రహం ఉత్తర నక్షత్ర 2వపాదమైన కన్యారాశి ప్రవేశంతో ఆగస్టు 12 నుంచి సార్థత్రికోటి తీర్థసహిత కృష్ణా నదికి పుష్కరాలు ప్రారంభమై ఆగస్టు 23 మంగళవారంతో ముగియును. ఇతర తేదీలలో పుష్కరాలు ఆచరించటము పుణ్యప్రదం కాదు.

కృష్ణానది మహారాష్ట్రలోని మహాబళేశ్వరం వద్ద సహ్యాద్రి పర్వత ప్రాంతాలలో పుట్టి మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలనుంచి ప్రవహిస్తూ చివరలో బంగాళాఖాతంలో కలియును. దేవతల కోరికపై అశ్వత్థవృక్ష రూపం ధరించిన గోలోక కృష్ణుడు తన శరీరంలోని వామభాగం నుంచి కృష్ణానదిని ఉద్భవించాడని పురాణకథనం. ఈ నదికే కృష్ణవేణి అనే పేరుకూడా ఉన్నది. బ్రహ్మదేవుడు ఈ ప్రాంతంలో తపస్సు చేసిన కారణంగా సహ్యాద్రిని బ్రహ్మగిరి అనియు, మూర్తిరూపంలో వేదాలు శంభోశంకరుని ప్రార్థించిన ప్రాంతం గనుక వేదగిరి అని పిలువబడును. ఇట్టి వేదగిరి సమీపంలోనే శ్రీకృష్ణభగవానుడు అశ్వత్థ రూపం ధరించాడని ప్రతీక. మునీశ్వరుల ప్రార్థనమేరకు శివుడు లింగాకారంలో వెలిసినట్లుగాను అక్కడ ఉండే ఉసిరిక వృక్షం నుండి 'వేణీ' అనే నది ఆవిర్భవించి కృష్ణానదిలో కలిసిందని పురాణకథనం. ఈ రెండు కలిసినందునే కృష్ణవేణి నదిగా పిలువబడుతున్నది.

కృష్ణవేణి నది పవిత్రనామాన్ని ఉచ్చరించిన వారికి గత ఏడు జన్మల నుంచి వచ్చిన పాపాలు తొలుగునని, స్వర్గలోక ప్రాప్తి కల్గుతుందని పురాణ కథనం. ఆస్తికవరేణ్యులందరూ 2016 ఆగస్టు 12 నుంచి 23 వరకు 12 రోజులపాటు కృష్ణానది పుష్కరస్నానాలను, తర్పణ పిండప్రదానాదులను ఆచరించాలని శాస్త్రవచనం.

గత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రస్తుతం రెండు తెలుగురాష్ట్రాలుగా విభజించబడింది. ఈ రెండు తెలుగురాష్ట్రాల మధ్యభాగంలోనే విజయవాడ నగరం ఉన్నది. ప్రస్తుతం ఈ తెలుగురాష్ట్రానికి అమరావతి అనే పేరు పెట్టటం జరిగింది. గుంటూరుకు 35 కిలోమీటర్ల దూరంలో ఉన్న పంచారామములలో ఉన్న క్షేత్రమే ఇది. ఇక్కడ అమరేశ్వరస్వామి ఆలయం ప్రఖ్యాతమైనది. విజయవాడలోని శ్రీ కనకదుర్గ సమేత మల్లిఖార్జున స్వామి, విజయవాడకు 12 కిలోమీటర్ల దూరంలో మంగళ గిరి పానకాల స్వామి, కృష్ణానదీ తీరంలో ఉన్న శ్రీశైల మల్లిఖార్జునుడు, బిచ్‌పల్లి ఆంజనేయస్వామి, వేదాద్రి లక్ష్మీనరసింహస్వామి, శ్రీకాకుళం ఆంధ్రమహా విష్ణువు రాజ్యలక్ష్మీ దేవి క్షేత్రములు దర్శనీయములు.

## శ్రీ హేవిళంబి ఉగాది 28.3.2017

గతంలో శ్రీ సర్వజిత్ ఉగాది దృగ్గణిత ప్రకారంగా 19 ఏప్రిల్ 2007గా నిర్ణయిస్తే పూర్వగణిత పంచాంగకర్తలు 20 ఏప్రిల్ 2007గా నిర్ణయించారు. ఈ అంశంపై ఆనాడు హైదరాబాద్‌లో దృగ్గణిత మరియు పూర్వగణిత పంచాంగకర్తలతో ఆనాటి రాష్ట్రప్రభుత్వం తరపున శ్రీ కె.సుందరకుమార్ గారు, శ్రీ ఐ.వి.సుబ్బారావు గారు, శ్రీ కె.వి. రమణాచారి గారు, శ్రీ పి.వి.ఆర్.కె ప్రసాద్ గారు ఓ కమిటీగా ఏర్పడి శాస్త్ర నిర్ణయాలన్నింటినీ పూర్తిగా తెలుసుకుని 19 ఏప్రిల్ 2007 శ్రీ సర్వజిత్ నామ సంవత్సర ఉగాదిగా రాష్ట్రప్రభుత్వం ప్రకటించటమైనది. ఈ విషయాన్ని ఆనాడు అసెంబ్లీలో ఆనాటి ముఖ్యమంత్రి శ్రీరాజశేఖర రెడ్డిగారు సమక్షంలోనే శ్రీరోశయ్య గారు తెలియజేయటము జరిగినది.

కనుక భారతప్రభుత్వ రాష్ట్రీయ పంచాంగము, మరియు సశాస్త్రీయ మైన ప్రామాణికమైన ఆచరణీయమైన దృగ్గణిత పంచాంగం ప్రకారం దిగువ తేదీ హేవిళంబి నామ సంవత్సర ఉగాది పర్వదినం నిర్ణయము.

**28 మార్చి 2017**

## 2016 - ముఖ్య కార్తెలు - ఫలితాలు

| కార్తెలు | ప్రవేశతేది | వారం | సమయం | ఫలితం |
|---|---|---|---|---|
| అశ్వని | ఏప్రిల్ 13 | బుధ | రా07.48 | ఉష్ణం |
| భరణి | ఏప్రిల్ 27 | బుధ | మ11.43 | ఉష్ణం |
| కృత్తిక | మే 11 | బుధ | ఉ05.49 | ఆవర్తనం |
| రోహిణి | మే 24 | మంగళ | రా02.07 | వడగాలులు |
| మృగశిర | జూన్ 7 | మంగళ | రా11.57 | ఆవర్తనం |
| ఆర్ద్ర | జూన్ 21 | మంగళ | రా11.00 | అల్పపీడనం |
| పునర్వసు | జూలై 5 | మంగళ | రా10.34 | ఆవర్తనం |
| పుష్యమి | జూలై 19 | మంగళ | రా10.07 | పీడనం |
| ఆశ్లేష | ఆగస్ట్ 2 | మంగళ | రా09.01 | భారీవర్షం |
| మఘ | ఆగస్ట్ 16 | మంగళ | సా06.40 | పీడనం |
| పుబ్బ | ఆగస్ట్ 30 | మంగళ | మ02.40 | వా.గుండం |
| ఉత్తర | సెప్టెం 13 | మంగళ | ఉ08.28 | వా.గుండం |
| హస్త | సెప్టెం 26 | సోమ | రా12.01 | అల్పపీడనం |
| చిత్ర | అక్టో 10 | సోమ | మ12.55 | తుఫాను |
| స్వాతి | అక్టో 23 | ఆది | రా11.29 | పీడనం |
| విశాఖ | నవం 6 | ఆది | ఉ07.32 | వా.గుండం |
| అనూరాధ | నవం 19 | శని | మ01.38 | సువృష్టి |
| జ్యేష్ఠ | డిశం 2 | శుక్ర | సా05.52 | మేఘావృతం |
| మూల | డిశం 15 | గురు | రా08.55 | చలితీవ్రత |

## ఆదాయ వ్యయ రాజ్య పూజ్యావమానములు

| రాశులు | ఆదాయము | వ్యయము | రాజ్యపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | రెండు | ఎనిమిది | ఒకటి | ఏడు |
| వృషభం | పదకొండు | నాలుగు | నాలుగు | ఏడు |
| మిథునం | పధ్నాలుగు | పదకొండు | ఏడు | మూడు |
| కర్కాటకం | ఎనిమిది | పదకొండు | మూడు | మూడు |
| సింహం | పదకొండు | ఐదు | ఆరు | మూడు |
| కన్య | పధ్నాలుగు | పదకొండు | రెండు | ఆరు |
| తుల | పదకొండు | నాలుగు | ఐదు | ఆరు |
| వృశ్చికం | రెండు | ఎనిమిది | ఒకటి | రెండు |
| ధనస్సు | ఐదు | పధ్నాలుగు | నాలుగు | రెండు |
| మకరం | ఎనిమిది | ఎనిమిది | ఏడు | ఐదు |
| కుంభం | ఎనిమిది | ఎనిమిది | మూడు | ఐదు |
| మీనం | ఐదు | పధ్నాలుగు | ఆరు | ఐదు |
| సర్వాదాయము 59 - సర్వవ్యయము 71 | | | | |

## కందాయ ఫలములు

| నక్షత్రం | ఫలములు | నక్షత్రం | ఫలములు | నక్షత్రం | ఫలములు |
|---|---|---|---|---|---|
| అశ్వని | 7-1-4 | మఖ | 2-1-2 | మూల | 5-1-0 |
| భరణి | 2-2-1 | పుబ్బ | 5-2-4 | పూర్వాషాఢ | 0-2-2 |
| కృత్తిక | 5-0-3 | ఉత్తర | 0-0-1 | ఉత్తరాషాఢ | 3-0-4 |
| రోహిణి | 0-1-0 | హస్త | 3-1-3 | శ్రవణం | 6-1-1 |
| మృగశిర | 3-2-2 | చిత్ర | 6-2-0 | ధనిష్ఠ | 1-2-3 |
| ఆర్ద్ర | 6-0-4 | స్వాతి | 1-0-2 | శతభిషం | 4-0-0 |
| పునర్వసు | 1-1-1 | విశాఖ | 4-1-4 | పూర్వాభాద్ర | 7-1-2 |
| పుష్యమి | 4-2-3 | అనూరాధ | 7-2-1 | ఉత్తరాభాద్ర | 2-2-2 |
| ఆశ్లేష | 7-0-0 | జ్యేష్ఠ | 2-0-3 | రేవతి | 5-0-4 |

## తీర్థ శ్రాద్ధీయ పిండ ప్రదాన క్రమము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | పెదనాన్న లేక చిన్నాన్న | | | | | |
| | పెద్దమ్మ లేక పిన్ని కుమారులు | | | | | |
| మాతా మహీవర్గం | పెద్దమ్మ లేక పిన్ని | | | | | |
| మాతులః / మాతులపత్నీ | అల్లుడు | బావ | మేనత్త భర్త | | | |
| మాతా మహీవర్గం | దౌహిత్రుడు | మేనల్లుడు భాగినేయకః | మేనత్త కుమారుడు | | | |
| పితృవర్గం | కుమార్తె | అక్కలు చెల్లెండ్రు | మేనత్త | మామగారు | స్వామి రక్షకః | గురువు |
| తండ్రిసోదరులు / సోదరులు / సుతః / స్నుషా | తూర్పు / ఉత్తరం / దక్షిణం / పడమర | | | శ్యాలకః బావలు మరుదులు | | |
| మాతృవర్గం / సాపత్నిమాత | | | | అత్తగారు | | |

**గమనిక**

తల్లితండ్రులు లేనివారు లేదా తండ్రి లేనివారు మాత్రమే తర్పణ, పిండప్రదానాదులను ఆచరించాలి. అంతేతప్ప చిన్నారులతో కుటుంబం యావత్తూ వచ్చి పుష్కర స్నానాలను ఆచరించవద్దు. నదిని కలుషితం చేయవద్దు.

శ్లో॥ పితౄణాం పశ్చిమే భాగే - మాతృ పిండం విధీయతే।
మాతా మహశ్చ తత్పూర్వే - ఆత్మ పత్నీ తదుత్తరే ॥

సుత భాతృపితృవ్యాశ్చ - మాతా పిత్రోశ్చ మధ్యమే ।
మాతా మహ మహీ మధ్యే మాతాలస్సహ భార్యకాః ॥

శ్వశూశ్వ శుర యోర్మధ్యే - శ్యాలకస్సు విధీయతే ।
దుహిత్రాదితతోన్యేషాం - శేషం దక్షిణతోవిధిః ॥

పుంపిండం నామత స్త్రీణాం - తత్పుత్రం సముపస్థితం ।
అంగుష్ఠ పరిమాణంతు గోత్రం - మన్యం నసంస్పృశేత్ ॥
నిరాశాః పితరోయాంతి - విపరీతే భవేద్యది ॥

పుష్కరాలు జరిగే పన్నెండు రోజులలో తర్పణ, పిండప్రదానాదులు ఆచరించే వారు, వారి వారి శక్తికొలది పితృదేవతల తృప్తి కొరకై దానములు ఇవ్వటం జరుగును. 12 రోజులలో ఇచ్చే ఈ దానములకు ఓ క్రమపద్ధతి ఉండదు. పంచాంగ పట్టికలలో దానక్రమము ఇచ్చినప్పటికీ ఖచ్చితంగా ఫలాన దానాన్ని ఫలానా రోజునే ఇవ్వవలయును అనే నియమము లేదని గ్రహించేది.

# శ్రీ దుర్ముఖిలో పండుగలు - వ్రతాలు - ముఖ్యదినాలు

**ఏప్రిల్ 2016**

8. శ్రీ దుర్ముఖి ఉగాది
వసంతనవరాత్రారంభం,
తైలాభ్యంగనం,
నవవస్త్రాభరణధారణ,
బ్రహ్మదమనపూజ
చైత్రమాసచంద్రోదయం
9. ఉమాశివాగ్నిదమనపూజ
రజ్జబ్ నెల ప్రారంభం
ఉత్తమమన్వాది
సౌభాగ్యగౌరీవ్రతం
శివడోలోత్సవం
10. గణేశదమనపూజ
భానుకృత్తిక
11. శ్వేతవరాహకల్పాది
శాలిహోత్రహయ5మి,
నాగదమనపూజ,శ్రీవ్రతం
పంచమూర్తివ్రతం
12. స్కందదమనారోపణం
యమునాజయంతి(మధుర)
13. సూర్యదమనపూజ
13. మేషసంక్రాంతి,
తమిళసంవత్సరాది
విషు(కేరళ)
14. అశోకాష్టమి
15. శ్రీరామనవమి
మహిషాసురమర్దని-
దమనారోపణం
16. ధర్మరాజదశమి
శాలివాహనజయంతి
17. కామదాఏకాదశి,
విష్ణుడోలోత్సవం
18. వామనద్వాదశి
19. అనంగత్రయోదశి,
మన్మధపూజ
మహావీరజయంతి
20. శైవదమనచతుర్దశి,
కర్దమక్రీడ
22. మహాచైత్రి,శచీంద్రపూజ
హనుమద్విజయోత్సవం,
చిత్రగుప్తవ్రతం,
రౌచ్యమన్వాది
23. పాతాళవ్రతం
25. సంకష్టహరచతుర్థి

**మే 2016**

1. కార్మికదినోత్సవం
శుక్రమౌఢ్యారంభం
3. వరూధినీఏకాదశి
4. వాస్తుకర్తరి ఉ8.31
5. మాసశివరాత్రి
8. వైశాఖచంద్రోదయం
9. త్రేతాయుగాది
అక్షయతదియ,
పరశురామజయంతి
షాబాన్‌నెలప్రారంభం
11. శ్రీ శంకరజయంతి
12. పుత్రప్రాప్తివ్రతం
గంగాసప్తమి
13. అపరాజితాదేవి వ్రతం
14. బగళాముఖీజయంతి,
వృషభసంక్రాంతి
15. సీతాజయంతి
16. శ్రీవాసవీజయంతి,
శ్రీవీరబ్రహ్మేంద్రజయంతి
తిరుచానూర్ శ్రీ పద్మావతీ
కళ్యాణోత్సవం
17. మోహినీఏకాదశి
అన్నవరసత్యదేవకల్యాణం
18. జమదగ్నివ్రతం
20. శ్రీ నృసింహజయంతి
చిన్నమస్తాదేవీజయంతి
21. మహావైశాఖి,బుద్ధపూర్ణిమ,
శరభజయంతి,
సంపద్గౌరీవ్రతం
శ్రీ అన్నమయ్యజయంతి
22. నారదజయంతి
25. పార్థివకల్పాది
సంకష్టహరచతుర్థి
28. కర్తరిత్యాగం మ1.28
31. శ్రీహనుమజ్జయంతి

**జూన్ 2016**

1. అపరైకాదశి
3. మాసశివరాత్రి
6. జ్యేష్ఠమాసచంద్రోదయం
7. రంజాన్‌నెల ప్రారంభం
8. ఉమాచతుర్థి
9. గురుపుష్యమి
10. ఆరణ్యకగౌరీవ్రతం
11. వరుణసప్తమి
12. త్రిలోచనాష్టమి,
ధూమవతీజయంతి
14. దశపాపహరదశమి
15. మిధునసంక్రాంతి
16. నిర్జలేకాదశి
17. శ్రీశంకర కైలాసగమనం
చంపకద్వాదశి
18. శనిత్రయోదశి
20. భౌచ్యమన్వాది,మహాజ్యేష్ఠి
ఏరువాకపున్నమి,
పూరీ జగన్నాధుని
పున్నమిస్నానం
23. సంకష్టహరచతుర్థి
28. శీతలాష్టమి
30. యోగిన్యేకాదశి

**జూలై 2016**

1. కూర్మజయంతి
2. మాసశివరాత్రి
శనిత్రయోదశి
5. ఆషాఢచంద్రోదయం
6. షవ్వాల్‌నెల ప్రారంభం
రంజాన్‌పండుగ
పూరీజగన్నాధరథయాత్ర
7. తెలంగాణాబోనాలారంభం
9. స్కంధపంచమి
10. కుమారషష్ఠి,భానుషష్ఠి
11. వివస్వతసప్తమి
12. మహిషఘ్నిపూజ
13. శుక్రమౌఢ్యత్యాగం
14. చాక్షుషమన్వాది
దధివ్రతారంభం
15. తొలిఏకాదశి
16. వాసుదేవద్వాదశి
కర్కాటకసంక్రమణం
ఉ10.15ని॥లకు
దక్షిణాయనప్రారంభం
19. గురుపూర్ణిమ,మహాషాఢి,
కోకిలావ్రతం
22. ఆడిపదినెట్టు
23. సంకష్టహరచతుర్థి
24. సికింద్రాబాద్
మహంకాళీ జాతర
27. ధర్మసావర్ణిక మన్వాది
29. ఆడికృత్తిక
30. కామికాఏకాదశి

**ఆగస్టు 2016**

1. మాసశివరాత్రి
2. సాయందీపస్తంభారాధన
4. శ్రావణచంద్రోదయం
5. జిల్హాజ్‌నెల ప్రారంభం
మధుశ్రావావ్రతం
6. నాగచతుర్థి (మ.వ్యాప్తి)
7. గరుడపంచమి
8. సామవేదఉపాకర్మ
(పరవిద్ధ గ్రాహ్యం)
11. పుష్పాష్టమీ
12. వరలక్ష్మీవ్రతం
కౌమారీదేవీపూజ
13. ఆశాదశమి
14. పుత్రదాఏకాదశి
15. దామోదరద్వాదశి
స్వాతంత్ర్యదినోత్సవం
16. కృష్ణయజుర్వేదఉపాకర్మ
సింహసంక్రమణం
17. ఋగ్వేదఉపాకర్మ
18. రక్షాబంధనం,
హయగ్రీవజయంతి,
శుక్లయజుర్వేదఉపాకర్మ
19. అశూన్యశయనవ్రతం
20. శ్రీరాఘవేంద్రఆరాధన
21. సంకష్టహరచతుర్థి
24. శ్రీకృష్ణజన్మాష్టమి
26. వైష్ణవ శ్రీకృష్ణజయంతి
28. అజఏకాదశి
30. మాసశివరాత్రి

**సెప్టెంబరు 2016**

1. పోలాలఅమావాస్య
రుద్రసావర్ణికమన్వాది
2. భాద్రపదచంద్రోదయం
3. జిల్హేజ్‌ప్రారంభం
4. తామసమన్వాది
హరితాళికావ్రతం,
షోడశోమావ్రతం
5. వినాయకచతుర్థి
6. ఋషిపంచమి
7. సూర్యషష్ఠి
8. ఆముక్తాభరణవ్రతం
9. జ్యేష్ఠాష్టమివ్రతం,రాధాష్టమి
10. నందనవమి
12. క్షీరవ్రతారంభం,గజలక్ష్మీవ్రతం
గురుమౌఢ్యారంభం
13. పరివర్తన్యేకాదశి
వామనజయంతి,ఓనం
15. అనంతపద్మనాభవ్రతం
16. ఉమామహేశ్వరవ్రతం
కన్యాసంక్రమణం
17. మహాలయపక్షారంభం
18. భాద్రపదమాస
అశూన్యశయన వ్రతం

18. ఉండ్రాళ్లతద్దె (చంద్రోదయవ్యాపినీ)
19. సంకష్టహరచతుర్థి
20. భరణీమహాలయం
20. చంద్రషష్ఠి
23. రుద్రాష్టమి (ప్రదోషం) మధ్యాష్టమి (అపరాహ్ణ), సూర్యసావర్ణికమన్వాది
24. అవిధవనవమి 26. ఇంద్రైకాదశి
27. యతీమహాలయం
28. గజచ్ఛాయ
29. విషశస్త్రహతమహాలయం, మాసశివరాత్రి
30. మహాలయఅమావాస్య, బతుకమ్మపండుగ, కుశగ్రహణం (దర్భస్వీకారం)

**అక్టోబరు2016**

1. దౌహిత్రపాడ్యమి
2. ఆశ్వీజచంద్రోదయం శారదానవరాత్రారంభం కలశస్థాపన,గాంధీజయంతి
3. మొహరం నెలప్రారంభం
5. ఉపాంగలలితావ్రతం (పంచమిప్రదోషవ్యాపినీ)
7. సరస్వతీఆవాహనము
8. సరస్వతీదేవికి పూర్వాషాఢలో సాయంత్రం పూజ
8. దేవీత్రిరాత్రవ్రతం
9. దుర్గాష్టమీ
10. మహర్నవమి, సరస్వతీఉద్వాసనం, స్వారోచిషమన్వాది గురుమౌఢ్యత్యాగం
11. విజయదశమి అపరాజితాదేవిపూజ, ఆయుధపూజ,శమీపూజ దుర్గాదేవీఉద్వాసనం
12. పాశాంకుశఏకాదశి మొహరం
13. గోవత్సద్వాదశి
15. కౌముదీపూర్ణిమ,అక్షక్రీడ (పూర్ణిమ నిశీధిలో ఉండాలి)
16. వాల్మీకిజయంతి,శరత్పౌర్ణిమ
17. ఆశ్వీజ అశూన్యశయనం తులాసంక్రాంతి , కావేరీనది సంక్రమణస్నానం
18. అట్లతద్దె (చంద్రోదయవ్యాప్తి)
19. సంకష్టహరచతుర్థి,భౌమకృత్తిక
26. రమాఏకాదశి
27. వ్యాఘ్రద్వాదశి
28. ధనత్రయోదశి,మాసశివరాత్రి ధన్వంతరీ జయంతి యమదీప ప్రజ్వలన
29. నరకచతుర్దశి
30. దీపావళీ,లక్ష్మీపూజ గుజరాతీసంవత్సరాది, కేదారవ్రతం
31. గోక్రీడోత్సవం,బలిపాడ్యమి కార్తికస్నానారంభం, ఆకాశదీపారంభం

**నవంబరు 2016**

1. కార్తికచంద్రోదయం, భగినీ హస్తభోజనం,
2. త్రిలోచనగౌరీ వ్రతం, సఫర్‌నెల ప్రారంభం
3. నాగచతుర్థి(మధ్యాహ్నికవ్యాప్తి)
5. నాగపంచమి(పరవిద్ధ)
6. అగ్నిషష్ఠి
7. తిరుమల పుష్పయాగం కోటిసోమవారం
8. గోష్టాష్టమి,కార్తవీర్యజయంతి
9. అక్షయనవమి,కృతయుగాది
10. యాజ్ఞవల్క్యజయంతి
11. ప్రభోదినీ ఏకాదశి క్షీరాబ్ధిద్వాదశి (ప్రదోషవ్యాపినీ తీసుకోవాలి)
12. చుల్కద్వాదశి (ద్వాదశి ఉదయవ్యాప్తి అవసరం)
12. శనిత్రయోదశి ప్రదోషం స్వాయంభువమన్వాది
13. వైకుంఠచతుర్దశి
14. మహాకార్తీకి, త్రిపురపూర్ణిమ, జ్వాలాతోరణం, మహతీస్నానం దక్షసావర్ణికమన్వాది
15. భౌమకృత్తిక, దీపపూజ వృశ్చికసంక్రాంతి
16. కార్తికఅశూన్యశయనం
17. సంకష్టహరచతుర్థి
25. ఉత్థానఏకాదశి శనిత్రయోదశి ప్రదోషం
28. మాసశివరాత్రి
29. భౌమ్యమావాస్య,గీతాజయంతి
30. కోటిసూర్యగ్రహణ పుణ్యస్నాన ఫలదినం

**డిశంబరు 2016**

1. మార్గశిరమాసచంద్రోదయం
2. రబ్బీలవ్వల్‌నెలారంభం
5. సుబ్రహ్మణ్యషష్ఠి
7. కాలభైరవాష్టమి
10. మోక్షదాఏకాదశి
11. అఖండద్వాదశాదిత్యవ్రతం
12. హనుమద్వ్రతం శ్రీదత్తజయంతి(శాస్త్రీయం)
13. శ్రీదత్తజయంతి(వ్యావహారిక)
14. ఆర్ద్రోత్సవం 16. ధనుస్సంక్రాంతి
17. సంకష్టహరచతుర్థి
24. సఫలైకాదశి 25. క్రిస్టమస్
27. మాసశివరాత్రి
30. పుష్యమాసచంద్రోదయం
31. రబ్బీసానినెలారంభం

**జనవరి 2017**

1. ఆంగ్లసంవత్సరాది
8. పుత్రదా(ముక్కోటి)ఏకాదశి రైవతమన్వాది
13. భోగిపండుగ
15. మకరసంక్రాంతి, ఉత్తరాయణప్రారంభం
16. కనుమ,పక్షిపూజ సంకష్టహరచతుర్థి
23. షట్‌తిలైకాదశి
26. రిపబ్లిక్‌డే, మాసశివరాత్రి
27. మౌనిఅమావాస్య
29. మాఘచంద్రోదయం
30. జమాదీలవ్వల్‌నెలారంభం
31. తిలచతుర్థి

**ఫిబ్రవరి 2017**

1. వసంతపంచమి 2. వరుణషష్ఠి
3. రథసప్తమి వైవస్వతమన్వంతరాది
4. భీష్మాష్టమి
5. మధ్వనవమి, భానుకృత్తిక
7. భీష్మఏకాదశి (జయ)
9. విశ్వకర్మజయంతి
10. మాఘపూర్ణిమ
13. కుంభసంక్రాంతి
14. సంకష్టహరచతుర్థి
22. విజయేకాదశి
24. మహాశివరాత్రి
26. ద్వాపరయుగాది
28. ఫాల్గుణచంద్రోదయం

**మార్చి 2017**

1. జమాదీసానినెలారంభం
2. పుత్రగణపతి వ్రతం
3. శ్రీకంఠజయంతి
8. అమలకి ఏకాదశి
9. శ్రీనృసింహద్వాదశి
12. కామదహనం,హోళీ, మదనపూర్ణిమ బ్రహ్మసావర్ణికమన్వాది
13. శ్రీమహాలక్ష్మి జన్మదినం వసంతోత్సవం
16. సంకష్టహరచతుర్థి
20. శుక్రమౌఢ్యారంభం
24. పాపమోచన ఏకాదశి
26. మాసశివరాత్రి
28. శ్రీ హేవిళంబి ఉగాది
30. శుక్రమౌఢ్యత్యాగం

# పండుగ, పర్వదిన విశేష పూజా సమయాలు

## చైత్రమాసము (8.4.2016 నుంచి 6.5.2016 వరకు)

| | | |
|---|---|---|
| ఏప్రిల్ 2016 | 08 | శుక్రవారం ఉ6.00 నుంచి 10.06 మధ్యలో శ్రీ దుర్ముఖి సంవత్సర వసంతనవరాత్రారంభ కలశస్థాపన ఆచరించాలి. |
| | 13 | బుధవారం మేషసంక్రమణ పుణ్యకాలం మ12.08-6.19 సంక్రమణ తర్పణ మహాపుణ్య సమయం సా4.15-6.19 |
| | 15 | శుక్రవారం ఉ10.53 నుంచి మ1.21 మధ్యలో శ్రీ సీతారామచంద్ర స్వామి కల్యాణమహోత్సవము జరుగును. మాంగల్యధారణకు ముహూర్తసమయం 12గం॥07ని॥లు. |
| ఏప్రిల్ 2016 | 17 | ఆదివారం కామదాఏకాదశికి ఉపవాసమున్నవారు,మరుసటిరోజు ఉ7.39 నుంచి 8.22 మధ్య ద్వాదశిపారణ (భోజనం) ఆచరించాలి. హరివాసరం ముగింపు ఉ7.39. హరివాసరంలో పారణ చేయరాదు. |
| | 19 | మంగళ చైత్ర శు.త్రయోదశి భౌమప్రదోషం సా6.20-8.38 |
| మే 2016 | 03 | మంగళవారం వరూధినీఏకాదశికి మరునాడు ఉ5.44 నుంచి 8.16 మధ్య ద్వాదశిపారణ (భోజనం) ఆచరించాలి |
| | 04 | బుధవారం చైత్ర బ.త్రయోదశి ప్రదోషకాలం సా6.24-8.40 |
| | 05 | గురువారం చైత్ర మాసశివరాత్రి శివార్చన రా11.41-12.26 |

## వైశాఖమాసము (7.5.2016 నుంచి 5.6.2016 వరకు)

| | | |
|---|---|---|
| మే 2016 | 09 | సోమవారం అక్షయతదియ పూజాసమయం ఉ 5.42-మ12.04 |
| | 14 | శనివారం వృషభసంక్రమణ పుణ్యకాలం ఉ10.29-సా4.53 సంక్రమణ తర్పణ మహాపుణ్య సమయం సా4.29-04.53 |
| | 17 | మంగళవారం మోహినీఏకాదశికి మరునాడు ఉ5.39-8.13 మధ్యన ద్వాదశిపారణ (భోజనం) ఆచరించాలి. |
| | 19 | గురువారం వైశాఖ శు.త్రయోదశి ప్రదోషకాలం సా6.28-8.42 |
| | 20 | శుక్రవారం శ్రీ నృసింహజయంతి సంకల్పసమయం ఉ10.47-1.21 సాయంపూజా సమయం మ3.55-సా6.29 |
| జూన్ 2016 | 01 | బుధవారం అపరఏకాదశి మరుసటిరోజు ఉ5.37 నుంచి 08.11 మధ్యన ద్వాదశిపారణ చేయాలి. |
| | 02 | గురువారం వైశాఖ బ.త్రయోదశి ప్రదోషకాలం సా6.39-8.46 |

## జ్యేష్ఠమాసము (6.6.2016 నుంచి 4.7.2016 వరకు)

| | | |
|---|---|---|
| జూన్ 2016 | 14 | మంగళ మిథునసంక్రమణ పుణ్యకాలం మ12.07-6.37 సంక్రమణ తర్పణ మహాపుణ్య సమయం సా4.27-6.37 |
| | 16 | గురువారం నిర్జలేకాదశి ఉపవాసమున్నవారు, మరుసటిరోజు ఉ5.39 నుంచి 8.14 మధ్యన ద్వాదశి పారణ చేయాలి. |
| | 17 | శుక్రవారం జ్యేష్ఠ శు.త్రయోదశి ప్రదోషకాలం సా6.38-8.50 |
| | 30 | గురువారం యోగినీఏకాదశి మరుసటిరోజు ఉ8.31కి హరివాసర ముగింపు. ద్వాదశిపారణ మ1.29-4.04 |
| జూలై | 02 | శనివారం జ్యేష్ఠ బ.త్రయోదశి శనిప్రదోషకాలం సా6.40-8.53 |

## ఆషాఢమాసం (5.7.2016 నుంచి 2.8.2016 వరకు)

| | | |
|---|---|---|
| జూలై 2016 | 15 | శుక్రవారం శయనేకాదశి మరుసటిరోజు ఉ8.29కి హరివాసర ముగింపు.ద్వాదశిపారణ మ1.30-4.05 |
| | 16 | శనివారం కర్కాటకసంక్రమణ పుణ్యకాలం ఉ5.47-10.26 సంక్రమణతర్పణ మహాపుణ్య సమయం ఉ10.02-10.26 |
| | 17 | ఆదివారం ఆషాఢ శు.త్రయోదశి ప్రదోషం సా6.39-8.53 |
| జూలై | 19 | మంగళ గురుపూర్ణిమన వ్యాసపూజకు ఉ7.50-8.21 |
| | 30 | శనివారం కామికాఏకాదశి మరుసటిరోజు ఉ5.51-6.30 మధ్య ద్వాదశిపారణ (భోజనం) ఆచరించాలి. |
| ఆగస్టు | 31 | ఆదివారం ఆషాఢ బ.త్రయోదశి ప్రదోషకాలం సా6.36-8.51 |
| | 01 | సోమవారం ఆషాఢ మాసశివరాత్రి శివార్చన రా11.51-12.36 |

## శ్రావణమాసము (3.8.2016 నుంచి 1.9.2016 వరకు)

| | | |
|---|---|---|
| ఆగస్టు 2016 | 12 | శుక్రవారం వరలక్ష్మీవ్రతం |
| | 14 | ఆదివారం పుత్రదాఏకాదశి మరుసటిరోజు ఉ5.55-8.25 మధ్య ద్వాదశిపారణ (భోజనం) ఆచరించాలి. |
| | 15 | సోమవారం శ్రావణ శు.త్రయోదశి ప్రదోషం సా6.28-8.45 |
| | 16 | మంగళ సింహసంక్రమణ పుణ్యకాలం మ12.11-సా6.27 సంక్రమణ తర్పణ మహాపుణ్య సమయం సా4.22-6.27 |
| | 18 | గురు శ్రావణపూర్ణిమ రక్షాబంధన శుభసమయం ఉ5.55-మ2.56 అపరాహ్ణ శుభసమయం మ1.26-2.56 |
| ఆగస్టు 2016 | 25 | గురు శ్రీకృష్ణ 5243 వార్షికజయంతి పూజ రా11.46-12.32 |
| | 28 | ఆదివారం అజఏకాదశి మరుసటిరోజు ఉ5.57-8.25 మధ్యన ద్వాదశిపారణ (భోజనం) ఆచరించాలి. |
| | 29 | సోమవారం శ్రావణ బ.త్రయోదశి ప్రదోషం సా6.19-8.38 |

## భాద్రపదమాసం (2.9.2016 నుంచి 30.9.2016 వరకు)

| | | |
|---|---|---|
| సెప్టెంబరు 2016 | 05 | సోమ వినాయకచతుర్థి పూజాకల్ప సమయం ఉ10.52-1.19 |
| | 13 | మంగళ పరివర్తనేకాదశి మరుసటిరోజు ఉ5.59-7.02 మధ్య ద్వాదశిపారణ (భోజనం) ఆచరించాలి. |
| | 14 | బుధవారం భాద్రపద శు.త్రయోదశి ప్రదోషం సా6.06-8.29 |
| | 16 | శుక్రవారం కన్యాసంక్రమణ పుణ్యకాలం మ12.02-సా6.04 సంక్రమణ తర్పణ మహాపుణ్యకాలం సా4.04-6.04 |
| | 20 | మంగళవారం భాద్రపద భరణీమహాలయం మ11.36-3.37 |
| | 27 | మంగళవారం ఇంద్రైకాదశి మరుసటిరోజు ఉ7.10కి హరివాసర ముగింపు.ద్వాదశిపారణ ఉ7.10-8.23 |
| సెప్టెంబరు 2016 | 27 | మంగళవారం యతీమహాలయ శ్రాద్ధం మ11.34-3.32 |
| | 28 | బుధవారం భాద్రపద బ.త్రయోదశి ప్రదోషం సా5.55-8.20 |
| | 29 | గురువారం భాద్రపద మాసశివరాత్రి శివార్చన రా11.33-12.21 |

## ఆశ్వయుజమాసము (1.10.2016 నుంచి 30.10.2016 వరకు)

| | | |
|---|---|---|
| | | మహాలయఅమావాస్య అపరాహ్ణం మ1.08-3.31 |
| అక్టోబరు 2016 | 02 | ఆది విదియతో కూడిన పాడ్యమిన ఉ6.01-7.06 మధ్యలో దేవీ నవరాత్ర కలశస్థాపన ధర్మశాస్త్రరీత్యా ఉత్తమోత్తమం. |
| | 07 | శుక్ర సరస్వతీదేవి ఆవాహన సమయం మ3.27-సా5.48 |
| | 08 | శనివారం పూర్వాషాఢలో సరస్వతీదేవి పూజ సా4.48-6.21 |
| | 10 | సోమవారం శరన్నవరాత్ర ఆయుధపూజ మ1.04-3.24 |
| అక్టోబరు 2016 | 11 | మంగళ విజయదశమి విజయముహూర్తం మ1.51-2.38 |
| | 12 | బుధవారం పాశాంకుశ ఏకాదశి మరుసటిరోజు ఉ6.03-8.23 మధ్యన ద్వాదశిపారణ (భోజనం) ఆచరించాలి. |
| | 13 | గురువారం ఆశ్వీజ శు.త్రయోదశి ప్రదోషకాలం రా7.15-8.11 |
| | 13 | గురువారం గోవత్సద్వాదశి పర్వదిన గోపూజ సా5.36-8.06 |
| | 15 | శనివారం కోజాగరీపూర్ణిమలో అక్షక్రీడకు రా11.28-12.17 |

సంక్రమణ తర్పణ మహాపుణ్య సమయం ఉ6.19-ఉ

7.07

**ఆగస్టు: మృగశిర 1,2:** కార్యదీక్షాబాధ్యత తీసుకుంటారు. గృహ వాతావరణం ఆశాజనకం. సమయస్ఫూర్తిని పాటించలేరు. హడావుడి నిర్ణయాలతో తీవ్ర నష్టం. దైనందిన కార్యక్రమాలలో లోపాలుండును. 5,15,23,24 అనుకూలరోజులు కాదు. **ఆర్ద్ర:** క్షమాపణలు తరచూ ఇవ్వవలసి ఉండును. స్థిర నిర్ణయాలు వాయిదా పడును. శక్తియుక్తులతో విజయానికి చేరువ కాగలరు. ఉద్యోగ నిర్వహణలో సమస్యలు కలవు. సంయమనం పాటించలేరు. సంఘీభావం తెల్పలేరు. 6,16,24,25 ప్రతికూల సమయములు. **పునర్వసు 1,2,3:** నిత్య దినచర్యలో మార్పుల ధికము. ఆర్భాట వ్యవహారాలకు దూరంగా ఉంటారు. స్థానచలనము లుండవు. మనోవ్యాకులత్వం అధికం. రహస్య మంతనాలు పెరుగును. అనవసర విరోధాలు తెచ్చుకుంటారు. శక్తికి మించిన కార్యాలలో తలదూరుస్తారు. 7,8,17,25,26 వ్యతిరేక తేదీలు. ఆగస్టు 16 ఉదయం 6.36 నుంచి 18 మధ్యాహ్నం 11.49 వరకు ప్రతికూల సమయము.

**సెప్టెంబరు: మృగశిర 1,2:** మనోస్థైర్యం పెరుగును. కీర్తి ప్రతిష్ఠలు కాపాడుకుంటారు. అధికారుల వత్తిడి తగ్గును. ప్రధాన శత్రువుల ఆరా తీయుదురు. సోదర అంశాలు మెరుగుపడును. భేషజాలకు వెళ్లవద్దు. రోగనిరోధక శక్తి తగ్గును. మాసాంతంలో ఋణభారం తగ్గును. 1,2,11, 12,20,28,29 ప్రతికూల తేదీలని గమనించాలి. **ఆర్ద్ర:** ఇష్టార్థ సిద్ధి కల్గును. అకారణ విరోధాలు సమసి పోవును. స్పెక్యులేషన్ స్వల్ప రాణింపు. కుటుంబంలో ప్రశాంతత నెలకొనును. విమర్శలను ప్రతిఘటిస్తారు. ముఖ్య కీలక బాధ్యతను తీసుకోలేరు. 2,3,12,13,20,21,29,30 అనుకూల తేదీలు కాదు. **పునర్వసు 1,2,3:** తోబుట్టువులతో మాట పట్టింపులు. బంధువుల ఆదరణ సంపాదిస్తారు. సంతాన సఖ్యతకు ప్రణాళికను సిద్ధం చేస్తారు. కొనుగోళ్లలో లోపాలున్నవి. ఋణభారం తగ్గును. 3,4,13, 14,21,22 ప్రతికూల సమయములు. సెప్టెంబరు 12 సాయంత్రం 4.03 నుంచి 14 రాత్రి 9.39 వరకు అనుకూల సమయం కాదు.

**అక్టోబరు: మృగశిర 1,2:** మిత్రభేదం ఉండదు. గృహనిర్మాణ పనులపై ఆసక్తి పెరుగును. దీర్ఘకాల సమస్యకు మోక్షం కల్గును. సోదర చికాకు లుండవు. ధైర్యంతో అడుగులు వేయగలరు. హామీ సంతకాలవసరము. 8,9,17,26 అనుకూలతేదీలు కాదు. **ఆర్ద్ర:** అనవసర ఆవేశాలకు వెళ్లటంతో కీర్తి ప్రతిష్ఠలకు దెబ్బ తగులును. నిర్మాణాత్మక శక్తి సడలదు. లోభగుణంచే ఎదుటివారి నుంచి విమర్శలుండును. వర్గ వైషమ్యాల సమాచారాన్ని సేకరిస్తారు. శరీరంపై గాయాలు రాగల అవకాశం. 9,10, 18,27 తేదీలు ప్రతికూలములు. **పునర్వసు 1,2,3:** చలాకీతనం, కళాకాంతులు తగ్గును. నీచ వ్యక్తుల సహవాసం తగ్గిస్తారు. కీలక బాధ్యతను స్వీకరిస్తారు. రాజీధోరణితో కదులుదురు. శరీర తేజస్సు తగ్గిననూ లబ్ధి పెరుగును. కుటుంబ కలతలు సమసిపోవును. జూదవ్యాపారం అనుకూలం కాదు. నాస్తికులతో శతృత్వం ఏర్పడు సూచన కలదు. 1,10,11,19,28 వ్యతిరేక తేదీలుగా గ్రహించాలి. అక్టోబరు 9 అర్ధరాత్రి తదుపరి 12.50 నుంచి 12 ఉదయం 7.46 వరకు ప్రతికూలం.

**నవంబరు: మృగశిర 1,2:** మాసం మధ్యలో సొంతవారితో విభేదా లధికం. కార్యసిద్ధికి ఆటంకాలు పెరుగును. ప్రణాళికలో మార్పుచేర్పు లుండును. నూతన ఆలోచనలు లాభించును. నిద్రలేమి కలదు. అధికారుల పంజాను గమనిస్తుంటారు. 5,13,14,22 తేదీలు వ్యతిరేకములు. **ఆర్ద్ర:** ముఖ్య వ్యక్తికి ప్రాధాన్యత ఇవ్వలేరు. స్వీయకల్పనా శక్తి పెరుగును. రహస్య చర్చలను సాగిస్తారు. గొప్ప ప్రణాళికను ఆలస్యంగా సిద్ధం చేస్తారు. సమయస్ఫూర్తి నిర్ణయాలచే ఉన్నత పరిచయాలు పెరుగును. 6,14,15, 23,24 అనుకూలతేదీలు కాదని గ్రహించాలి. **పునర్వసు 1,2,3:** ప్రతిబంధక సమస్యలకు సలహాలు తీసుకోలేరు. శరీరానికి వైద్య సేవలవసరం. మనో వ్యాకులత్వం తగ్గును. ఆర్థికమాంద్యం పెరుగును. 7,15,16,24,25 ప్రతికూలతేదీలు. నవంబరు 6 ఉదయం 7.58 నుంచి 8 సాయంత్రం 4.27 వరకు వ్యతిరేక సమయమని గమనించాలి.

**డిశంబరు: మృగశిర 1,2:** కళత్రంచే ఖర్చులధికము. స్థానచలన అవకాశాలు మెండు. శతృవుల ఆరాను తీయలేరు. కల్మష అంశాలకు దూరంగా ఉంటారు. పరోపకారంచే ప్రతిష్ఠ పెరుగును. 2,3,11,19,20, 29,30 అనుకూలతేదీలు కాదు. **ఆర్ద్ర:** కుటుంబ నిర్ణయాలు ఓ కొలిక్కి వచ్చును. భాగస్వామ్య చర్చలు సానుకూలం. దీర్ఘ సమస్యలకు పరిష్కారాలు లభించగలవు. కుటుంబ కలతలుండవు. స్పెక్యులేషన్ లాభించును. మాసాంతంలో ఆర్థిక లబ్ధి. 3,4,12,20,21,30,31 తేదీలు వ్యతిరేకములు. **పునర్వసు 1,2,3:** సంతాన అవాంతరములుండవు. పితృ వర్గం వారితో స్వల్ప పేచీలు. స్వయంవృత్తుల వారికి ఆశాజనకం. శరీరానికి వైద్యసేవలవసరం. హామీకోసమై సమయం వృధా. 4,5,13,21,22,31 తేదీలు ప్రతికూలములని గ్రహించాలి. డిశంబరు 3 మధ్యాహ్నం 1.44 నుంచి 5 రాత్రి 10.58 వరకు తిరిగి 30 రాత్రి 7.36 నుంచి జనవరి 1 అర్ధరాత్రి తదుపరి 4.26 వరకు ప్రతికూల సమయం.

**జనవరి 2017: మృగశిర 1,2:** సామరస్యధోరణి వైపు వెళ్లలేరు. అసత్యాలతో పనులు ఆగును. స్వార్థం పెరుగును. మాసాంతంలో హాస్య వచనాలతో జీవన సౌఖ్యమేర్పడును. స్త్రీలకు ఊహించని ఖర్చులు కలవు. నూతన కొనుగోళ్లు లాభించును. 7,8,16,25,26 ప్రతికూల సమయములు. **ఆర్ద్ర:** ఆదాయం తగ్గును. గృహవాతావరణం అనుకూలం కాదు. వ్యక్తిగత ఆకర్షణలకు ధనవ్యయం. రహస్య మంతనాలచే విజయం. లౌకిక వ్యవహారాలచే లబ్ధి. మాసాంతంలో ఆర్థికమాంద్యాన్ని తగ్గిస్తారు. ఋణ సమస్యలను చేధిస్తారు. 8,9,17,26,27 అనుకూల సమయములు కాదు. **పునర్వసు 1,2,3:** సంతానంచే ప్రశంసలు, విమర్శలుండును. గృహ నిర్మాణానికై పావులు కదుపుదురు. ఉదర లోపంచే ధనవ్యయం. మాసం మధ్యలో సోమరితనం అధికం. స్వపక్షీయుల బెడద పెరుగును. సహ ఉద్యో గులచే సమస్యలున్నవి. 1,9,10,18,28 వ్యతిరేక తేదీలు. జనవరి 26 రాత్రి 2.51 నుంచి 29 ఉదయం 10.51 వరకు ప్రతికూల సమయము.

**ఫిబ్రవరి 2017: మృగశిర1,2:** మొదటిపక్షంలో అధికవ్యయం. ఆశ్రిత పక్షపాతంచే నిందలు తప్పవు. పాత పద్ధతులను మానుకోలేరు. శ్రమకు తగిన ఫలితం తక్కువ. శుభ సంకేతాలు ఆలస్యంగా అందును. వ్యక్తిగత కక్షలను పెంచవద్దు. పూచీకత్తుకై సంతకాలు పెట్టవద్దు. జీవన సరళిలో మార్పులకై అన్వేషణ సాగిస్తారు. 3,4,12,13,22 అనుకూల తేదీలు కాదు. **ఆర్ద్ర:** శుభకరచర్చలు వాయిదా పడును. స్పెక్యులేషన్ సాధారణం. 2వ పక్షంలో విమర్శలధికం. ఆధిపత్యపోరును తగ్గిస్తారు. నిర్మాణాత్మక శక్తిని పెంచుకుంటారు. మాసాంతంలో ఋణభారం తగ్గును. సాహస ప్రయత్నాలచే నష్టాలధికము. 4,5,13,14,23 తేదీలు ప్రతికూలములు. **పునర్వసు 1,2,3:** ఋణ దాతల వత్తిడి పెరుగును. మానసిక, శారీరక సంఘర్షణలు సాధారణం. సంతానానికి పరోక్ష సహాయం. రాజీలేని ధోరణితో ముందుకు నడుస్తారు. శతృవులు మిత్రుల గుదురు. వాతపిత్తాదులధికం. పితృ సంబంధంగా స్వల్పఆటంకాలు. 5,6,14,15, 24,25 వ్యతిరేక సమయములుగా భావించాలి. ఫిబ్రవరి 23 మధ్యాహ్నం 11.31 నుంచి 25 రాత్రి 7.13 వరకు ప్రతికూలం.

**మార్చి 2017: మృగశిర1,2:** శస్త్రచికిత్స రాగల సూచన. తోబుట్టువులు సహకరిస్తారు. కళత్ర వర్గీయులచే సమస్యలేర్పడును. ప్రతిభకు గుర్తింపు లభించును. వివాద అంశాలపై చర్చలు వద్దు. మాసాంతంలో సంతాన అంశాలలో శుభ వార్తలు. స్త్రీలకు ఊహించని సౌకర్యాలు ఏర్పడును. 3,11,12,21,22,30 తేదీలు వ్యతిరేకములు. **ఆర్ద్ర:** వృత్తి వ్యాపారాదు లలో ఇతరుల జోక్యం పెరుగును. దీర్ఘకాల సమస్యలకు మోక్షం కల్గును. వాగ్దానములు నిలబెట్టుకుంటారు. సంతాన అవాంతరాలుండవు. దైవకార్యా చరణపై మొగ్గు చూపుతారు. సోదర సంఘీభావం ఉంటుంది. 4,12,13, 22,23,31 ప్రతికూలరోజులు. **పునర్వసు 1,2,3:** ఆత్మవిశ్వాసంతో అడుగులు ముందుకు వేస్తారు. ఎదుటివారి బాధ్యతలను తీసుకుంటారు. వృధా ప్రయాణాలుండును. భూ గృహ వ్యవహారములలో లబ్ధి పెరుగును. మానవతాభావంతో మెలుగుదురు. మాసాంతంలో జాయింట్ వ్యాపా రాలలో లోపాలు గమనిస్తారు. 5,13,14,23,24 అనుకూలరోజులు కాదు. మార్చి 22 రాత్రి 8.32 నుంచి 24 అర్ధరాత్రి తదుపరి 4.52 వరకు వ్యతిరేక సమయమని గ్రహించాలి.



## కర్కాటకరాశి

పునర్వసు 4పా (హి), పుష్యమి 1,2,3,4 పా (హు,హె,హొ,డా),ఆశ్లేష1,2,3,4పా(డీ,డు,డే,డో)

| | |
|---|---|
| ఆదాయము: | 08 |
| వ్యయము : | 11 |
| పూజ్యత : | 03 |
| అవమానం : | 03 |

**కర్కాటకరాశి వారు పఠించాల్సిన శ్రీ లలితా అష్టాక్షరీ నామాలు**

ఓం మహాయోగీశ్వరేశ్వర్యై నమః (225)
ఓం మహాయాగక్రమారాధ్యాయై నమః (230)
ఓం మహాభైరవపూజితాయై నమః (231)
ఓం మహాకామేశమహిష్యై నమః (233)
ఓం మహాత్రిపురసుందర్యై నమః (234)
ఓం చతుష్షష్ట్యుపచారాఢ్యాయై నమః (235)
ఓం చతుష్షష్టికళామయ్యై నమః (236)
ఓం చంద్రమండలమధ్యగాయై నమః (240)
ఓం చారుచంద్రకళాధరాయై నమః (243)
ఓం చక్రరాజనికేతనాయై నమః (245)
ఓం పద్మరాగసమప్రభాయై నమః (248)
ఓం పంచప్రేతాసనాసీనాయై నమః (249)
ఓం పంచబ్రహ్మస్వరూపిణ్యై నమః (250)
ఓం విజ్ఞానఘనరూపిణ్యై నమః (253)
ఓం ధ్యానధ్యాతృధ్యేయరూపాయై నమః (254)
ఓం ధర్మాధర్మవివర్జితాయై నమః (255)
ఓం సర్వావస్థావివర్జితాయై నమః (263)
ఓం పంచకృత్యపరాయణాయై నమః (274)
ఓం భానుమండలమధ్యస్థాయై నమః (275)
ఓం పద్మనాభసహోదర్యై నమః (280)

**గమనిక:** 16వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

ఆగస్టు 11 వరకు గురువు ద్వితీయస్థాన సంచారంచే తరచూ ఆర్థిక మాంద్యముండును. వాగ్దోరణిని అదుపులో ఉంచుకుంటారు. కుటుంబ వ్యవహారాలలో అనుకూల మార్పులు. ఆగస్టు 12 నుంచి సంవత్సరాంతం వరకు తృతీయస్థాన సంచారంచే అసత్య ఆరోపణలు తగ్గును. సంకల్పబలం నెరవేరును. హామీలచే నష్టముండదు. శతృవర్గ వైషమ్యాల బెడద తగ్గును. కళత్ర సలహాలను పాటించినందున విమర్శలు, దూషణలు తప్పును. శుభ కార్యాచరణకు సంకేతాలు వచ్చును.

2017 జనవరి 26 వరకు శని పంచమస్థాన సంచారంచే సంతాన విజయాలు. స్థానచలం తప్పును. కుటుంబ నిర్ణయాలను శిరసావహిస్తారు. అకాలభోజనాలు ఉండవు. కీలకనిర్ణయాలు కలిసివస్తాయి. స్థిరాదాయం పెరుగును. పాలనా నిర్ణయాలచే విజయప్రాప్తి. జనవరి 27 నుంచి సంవత్సరాంతం వరకు శని షష్ఠస్థాన సంచారంచే ధైర్యసాహసాలతో శత్రుజయం ఏర్పడును. రాబడి విషయాలలో నిర్ణయాలు మారును. విమర్శలను ప్రతిఘటిస్తారు. తోబుట్టువులు సహకరిస్తారు. శస్త్రచికిత్సచే అనారోగ్యం తగ్గును.

గ్రహసంచార స్థితులను విశ్లేషించగా శక్తికి మించిన కార్యాలు ఆచరిస్తారు. ఆర్భాటాలకు, ఆడంబరాలకు దూరంగా ఉంటారు. నూతన నిర్ణయాలు ఉత్సాహమిస్తాయి. స్త్రీలకు పూర్తి సౌఖ్యం. లౌకిక విషయాలపై మక్కువ అధికం. దాయాదులతో కలహాలు తగ్గును. రానిబాకీలు వసూలగును. ధర్మావేశాన్ని తగ్గిస్తారు. సోదరమైత్రి పెరుగును. ఏకాభిప్రాయ సాధనలో విమర్శలను ధాటిగా ఎదుర్కొంటారు. తరచూ శరీరం అలసత్వంగా ఉండును. జాయింటువ్యాపారాలు లాభిస్తాయి. సంతానంచే విజయప్రాప్తి. దైవ కార్యాచరణపై ఆసక్తి. ఆలస్యంగా మనోవాంఛలు సిద్ధించును. వైద్య, న్యాయ, కంప్యూటర్, నౌక, విమాన, ఉపాధ్యాయ, సంగీత, రాజకీయ రంగాల వారికి ఆలస్యంగా ప్రాప్తి లభించును. నిత్య భయాందోళనలు తరచూ ఉన్ననూ ధైర్యంతోనే ఉంటారు. తరచూ సంజాయిషీలు అధికము. రహస్య చర్చలు ఉండవు. మానసికచింతన తగ్గును. స్పెక్యులేషన్ రాణింపు తక్కువ. నమ్మకద్రోహం ఉండదు. పెద్దలఆశీస్సులచే ప్రయోజనాలు పెరుగును.

**ఏప్రిల్: పునర్వసు 4:** ఆప్తమిత్రుల అండదండలుండును. దీర్ఘాలోచన అధికము. శస్త్రచికిత్స అనుకూలము. కార్యబాధ్యతలను ఎదుటివారిపై మోపవద్దు. కీర్తి ప్రతిష్ఠలను కాపాడుకోవాలి. సంతాన సమస్యలు తగ్గును. మాసాంతంలో వాతావరణం ఆశాజనకం. 10,11,20,30 తేదీలు అనుకూలం కాదు. **పుష్యమి:** శక్తికి మించిన కార్యాలు చేయగలరు. సోమరితనం తగ్గును. అసత్య ఆరోపణలు తగ్గించండి. ఆంతరంగిక అంశాలను బహిర్గతం చేయవద్దు. స్త్రీలకు ఊహించని సౌకర్యాలు ఏర్పడును. సహచరులతో విభేదాలున్నవి కనుక జాగ్రత్తలు పాటించాలి. 11,12,21,30 తేదీలు ప్రతికూలములని గ్రహించాలి. **ఆశ్లేష:** స్పెక్యులేషన్ రాణింపు ఉండదు. అసత్య ఆరోపణలపై స్పందిస్తారు. సొంతవారితో అవసరాలధికం. స్థాన చలన అవకాశాలు లేవు. హామీలు ఉండవద్దు. మాసాంతంలో ప్రశాంతత కల్గును. 12,13,22,23 వ్యతిరేకతేదీలు. ఏప్రిల్ 3 అర్ధరాత్రి తదుపరి 1.11 నుంచి 5 అర్ధరాత్రి తదుపరి 2.45 వరకు ప్రతికూల సమయం.

**మే: పునర్వసు 4:** శతృవులచే మొండితనం పెరుగును. అసౌకర్యాలతో విసుగు అధికం. అనవసర ఆరోపణలు, విమర్శలు అధికము. ఋణభారం పెరుగును. విందు వినోదాలలో జాగ్రత్తగా సంభాషించాలి. హామీ సంతకాలు వద్దు. సవృత్తుల వారికి ఆశాజనకం. భయాందోళనలు ఉండవు. 8,17, 18,27 వ్యతిరేకరోజులు. **పుష్యమి:** 2వ పక్షంలో ఆశాజనక పరిస్థితులు. నిద్రాసౌఖ్యం లేనందున స్వల్ప అనారోగ్యం. పెద్దల మాటను శిరసావహిస్తారు. స్పెక్యులేషన్‌లో స్వల్ప లబ్ధి. శరీర ఆరోగ్యంలో శ్రద్ధ పెంచాలి. సాహస ప్రయత్నాలు బెడుస్తాయి. సమస్యలున్ననూ ధైర్యంగా ముందుకు కదులుతారు. 1,9,18,19,28 అనుకూలతేదీలు కాదు. **ఆశ్లేష:** రహస్య చర్చలకు దూరంగా ఉంటారు. స్పెక్యులేషన్ రాణింపు కాదు. శరీరారోగ్యంలో శ్రద్ధ పెంచాలి. సాహసప్రయత్నాలు బెడుస్తాయి. మాసం చివరలో మనశ్శాంతి. దీర్ఘాలోచన చేసి చేదు అనుభవాలు చవి చూస్తారు. శరీరానికి వైద్య సేవలవసరము. 2,10,19,20,29 ప్రతికూల రోజులని భావించాలి. మే 1 ఉదయం 8.39 నుంచి 3 మధ్యాహ్నం 2.47 వరకు తిరిగి 28 మధ్యాహ్నం 3.57 నుంచి 30 రాత్రి 8.33 వరకు వ్యతిరేక సమయం.

**జూన్: పునర్వసు 4:** కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. ఆర్థిక వెసలుబాటు ఉండును. కపట స్వభావుల ఆట కట్టిస్తారు. ఋణదాతల వత్తిడి తగ్గును. జీవనస్థితిపై మెరుగైన ఆలోచనలు వచ్చును. కోపతాపాలకు తావివ్వవద్దు. 4,5,13,14,23,24 ప్రతికూలతేదీలు. **పుష్యమి:** స్థానచలన అవకాశములుండవు. భాగస్వామ్య చిక్కులు తగ్గును. బుద్ధిబలంతో నిర్ణయాలు తీసుకోవాలి. గురుతర బాధ్యతను స్వీకరించలేరు. మేనమామ, పినతల్లి అంశాలు తృప్తినివ్వవు. 5,6,14,15,24,25 తేదీలు వ్యతిరేకములు. **ఆశ్లేష:** శతృవిజృంభణ ఎదుర్కొంటారు. శుభచర్చలచే లబ్ధి. 2వ పక్షంలో కఠిన నిర్ణయాలు తీసుకోలేరు. ఉన్నతాధికారులతో సమస్యలున్నవి. శతృబాధలు మాసం మధ్యలో స్వల్పంగా పెరుగును. మాసాంతంలో ఆర్థిక మాంద్యం. 6,7,15,16,25,26 అనుకూలరోజులు కాదు. జూన్ 24 రాత్రి 9.23 నుంచి 26 అర్ధరాత్రి తదుపరి 2.21 వరకు అనుకూల సమయం కాదు.

**జూలై: పునర్వసు 4:** బంధుప్రీతిని స్వాగతిస్తారు. శరీరశ్రమ అధికము. మనోవ్యాకులత్వం తగ్గును. సమయస్ఫూర్తిని పాటిస్తారు. స్థిరనిర్ణయాలు తీసుకుంటారు. సంజాయిషీలు, క్షమాపణలు చెప్పరు. అంచనాలు తారుమారు కావు. మాసాంతంలో శతృబాధలు స్వల్పంగా పెరుగును. 2,11,20,21,29 తేదీలు ప్రతికూలములు. **పుష్యమి:** న్యాయలావాదేవీలచే ఉపశమనం. బంధుప్రీతితో సమస్యలు పరిష్కారం. మాసమంతా ఆర్థికమాంద్యం ఎగుడు దిగుడుగా ఉండును. ఊహించని ఖర్చులు పెరుగును. స్పెక్యులేషన్ నష్టదాయకం. సాహసనిర్ణయాలు వద్దు. 3,12,21,22,30 అనుకూలం కాదు. **ఆశ్లేష:** స్థిరనిర్ణయాలు వాయిదా పడును. తోబుట్టువులచే అంగీకార అనుకూలం. పుకార్లను నమ్మి నష్టపోతారు. ఋణదాతలపై ఆగ్రహం వద్దు. 3,4,13,22,23,31 వ్యతిరేకరోజులు. జూలై 21 అర్ధరాత్రి తదుపరి 3.40 నుంచి 24 ఉదయం 7.52 వరకు ముఖ్య అంశాలకు ప్రాధాన్యత ఇవ్వవద్దు.

**ఆగస్టు: పునర్వసు 4:** అవివాహితులకు వివాహయోగం. బుద్ధిబలంతో అనుకూల నిర్ణయాలుండును. వివాదాంశాలు తగ్గును. తోబుట్టువుల మధ్య అంగీకారం కుదురును. వ్యాపారులకు ఆశాజనకం. వృధా ప్రయాణాలు తగ్గును. 7,8,17,25,26 తేదీలు అనుకూలం కాదు. **పుష్యమి:** స్థిరాస్తి అంశాలలో నిర్ణయాలు వాయిదా పడును. స్పెక్యులేషన్ రాణింపు కలదు. ప్రయత్నపూర్వక కార్యసిద్ధి కల్గును. మాసాంతంలో నిరుత్సాహం, భయం తగ్గును. భూ సంబంధ లావాదేవీలు స్తంభించును. నరాల, భుజాల తీపు అధికం. 8,9,18,26,27 ప్రతికూలరోజులు. **ఆశ్లేష:** బంధువులతో శతృత్వాలు తగ్గును. మాసాంతంలో అంచనాలు తారుమారగును. వాగ్దాన భంగములు పెరుగును. ప్రశాంతతకు భంగం కల్గును. పూచీ సంతకాలు పెట్టవద్దు. సంజాయిషీలకు దూరంగా ఉంటారు. రాజీధోరణికి ప్రాధాన్యత ఇవ్వగలరు. 9,10,19,27,28 తేదీలు అనుకూలం కాదని గ్రహించాలి. ఆగస్టు 18 మధ్యాహ్నం 11.49 నుంచి 20 మధ్యాహ్నం 2.53 వరకు ముఖ్య అంశాలలో తొందరపాటు వద్దు.

**సెప్టెంబరు: పునర్వసు 4:** ఋణాన్వేషణకు సమయం కేటాయిస్తారు. పితృవర్గ నిర్ణయాలు శిరోధార్యంగా భావిస్తారు. మనోవ్యాకులత తగ్గును. గౌరవ, ప్రతిష్ఠలు పెరుగును. పరనిందారోపణలో సమస్యలున్నవి. భాగ స్వామ్య చర్చలు నెరవేరును. సంతాన సమస్యలుండవు. 3,4,13,14, 21,22 అనుకూలరోజులు కాదు. **పుష్యమి:** ఆర్థిక విషయాలలో హామీ లుండలేరు. స్నేహసంబంధాలు పెరుగును. అకాలభోజనాలధికం. వాస్తవ విషయాలను గోప్యంగా ఉంచుతారు. ప్రతిబంధక వ్యవహారాలు వాయిదా పడును. కుటుంబంలో స్వల్ప మనస్పర్థలున్నవి. 4,5,14,15,22,23 ప్రతి కూలతేదీలు. **ఆశ్లేష:** ముఖ్యపనులలో పొరపాట్లు వచ్చును. భాగస్వామ్య చర్చలు వాయిదా పడును. శుభనిర్ణయాలలో ఆలోచనలు మొదలగును. స్థానచలన అవకాశాలు. పెద్దల ఆశీస్సులు లాభించును. స్పెక్యులేషన్ లాభసాటి. 5,6,15,16,23,24 తేదీలు వ్యతిరేకములు. సెప్టెంబరు 14 రాత్రి 9.39 నుంచి 16 రాత్రి 12.09 వరకు ఆవేశాలకు లోను కాకుండా నిర్ణయాలు దాటవేసే ధోరణిలో ఉండాలి.

**అక్టోబరు: పునర్వసు 4:** మరమ్మత్తులకై ధనవ్యయం. పంతాలకు వెళ్లటంతో ఆరోపణలు ఎదుర్కొంటారు. మనోవ్యాకులత్వం తగ్గును. వ్యక్తిగత విమర్శలు తగ్గును. ఆధిపత్య సంభాషణలతో కార్యసిద్ధి. సాహస నిర్ణయాలు ఉండవు. 1,10,11,19,28 ప్రతికూలతేదీలు. **పుష్యమి:** కళత్ర సలహాలను స్వీకరించరు. అనవసర అంశాలపై దృష్టి ఉంచుదురు. మాసం మధ్యలో సంజాయిషీలు అధికం. వాగ్ధోరణిచే సమస్యలు తలెత్తును. మాసాంతానికి ఆర్థికమాంద్యం తగ్గును. వివాదాలలో తలదూర్చవద్దు. 2,12,20,29 తేదీలు అనుకూలం కాదు. **ఆశ్లేష:** మిత్ర శతృత్వాలను గమనించలేరు. క్షమాపణలు తరచుగా ఉండును. గురుతర బాధ్యతను స్వీకరిస్తారు. ఋణదాతలను తృప్తి పరుస్తారు. జీవనస్థితిపై ఆలోచనలు అనుకూలంగా పెరుగును. 3,12,13,21,30,31 ప్రతికూలరోజులని భావించాలి. అక్టోబరు 12 ఉదయం 7.46 నుంచి 14 ఉదయం 10.54 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**నవంబరు: పునర్వసు 4:** మాసప్రారంభంలో అశాంతి అధికం. క్రమంగా ప్రశాంతతను పొందుదురు. ఆరోపణలు పట్టించుకోరు. భూ లావాదేవీలు ఫలించును. విందు వినోదాలలో జాగ్రత్తలు మాట్లాడలేరు. వ్యక్తిగత విమర్శలను తట్టుకుని నిలబడటం స్వల్ప కష్టం. 7,15,16,24, 25 తేదీలు వ్యతిరేకములు. **పుష్యమి:** శరీరంపై గాయాలు రాగల అవకాశం. ప్రధాన శతృవుల ఆరా తీయగలరు. స్పెక్యులేషన్ అనుకూలం కాదు. సామర్ధ్యవ్యక్తుల నిర్ణయాలను స్వాగతిస్తారు. చేదు అనుభవాలను నెమరువేసుకుంటారు. బంధుప్రేరణతో సమస్య పరిష్కారమగును. 8,16, 25,26 అనుకూలతేదీలు కాదు. **ఆశ్లేష:** జీవనోపాధిలో స్థిరత్వం తగ్గును. స్పెక్యులేషన్ యోగించదు. సంతానఅంశాలపై రాజీయత్నాలు సాగును. దూరప్రయాణాలు అభిలషణీయం కాదు. శారీరక రుగ్మతలు తగ్గును. మనోవాంఛ నెరవేరును. 9,17,26,27 ప్రతికూలరోజులు. నవంబరు 8 సాయంత్రం 4.27 నుంచి 10 రాత్రి 9.14 వరకు వ్యతిరేక సమయం.

**డిశంబరు : పునర్వసు 4:** పెద్దల ఆశీస్సులను పొందగలగుతారు. అనవసర హామీలు ఇవ్వటంతో ధనవ్యయం. కుటుంబంలో ఆటుపోట్లు పెరుగును. పుకార్లు నమ్మి ధనాన్ని పోగొట్టుకుంటారు. నైరాశ్యం పెరుగును. రక్త సంబంధీకులచే శుభవార్తలుండును. 4,5,13,21,22,31 తేదీలు అనుకూలములు కాదు. **పుష్యమి:** సంతాన అంశాలలో కఠిన నిర్ణయాలు తీసుకోలేరు. శుభకార్య పరంపరచే అనారోగ్యం. బంధుప్రీతిని స్వాగతి స్తారు. ఆదాయానికి మించిన ఖర్చులు. శతృసమస్యలను ఛేధిస్తారు. అనవసర అంశాలపై సమయాన్ని వృధా చేస్తారు. 5,6,14,22,23 ప్రతికూల తేదీలు. **ఆశ్లేష:** లౌకిక విషయాలపై ఆసక్తి కనపరచరు. ధర్మకార్యాలకు దగ్గరగుదురు. మానసికచింతలు తగ్గును. శరీరారోగ్యంపై శ్రద్ధ పెడుదురు. దీర్ఘాలోచనతో చేదు అనుభవాలు రాగలవు. 6,7,14,15,24 వ్యతిరేక తేదీలని గ్రహించాలి. డిశంబరు 5 రాత్రి 10.58 నుంచి 8 ఉదయం 5.21 వరకు అనుకూల సమయం కాదని గమనించాలి.

**జనవరి 2017: పునర్వసు 4:** కృషికి తగిన ఫలితమధికము. విశేష వ్యక్తుల పరిచయాలచే లబ్ధి. ఋణదాతల వత్తిడి పెరుగును. కోపతాపాలకు దూరంగా ఉండాలి. క్షమాపణలు, సంజాయిషీలు అధికము. మాసాంతంలో ఆర్థికమాంద్యం పెరుగును. 1,9,18,27,28 తేదీలు వ్యతిరేకములు. **పుష్యమి:** విమర్శలు, ఆరోపణలుండవు. దైవకార్యాచరణపై ఆసక్తి మెండు. ఉద్యోగులకు గడ్డుకాలము. వ్యాపారులకు ఆశాజనకము. న్యాయ లావాదేవీలచే అశాంతి. అనవసర హామీలకు దూరంగా ఉండండి. చలాకీ తనం, కళాకాంతులు పెరుగును. ప్రతిబంధక వ్యవహారాలు వాయిదా పడును. 1,2,10,19,29 ప్రతికూలతేదీలు. **ఆశ్లేష:** మనోవాంఛలు ఆలస్యంగా సిద్ధించును. శతృభయం తగ్గును. నిరుత్సాహం పెరుగును. భూసంబంధ లావాదేవీలు స్తంభించును. మానసిక, శారీరక ప్రశాంతతకు భంగం కల్గును. 2,3,11,20,30 ప్రతికూలరోజులు. జనవరి 1 అర్ధరాత్రి తదుపరి 4.26 నుంచి 4 మధ్యాహ్నం 11.15 వరకు తిరిగి 29 ఉ దయం 10.51 నుంచి 31 సా4.50 వరకు అనుకూల సమయం కాదు.

**ఫిబ్రవరి 2017: పునర్వసు 4:** సజ్జన సహచర్యం కలదు. స్వయం రంగాల వారికి సానుభూతి. ఊహాగానాలు వదిలిపెడతారు. స్పెక్యులేషన్ రాణింపు కాదు. శారీరక రుగ్మతలు తగ్గును. ఋణభారం పెరుగును. వివాదాలకు దూరంగా ఉన్ననూ సమస్యలు వచ్చును. 5,6,14,15,24 ప్రతికూలతేదీలు. **పుష్యమి:** శుభకార్యాచరణకు సంకేతాలు. ప్రణాళికలో నూతన మార్పులుండును. ఆధిపత్య సంభాషణలతో కార్యసిద్ధి. జాయింటు వ్యాపారాలలో లోపాలు తగ్గును. శతృబాధలు స్వల్పంగా పెరుగును. మాసం మధ్యలో విమర్శలధికము. వాగ్ధోరణిని అదుపులో ఉంచుకోవాలి. 6,7,15,16,25,26 అనుకూల తేదీలు కాదు. **ఆశ్లేష:** సంకల్పబలం నెరవేరును. స్పెక్యులేషన్ దారితప్పును. జాయింటునిర్ణయాలు వాయిదా పడును. హామీ సంతకాలచే సమస్య ఉత్పన్నమగును. పెద్దలమాటను శిరసావహించలేరు. పూర్తి అంచనాలు తారుమారు కాగలవు. 7,8,16, 17,26 తేదీలు వ్యతిరేకములు కాదు. ఫిబ్రవరి 25 రాత్రి 7.13 నుంచి 27 రాత్రి 12.10 వరకు ప్రతికూలమని గమనించాలి.

**మార్చి 2017: పునర్వసు 4:** ఆందోళన భయం ఉండదు. కార్యబాధ్యతలు సజావుగా సాగును. శక్తి యుక్తులతో కార్యసిద్ధి. స్వవృత్తుల వారికి ఆశాజనకం. మాసం మధ్యలో ఋణదాతల భారం అధికమగును. సహచరులతో కపట వ్యవహారాలు సంభాషించవద్దు. 5,13,14,23,24 అనుకూలరోజులు కాదు. **పుష్యమి:** శాంత స్వభావంతో అనుకూలతలు. స్పెక్యులేషన్‌చే రాణింపు. మాసం మధ్యలో వాగ్ధోరణిచే సమస్యలు తగ్గును. శుభకార్య నిర్వహణ చర్చలు ఫలించును. ఆర్థికమాంద్యం పెరుగును. 6,14,15,24,25 ప్రతికూల తేదీలు. **ఆశ్లేష:** భాగస్వామ్యులకు ఆశాజనకం. స్థిరాస్తి అంశాలలో అనుకూల నిర్ణయాలుండును. స్త్రీలకు శుభకరం. విందు, వినోదాలలో జాగ్రత్తగా మాట్లాడాలి. వృధా ప్రయాణాలు, వ్యక్తిగత విమర్శ లను తగ్గిస్తుంటారు. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొని ప్రశంసలు పొందుతారు. పితృనిర్ణయాలపై ఆసక్తి పెరుగును. 6,7,16,25,26 తేదీలు అనుకూలం కాదని భావించాలి. మార్చి 24 అర్ధరాత్రి తదుపరి 4.52 నుంచి 27 ఉదయం 9.37 వరకు వ్యతిరేక సమయం.



# సింహరాశి

మఘ 1,2,3,4 పా (మా,మీ,మూ,మే), పుబ్బ 1,2, 3,4పా (మో,టా,టీ,టు), ఉత్తర 1పా (టే)

| | |
|---|---|
| ఆదాయము: | 11 |
| వ్యయము : | 05 |
| పూజ్యత : | 06 |
| అవమానం : | 03 |

**సింహరాశి వారు పఠించాల్సిన శ్రీ లలితా అష్టాక్షరీ నామాలు**

ఓం కుళామృతైకరసికాయై నమః (90)
ఓం కులసంకేతపాలిన్యై నమః (91)
ఓం సమయాచారతత్పరాయై నమః (98)
ఓం మూలాధారైకనిలయాయై నమః (99)
ఓం బ్రహ్మగ్రంథివిభేదిన్యై నమః (100)
ఓం మణిపూరాంతరుదితాయై నమః (101)
ఓం విష్ణుగ్రంథివిభేదిన్యై నమః (102)
ఓం ఆజ్ఞాచక్రాంతరాళస్థాయై నమః (103)
ఓం రుద్రగ్రంథివిభేదిన్యై నమః (104)
ఓం సహస్రారాంబుజారూఢాయై నమః (105)
ఓం సుధాసారాభివర్షిణ్యై నమః (106)
ఓం తటిల్లతాసమరుచ్యై నమః (107)
ఓం షట్చక్రోపరిసంస్థితాయై నమః (108)
ఓం బిసతంతుతనీయస్యై నమః (111)
ఓం భవారణ్యకుఠారికాయై నమః (114)
ఓం భక్తసౌభాగ్యదాయిన్యై నమః (117)
ఓం శరచ్చంద్రనిభాననాయై నమః (129)
ఓం సమానాధికవర్జితాయై నమః (198)
ఓం సర్వమంత్రస్వరూపిణ్యై నమః (204)
ఓం మహాపాతకనాశిన్యై నమః (214)

**గమనిక:** 16వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

ఆగస్టు 11 వరకు జన్మరాశిలోనే గురుసంచారంచే శారీరక అలసత్వం. మనసు కకావికలమై విసుగు, ఆందోళన అధికమగును. మనస్తాపంతో అనారోగ్య సూచనలున్నవి. వైద్యసేవలను స్వీకరించాలి. శుభచర్చలు చేస్తారు. హడావుడి నిర్ణయాలను మానుకుంటారు. సంకల్పబలం ఆలస్యమగును. ఆగస్టు 12 నుంచి సంవత్సరాంతం వరకు ద్వితీయ గురుసంచారంచే స్పెక్యులేషన్‌లో లబ్ధి. ఆర్భాట వ్యవహారాలు పెరుగును. హామీ ప్రయత్నాలు కొనసాగిస్తారు.కుటుంబ ఆందోళన ఉండదు. శుభచర్చలను స్వాగతిస్తారు.

2017 జనవరి 26 వరకు అర్ధాష్టమ శని ఉన్న కారణంగా బుద్ధిబలంతో లబ్ధిని పొందుతారు. నిస్వార్థంగా ధనాన్ని సంపాదిస్తారు. లౌక్యంతో రాజీ మార్గంలో నడుస్తారు. వాహనసౌఖ్యమేర్పడును. దౌర్జన్య ఆలోచనలు తగ్గును. శుభకార్యాచరణ జరుగును. జనవరి 27 నుంచి సంవత్సరాంతం వరకు శని పంచమంలో అతిచార సంచారంతో స్పెక్యులేషన్ దారితప్పును. శక్తికి మించిన కార్యాలు ఆచరించి నష్టపోతారు. స్వయంవృత్తుల వారికి స్వల్ప రాణింపు. సంతానంచే విమర్శలు, ప్రతిబంధక సమస్యలు పెరుగును.

గ్రహసంచార స్థితిగతులను విశ్లేషించగా వృత్తిలో స్థిరత్వం లోపించును. పితృవర్గ నిర్ణయాలను శిరోధార్యంగా భావిస్తారు. అవివాహితులకు వివాహ యోగం. ఋణదాతల వత్తిడి తగ్గును. అనవసర నిర్ణయాలతో స్నేహితులతో పేచీలు. ఉద్యోగ వ్యాపార అంశాలలో నిపుణుల అవసర మేర్పడును. కళత్ర విభేదాలు సమసిపోవును. స్వీయ కల్పనాశక్తి తగ్గును. ఆధిపత్య సంభాషణలతో కార్యసిద్ధి పొందలేరు. శుభకార్య సంకేతాలు. మౌనానికి అధిక ప్రాధాన్యత ఇస్తారు. విద్యార్థినీ విద్యార్థులకు రాణింపు. మెకానికల్, కంప్యూటర్, రవాణా, గృహనిర్మాణ వాసులకు శత్రుబెడదలు. స్త్రీలకు గర్భభంగములుండును. కఠిన నిర్ణయాలు తీసుకోలేరు. కుటుంబంలో వివాదాంశాలు తగ్గును. స్థిరాస్తి అంశాలలో నిదానంగా నిర్ణయాలు ఫలించును. రాజకీయ,సామాజిక రంగాలకు నమ్మకద్రోహము లున్నవి. పాదాలకు రుగ్మత రాగల సూచన కలదు. మేనమామ, మేనత్త విషయాలలో అప్రమత్తంగా ఉండాలి. అమావాస్య, పౌర్ణమి తిథులలో చేసే ప్రయాణాలు యోగించవు.

**ఏప్రిల్: మఘ:** కృతనిశ్చయం బలంగా ఉండదు. బుద్ధిబలంతో నిర్ణయాలుంటాయి. స్పెక్యులేషన్ ఆశాజనకము. ధర్మకార్యాలకు దగ్గరవుతారు. మాసం మధ్యలో ఆగ్రహంతో సంభాషించవద్దు. విధాన నిర్ణయాలలో లోపాలున్నాయని గ్రహిస్తారు. అకాల భోజనాదులు కలవు. 13,14,23,24 తేదీలు ప్రతికూలములు. **పుబ్బ:** కుటుంబకలతలు తగ్గుముఖం. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులు. మనోవాంఛలు ఆలస్యంగా సిద్ధించును. ఉన్నత వ్యక్తుల పరిచయాలు మాసాంతంలో యోగిస్తాయి. మోకాళ్ల రుగ్మత ఏర్పడు సూచన కలదు. గృహ నిర్మాణ పనులలో మందకొడి. 14,15,24,25 అనుకూల తేదీలు కాదు. **ఉత్తర1:** మాసాంతంలో ఆర్థిక పరిపుష్టి. వాగ్దాన నిర్ణయాలు మారును. న్యాయవిషయాలలో కొంత ఉపశమనం. భాగస్వామ్య నిర్ణయాలతో లబ్ధి. దాయాదులతో కలహాలు వద్దు. ఉద్యోగస్తులపై నిఘా ఉండును. 15,16,25,26 తేదీలు అనుకూలములు కాదు. ఏప్రిల్ 5 అర్ధరాత్రి తదుపరి 2.45 నుంచి 7 అర్ధరాత్రి 2.22 వరకు అనుకూల సమయం కాదు.

**మే: మఘ:** బంధుప్రీతిని స్వాగతిస్తారు. సాహసప్రయత్నాలు ఫలిస్తాయి. ఋణదాతల వత్తిడి అధికము. 2వ పక్షంలో నిర్ణయాలు స్థిరంగా ఉంటాయి. మాసం చివరలో సంతానంచే సమస్యలు. శాంత స్వభావంతో అనుకూల స్థితులుండును. స్థానచలనములుండవు. 11,20,21,30 ప్రతికూల తేదీలు. **పుబ్బ:** 2వపక్షంలో ఊహాగానాలతో పయనిస్తారు. ఇరుగువారి సహాయ సహకారాలను పొందుతారు. ఆరోగ్యంపై శ్రద్ధ చూపించాలి. 3వ వారంలో సంతాన సౌఖ్యం కల్గును. రాజకీయవాసులకు అనుకూలం. 12,21,22,31 అనుకూల తేదీలు కాదు. **ఉత్తర1:** అధికారుల బెడద అధికము. మనోవ్యాకులత్వం తగ్గును. సోదరులతో చికాకులున్నవి. పిత్రార్జిత అంశాలపై దృష్టి ఉంచుదురు. శుభకార్యాచరణకు రహస్య సంకేతాలుండును. 4,5,13,23 అనుకూలం కాదు. 3 మధ్యాహ్నం 2.47 నుంచి 5 మధ్యాహ్నం 1.18 వరకు తిరిగి 30 రాత్రి 8.33 నుంచి జూన్ 1 రాత్రి 10.39 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.

**జూన్: మఘ:** శీఘ్రనిర్ణయాలు తీసుకుంటారు. వ్యూహాత్మక శక్తులను పెంచుకుంటారు. జాయింట్‌వ్యాపార లోపాలను తగ్గిస్తారు. బంధు మిత్రులతో శతృత్వాలు వద్దు. వృథా ప్రయాణాలుండును. స్పెక్యులేషన్ నష్టదాయకం. 7,8,17,26,27 ప్రతికూల తేదీలు. **పుబ్బ:** మనఃశాంతి లభించును. ఇష్టకార్యసిద్ధి, సుఖశాంతులున్నప్పటికీ మాసాంతంలో మనఃక్లేశము. కార్యదీక్షా దక్షత బాధ్యత పెరుగును. ధర్మావేశం అనుకూలం కాదు. స్పెక్యులేషన్ లాభసాటి. వాక్కును అదుపులో ఉంచుకోవాలి. మాసం మధ్యలో సంజాయిషీలుండును. 8,9,18,27,28 వ్యతిరేక తేదీలు. **ఉత్తర1:** నిరుద్యోగులకు శుభవార్తలు. స్థిరాస్తి నిర్ణయాలలో వాయిదా. సంతాన విజయాలతో సౌఖ్యం. ఆరోగ్యరీత్యా వైద్యసేవలవసరం. విశేష వ్యక్తుల పరిచయాలు పెరుగును. లౌకిక విషయాలపై మక్కువ. 1,9,10,19 ప్రతికూలములు. జూన్ 26 అర్ధరాత్రి 2.21 నుంచి 29 ఉ5.38 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**జూలై: మఘ:** రోగబాధలు ఉపశమనం. ఋణవత్తిడి పెరుగును. పరనింద ఆరోపణలుండును. సోదరీ వ్యతిరేకం తగ్గును. ఆశలు నిరాశలు కావు. వృథా ప్రయాణాలు. స్వవృత్తుల వారికి లబ్ధి చేకూరును. 2వ వారంలో కళత్ర భేదాభిప్రాయాలు తగ్గును. 4,5,14,15,23,24 అనుకూలములు కాదు. **పుబ్బ:** మాసాంతంలో శతృవులచే మొండి ఏర్పడును. సాహసంతో ప్రతి పనిని చేయుదురు. వ్యక్తిగత విమర్శలు వద్దు. సంతానానికి విజయప్రాప్తి. ఆధ్యాత్మిక విషయాలలో పాల్గొంటారు. 5,6,15,16,24,25 అనుకూలం కాదు. **ఉత్తర1:** పితృవర్గ పేచీలపై దృష్టి సారిస్తారు. ఆప్తమిత్రుల అండ దండలు మాసాంతంలో లభించును. వాహన నిర్ణయం వాయిదా వేయండి. ప్రతిభకు గుర్తింపు లభించును. స్త్రీలకు ఆదాయం పెరుగును. 6,7,16,17,25,26 తేదీలు ప్రతికూలములు. జూలై 24 ఉదయం 7.52 నుంచి 26 11.06 వరకు ప్రతికూల సమయం.

**ఆగస్టు: మఘ:** ధర్మకార్యాలపై శ్రద్ధ పెరుగును. శస్త్రచికిత్సకు అవకాశముంది. మాసం మధ్యలో అసౌకర్యాలతో విసుగు అధికం. మిత్రభేదములున్నవి. ఋణవిముక్తికి మార్గం సుగమం. సంతానంచే ఉత్సాహ ముందును. పూచీకత్తుకై సంతకాలు వద్దు. 1,10,11,20,28,29 అనుకూల తేదీలు కాదు. **పుబ్బ:** క్షణికావేశముతో ధనవ్యయం. స్థిర ఆలోచనలపై దృష్టి ఉంచుదురు. అంతర్గత వ్యవహారాలు మందకొడి. మాసాంతంలో కార్యసిద్ధి కలదు. వ్యక్తిగత విమర్శలు వద్దు. స్పెక్యులేషన్ అనుకూలం కాదు. స్థానచలన అవకాశాలుండును. 2,11,12,21,29,30 ప్రతికూల తేదీలు. **ఉత్తర1:** శుభకార్యాచరణకు సిద్ధం. ముంజేతి సమస్య పెరుగును. స్వీయకల్పనా శక్తిని పెంచుకోండి. వృత్తి వ్యాపారాదులలో ఒడిదుడుకులు స్వల్పము. మాసం మధ్య నుంచి ప్రశాంతత. శరీరానికి వైద్యసేవలను అందించాలి. శత్రుబెడద తగ్గుతుంది. 3,13,21,22,30 తేదీలు అనుకూలం కాదు. ఆగస్టు 20 మధ్యాహ్నం 2.53 నుంచి 22 సాయంత్రం 4.58 వరకు సమయం అనుకూలం కాదు.

**సెప్టెంబరు: మఘ:** శక్తికి మించిన కార్యాలు చేపడుదురు. కుటుంబ కలహం ఉండదు. నమ్మినవారిలో శత్రువులున్నారని గ్రహిస్తారు. గృహమరమ్మత్తులకై ధనవ్యయమగును. తండ్రి ఆజ్ఞలను ధిక్కరించకండి. చివరివారంలో జీవనస్థితిపై మెరుగైన ఆలోచనలు వచ్చును. 7,16,24, 25 ప్రతికూలములు. **పుబ్బ:** ఆశలు నిరాశలు కావు. ఋణవిషయంలో జాగ్రత్త పడతారు. బంధుప్రేరణతో సమస్య పరిష్కారం. హామీసంతకాలు వద్దు. న్యాయపోరాటం చేయాలని తలంపు వద్దు. ఉన్నతాధికారులచో అనుకోని లబ్ధి. స్పెక్యులేషన్ లబ్ధి కాదు. 8,17,25,26 అనుకూలం కాదు. **ఉత్తర1:** స్పెక్యులేషన్ యోగించును. మాతృ వర్గీయులచే లబ్ధి. రహస్య అంశాలను బహిర్గతం చేయరు. నిద్రలేమిని తగ్గించండి. ముంజేతి సమస్య తీరును. మానవతాభావంతో మెలుగుదురు. సంతానరీత్యా ఖర్చులు, ఐననూ మనశ్శాంతి. 9,18,27 ప్రతికూల తేదీలు. సెప్టెంబరు 16 రాత్రి 12.09 నుంచి 18 రాత్రి 12.55 వరకు ప్రతికూల సమయం.

**అక్టోబరు: మఘ:** ఆశాజనక పరిస్థితులు. ఋణ సదుపాయం ఏర్పడును. ప్రయాణంతో సమయం వృధా. సంతానంపై విమర్శలుండును. కోపం, నైరాశ్యాన్ని విడనాడాలి. మాసాంతంలో వృత్తిరీత్యా ఉన్నతులుం డును. మాతృ అంశాలలో శ్రద్ధ వహించాలి. 4,13,14,22 ప్రతికూల తేదీలు. **పుబ్బ:** మానసిక వత్తిడులు, చికాకులు తగ్గును. సామరస్య ధోరణిని అవలంబిస్తారు. బంధుమిత్రులతో శతృత్వానికి వెళ్లవద్దు. అలౌకిక అంశాలపై మక్కువ చూపుతారు. నిద్రలేమి ఉండును. స్వవృత్తుల వారికి ప్రోత్సాహకరం. పుకార్లను నమ్మవద్దు. 5,6,14,15, 23 అనుకూలములు కాదు. **ఉత్తర1:** దూరప్రయాణాలు లాభించును. వ్యూహాత్మక అంశాలను ఛేదిస్తారు. స్పెక్యులేషన్ స్వల్ప లాభసాటి. సంతానం శతృవులాగా వ్యవహరిస్తారు. స్త్రీలకు ఊహించని సౌకర్యాలేర్పడును. జాయింట్ వ్యాపారా లలో నమ్మకద్రోహ సూచన. 2వవారం విందువినోదాలతో సమయం వృధా. 6,7,15,16,24 అనుకూలతేదీలు కాదు. అక్టోబరు 14 ఉ 10.54 నుంచి 16 మ11.14 వరకు వ్యతిరేక సమయం.

**నవంబరు: మఘ:** ప్రతిభకు రాణింపు కలదు. మిత్రశతృత్వాలను గమనిస్తారు. రాజీ ప్రయత్నాలు నెరవేరును. స్థానచలన అవకాశములు లేవు. అవివాహితులకు శుభవార్తలు. శారీరక రుగ్మతలు తగ్గదల. బంధుప్రీతిని స్వాగతిస్తారు. తల్లిప్రేమచే నిర్ణయాలలో మార్పులు. 1,10,18,28 అనుకూల తేదీలు కాదు. **పుబ్బ:** ఉదరలోపం ఏర్పడును. కీలక నిర్ణయాలలో మార్పులు వచ్చును. ప్రేమికులతో వాదోపవాదాలు. నిత్య భయాందోళనలు వీడండి. నూతన పరిచయాలు లాభిస్తాయి. భాగ్యహ మార్పులు చోటుచేసుకొనును. ఆర్థిక విషయాలలో హామీలివ్వవద్దు. 1,2,11,19,29 వ్యతిరేక తేదీలు. **ఉత్తర1:** పెద్దల నిర్ణయాలను గౌరవించ లేరు. ప్రతిబంధకాలకు పరిష్కారాలు అన్వేషిస్తారు. జ్ఞాపకశక్తిని పెంచండి. హాస్యవచనాలతో, అసత్యాలతో కార్యసిద్ధి జరగదని గ్రహిస్తారు. మాసాంతంలో మనోసంకటాలు తగ్గిస్తారు. ముంజేతి సమస్య తీరును. 3,12,20,30 ప్రతికూలరోజులు. నవంబరు 10 రాత్రి 9.14 నుంచి 12 రాత్రి 10.31 వరకు అనుకూలం కాదు.

**డిశంబరు: మఘ:** ఆర్థికనష్టం పూడ్చుకుంటారు. హామీలకై సమయం వృధా చేస్తారు. స్పెక్యులేషన్ స్వల్ప లాభం. దూరప్రాంత అంశాలు లాభిం చును. ఆత్మవిశ్వాసం పెరుగును. నేత్రలోపముందని గ్రహించాలి. భాగస్వామ్య నిర్ణయాలలో నూతన మార్పులు. కళత్రంచే అనుకోని లబ్ధి. 7,8,15, 16,25 ప్రతికూలతేదీలు. **పుబ్బ:** శారీరక అలసట అధికం. అంచనాలు మాసం మధ్యలో తారుమారగును. న్యాయలావాదేవీలలో జాప్యం. రెండవ పక్షంలో ఆర్థికస్థితి మెరుగు. కుటుంబవిరోధాలు రాగల సూచన. సంతాన విషయాలలో ఆలస్యం తగదు. ఇరుగువారితో వైరిని పెంచవద్దు. 8,9,16,17,26 అనుకూలం కాదు. **ఉత్తర1:** వాగ్ధోరణిలో అసత్యాలు దొర్లును. ఆదాయానికి మించిన ఖర్చులు. అకాలభోజనాదులు, నిద్రలేమితో స్వల్ప అనారోగ్యం. పితృభాగ్య సమస్యలు మాసం మధ్యలో తొలగును. స్వవృత్తుల వారికి ఊహించని లబ్ధి. లోభగుణం పెరుగును. 9,10,17, 18,27 వ్యతిరేకములు. 8 ఉదయం 5.21 నుంచి 10 ఉదయం 8.29 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**జనవరి 2017: మఘ:** నూతన ఒప్పందాలు ఆలస్యంగా ఫలించును. సంతానంచే అమితోత్సాహం. వాగ్దానాలను తగ్గిస్తారు. స్నేహిత వర్గీయులతో జాగ్రత్తగా మెలగాలి. వ్యాపార ప్రయాణ సమస్యలున్ననూ నిరాశ ఉండదు. ఆర్థికమాంద్యమున్ననూ నష్టశాతం తక్కువ. రానిబాకీలపై పరిష్కారాలు చేసుకోవాలి. 3,4,12,21,22 అనుకూలములు కాదు. **పుబ్బ:** స్వవృత్తుల వారికి ఆశాజనకం. మేధాశక్తితో అన్వేషణను అధికం చేస్తారు. పాదలోపాలచే పనులు ఆగిపోతాయి. బంధుమిత్రాదులలో గౌరవమర్యాదలు పెరుగును. అశాంతితో తీసుకున్న నిర్ణయాలు ఫలించవు. జాయింటుదారులకు నిర్వహణ లోపాలు పెరుగును. 4,5,13,22,23 అనుకూలతేదీలు కాదు. **ఉత్తర1:** ముఖ్య విషయాలలో హామీలు తీసుకుంటారు. వాహనచోదకంలో జాగ్రత్త. గృహనిర్మాణ పనులు మందకొడి. కుటుంబ కలతలు తగ్గుముఖం. నూతన నిర్ణయాలను ముందుగా బహిర్గతం చేయవద్దు. 5,6,14,23,24 తేదీలు అనుకూలం కాదు. 4 మధ్యాహ్నం 11.15 నుంచి 6 మధ్యాహ్నం 3.45 వరకు వ్యతిరేకరోజులని గ్రహించాలి.

**ఫిబ్రవరి 2017: మఘ:** శతృవర్గీయులను అంచనా వేయగలరు. 2వ పక్షంలో వ్యూహాత్మక పావులు కదుపుదురు. మనఃక్లేశములు తగ్గును. నిస్వార్థసేవతో గుర్తింపు. పితృవర్గంచే ఆర్థికసహాయం పొందుదురు. సోమరితనం తగ్గించుకోవాలి. మాసం మధ్యలో సంతాన సమస్యలు తీరును. 8,9,17,18,27,28 ప్రతికూలములు. **పుబ్బ:** స్నేహసంబంధాలు పెరుగును. నూతన అగ్రిమెంట్లు ఫలించును. స్పెక్యులేషన్ లాభసాటి. అవివాహితులకు వివాహయోగం. కళత్రసుఖం ఉండును. ఆధ్యాత్మిక విషయాలతో కాలయాపన చేస్తారు. 9,10,18,19,28 అనుకూలం కాదు. **ఉత్తర1:** సంతానంచే లబ్ధి కలదు. పెద్దలఆశీస్సులు లభించును. అంతరంగిక అంశాలను బహిర్గతం చేయవద్దు. కీర్తిప్రతిష్ఠలలో సమస్యలున్నవని గ్రహించలేరు. నరాల, భుజాల తీపు రాగల సూచన. మాసాంతంలో మంగళకార్యములున్నవి. 2,10,11,20 అనుకూల తేదీలు కాదు. గతనెల 31 సా4.50 నుంచి ఫిబ్రవరి 2 రాత్రి 9.12 వరకు తిరిగి 27 రాత్రి 12.10 నుంచి మార్చి 1 అర్ధరాత్రి 3.16 వరకు అనుకూలం కాదు.

**మార్చి 2017: మఘ:** వ్యక్తిగత కక్షలను తగ్గిస్తారు. హడావుడి నిర్ణయాలతో ధననష్టం. పూచీలకు దూరంగా ఉండండి. ఉద్యోగస్తులపై నిఘా తగ్గును. స్పెక్యులేషన్ రాణింపు లేదు. బంధువులతో ప్రీతిగా మాట్లాడండి. గృహనిర్మాణ కార్యక్రమాలలో ముందంజ. 7,8,17,26,27 తేదీలు అనుకూలం కాదు. **పుబ్బ:** వివాద విషయాలలో జోక్యం చేసు కుందురు. అవివాహితులకు శుభయోగం. నేత్ర దంత రుగ్మతలు ఏర్పడు సూచన. సంతానంచే శుభవార్తలు. స్వవత్తుల వారు ధైర్యంగా ముందుకు వెళ్లాలి. 8,9,18,27 ప్రతికూల తేదీలు. **ఉత్తర1:** ఆవేశాలకు వెళ్లటంతో కుటుంబ కలతలు పెరుగును. మాసాంతంలో సంజాయిషీలు,విమర్శలు అధికమగును. భాగస్వామ్య నిర్ణయాలు లాభించును. రోగబాధలు ఉపశమిస్తాయి. శుభచర్చలలో విజయం సిద్ధించును. 1,9,10,19 అనుకూలం కాదు. 27 ఉదయం 9.37 నుంచి 29 మ11.39 వరకు ప్రతికూలం.



# కన్యారాశి

ఉత్తర 2,3,4పా (టో,పా,పి), హస్త 1,2,3,4 పా (పూ,షం,ణ,ఠ), చిత్ర 1,2పా (పే,పో)

| | |
|---|---|
| ఆదాయము: | 14 |
| వ్యయము : | 11 |
| పూజ్యత : | 02 |
| అవమానం : | 06 |

### కన్యారాశి వారు పఠించాల్సిన శ్రీ లలితా అష్టాక్షరీ నామాలు

ఓం శ్రీమత్సింహాసనేశ్వర్యై నమః (03)
ఓం చిదగ్నికుండసమ్భూతాయై నమః (04)
ఓం దేవకార్యసముద్యతాయై నమః (05)
ఓం ఉద్యద్భానుసహస్రాభాయై నమః (06)
ఓం చతుర్బాహుసమన్వితాయై నమః (07)
ఓం రాగస్వరూపపాశాఢ్యాయై నమః (08)
ఓం క్రోధాకారాంకుశోజ్జ్వలాయై నమః (09)
ఓం మనోరూపేక్షుకోదండాయై నమః (10)
ఓం పంచతన్మాత్రసాయకాయై నమః (11)
ఓం మరాళీమందగమనాయై నమః (47)
ఓం మహాలావణ్యశేవధయే నమః (48)
ఓం సర్వాభరణభూషితాయై నమః (51)
ఓం శివకామేశ్వరాంకస్థాయై నమః (52)
ఓం సుమేరుమధ్యశృంగస్థాయై నమః (55)
ఓం శ్రీమన్నగరనాయికాయై నమః (56)
ఓం చింతామణిగృహాంతస్థాయై నమః (57)
ఓం పంచబ్రహ్మాసనస్థితాయై నమః (58)
ఓం మహాపద్మాటవీసంస్థాయై నమః (59)
ఓం కదంబవాసిన్యై నమః (60)
ఓం సుధాసాగరమధ్యస్థాయై నమః (61)

**గమనిక:** 16వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

ఆగస్టు 11 వరకు గురువు ద్వాదశస్థాన సంచారంచే వివేకంతో వ్యవహరి స్తారు. వ్యక్తిగత విమర్శలతో సమస్యలుంటాయి. ఆదాయానికి మించి ఖర్చులు పెరుగును. ఆధిపత్య సంభాషణలు తగ్గును. బంధుప్రీతి పెరుగును. శరీర శ్రమ అధికము. వివాదాంశాలు సమసిపోవును. ఆగస్టు 12 నుంచి సంవత్సరాంతం వరకు గురువు జన్మరాశి సంచారంచే తలచిన కార్యములకు నెరవేరును. ఊహించని సౌకర్యాలు కల్గును. అంతర్గత కలహాలు ఉండవు. సమయస్ఫూర్తి పాటిస్తారు. శరీర ఆరోగ్యంపై శ్రద్ధ ఉంచుదురు.

2017 జనవరి 26 వరకు శని తృతీయస్థాన సంచారంచే స్థిరాస్తి అంశాలలో నిర్ణయాలు త్వరితంగా తీసుకోలేరు. సోదర సమన్వయం మధ్యస్తంగా ఉండును. స్పెక్యులేషన్ రాణింపు తక్కువ. అకారణ విరోధాలు తగ్గును. బుద్ధిబల నిర్ణయాలతో లబ్ధి కల్గును. మిత్రభేదం ఉండదు. జనవరి 27 నుంచి సంవత్సరాంతం వరకు శని చతుర్థంలో అతిచార సంచారంచే ముఖ్య కార్యరంగాన్ని సిద్ధం చేయుదురు. సహచరులతో పూర్ణ లబ్ధి. నూతన మార్గాలు కలిసివచ్చును. అవివాహితులకు అదృష్టయోగం. భాగస్వామ్య నిర్ణయాలు నెరవేరును. హామీ ప్రయత్నాలు నెరవేరును. కీలకనిర్ణయాలు తీసుకొనగలరు.

గ్రహసంచార స్థితులను విశ్లేషించగా తరచూ నిద్రాభంగములు. మనో వాంఛలు నెరవేరును. నిర్మాణాత్మక శక్తి పెంచుదురు. ప్రతిబంధక సమస్యలు తొలగును. ఆరోగ్య అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి. సంకల్ప బలం నెరవేరును. కుటుంబంలో సుఖశాంతులు. సంతానంచే పూర్ణ విజయాలు. స్పెక్యులేషన్ స్వల్ప రాణింపు. అపనిందలు, మిత్రశత్రుత్వాలు గమనిస్తూ మసలుకుంటారు. భూలావాదేవీలు అనుకూలిస్తాయి. స్థాన చలనం చేయలేక పోతారు. శుభకార్య సంకేతాలకై వేచి ఉంటారు. దైవ కార్యాలపై శ్రద్ధ ఉంచుతారు. వ్యూహాత్మక ఆలోచనలు కలిసివస్తాయి. మానసిక చింతన తొలగును. విద్యార్థినీ విద్యార్థులకు, స్త్రీలకు బాగా అనుకూలము. కంప్యూటర్ వైద్య, విద్య, న్యాయ, రవాణా రంగాల వారికి అనుకూల స్థితిగతులు. రాజకీయవాసులకు స్వల్ప సమస్యలుండును. వ్యవసాయ, కార్మిక, కర్షక, స్వయం ఉపాధి రంగాల వారికి అనుకూల పరిస్థితు లుండును. సోమరితనం తగ్గును.

**ఏప్రిల్: ఉత్తర1:** జ్ఞాపకశక్తిని పెంచుదురు. శరీరానికి వైద్యసేవలవ సరం. గౌరవ ప్రతిష్ఠలు, మనోనిబ్బరం పెరుగును. మాతృవర్గీయులచే లబ్ధి. సవృత్తుల వారికి ఆశాభంగములుండవు. గృహనిర్మాణంలో ఆటు పోట్లు. సోమరితనం, మనస్తాపం మాసాంతంలో అధికం. 7,15,16, 25,26 తేదీలు ప్రతికూలములు. **హస్త:** అసౌకర్యాలతో విసుగు అధికం. విరోధాలు తగ్గును. స్పెక్యులేషన్ రాణింపు తక్కువ. వ్యూహాత్మక అంశాలను రహస్యంగా ఉంచండి. ఆర్థికలావాదేవీలలో జాగ్రత్తలు తీసుకోవాలి. సుఖభోగాలను స్వాగతించుదురు. 8,16,17,26,27 వ్యతిరేకదినములు. **చిత్ర1,2:** పాలనా నిర్ణయాలు సజావుగా సాగును. ఆరోపణలు ఉండవు. 2వపక్షంలో కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. స్థిరలావాదేవీలలో లోపాలుండును. ప్రస్తీలకు ఊహించని సౌకర్యాలు. మాసాంతంలో సంతాన సమస్యలు. 9,18,28 అనుకూల తేదీలు కాదు. ఏప్రిల్ 7 అర్ధరాత్రి 2.22 నుంచి 9 అర్ధరాత్రి 1.57 వరకు అనుకూల సమయం కాదని గమనించాలి.

**మే: ఉత్తర1:** స్వయంవృత్తుల వారికి పూర్ణలబ్ధి. సమయస్ఫూర్తి పెరుగును. విమర్శలు ఉండవు. మాసం మధ్యలో విసుగు, కోపం అధికం. స్పెక్యులేషన్‌లో ఊహించని లబ్ధి. దాయాదులతో రాజీప్రయత్నాలు ఫలించవు. నూతన వాహనకొనుగోలుకు మార్గం సుగమం. 4,5,13,23 అనుకూలం కాదు. **హస్త:** శస్త్రచికిత్సకు అవకాశం కలదు. నమ్మినవారిలో శత్రువులు ఉంటారు. వాగ్దానాలు భంగము కావు. 2వవారంలో వ్యక్తిత్వలోపాలను సరిచేసుకుంటారు. శ్వాసకోశ రుగ్మతలున్నవి. 5,6,14,24 తేదీలు వ్యతిరేక ములు. **చిత్ర1,2:** రానిబాకీలు వసూలగును. సెంటిమెంట్ బలాన్ని పెంచు కుంటారు. ఆర్భాటాలు, ఆడంబరాలచే ధనవ్యయం. స్వల్ప ఆరోగ్య భంగము లున్నవి. స్వీయకల్పనాశక్తి పెరుగును. స్వవృత్తుల వారికి ప్రోత్సాహకర వాతావరణం ఉంటుంది. న్యాయఅంశాలలో కీలకమార్పులు చోటుచేసు కొనును. 6,15,25 అనుకూల తేదీలు కాదు. మే 5 మధ్యాహ్నం 1.18 నుంచి 7 మధ్యాహ్నం 12.42 వరకు సమయం ప్రతికూలమని గ్రహించాలి.

**జూన్: ఉత్తర1:** ఋణ సదుపాయం ఏర్పడును. కపటస్వభావుల ఆట కట్టిస్తారు. ప్రతిభకు రాణింపు కలదు. కార్మిక, కర్షక రంగావాసులకు మాసం మధ్యనుంచి అనుకూలం. స్వార్థబుద్ధితో విజయం పొందలేరు. ఆర్థిక అంశాలపై పట్టు సాధిస్తారు. ఉద్యోగ నిర్వహణలో జాగ్రత్త వహించాలి. 1,9,10,19,28 ప్రతికూల తేదీలని భావించాలి. **హస్త:** మానసిక చికాకులు తగ్గును. ఆశ్రిత పక్షపాతం ఉండదు. సోదర సోదరీ వర్గీయులతో సంభాషణలు మెరుగగును. శరీరతేజస్సు పెరుగును. ధనక్షయానికి అడ్డు కట్ట వేయలేరు. ముఖ్యచర్చలలో ప్రధానపాత్ర పోషిస్తారు. 2,10,11, 20,29 తేదీలు అనుకూలం కాదు. **చిత్ర1,2:** స్థిరాస్తులలో జాగ్రత్తలు తీసుకుంటారు. బుద్ధిబలం, మనోబలం పెరుగును. పట్టుదలతో కార్యసిద్ధి. సంతాన విషయాలలో శుభవార్తలు. 3,11,12,21,30 వ్యతిరేకతేదీలుగా గ్రహించాలి. జూన్ 1 రాత్రి 10.39 నుంచి 3 రాత్రి 11.02 తిరిగి 29 ఉదయం 5.38 నుంచి జూలై 1 ఉదయం 7.29 వరకు ప్రతికూలం.

**జూలై: ఉత్తర1:** శత్రువులపై విజయం సాధిస్తారు. మానసిక సంఘర్షణ లకు దూరంగా ఉంటారు. అనవసర ఖర్చు తగ్గును. సంతాన అంశాలపై దృష్టి పెడతారు. స్పెక్యులేషన్ లాభించును. కళత్రసౌఖ్యం ఉండును. నూతన ప్రణాళికలలో జాప్యం చేస్తారు. 6,7,16,17,25,26 అనుకూలములు కాదు. **హస్త:** నిస్వార్థ సేవలను తరచూ అందిస్తారు. వ్యక్తిగత ప్రతిష్ఠలచే ధనవ్యయం. కళత్ర సలహాలను స్వీకరిస్తారు. ఆరోగ్య భంగములున్ననూ ప్రయాణాలు చేస్తారు. మాసాంతంలో కీలకవిషయాలలో ఆత్మవిశ్వాసంతో విజయప్రాప్తి. 7,8,17,18,26,27 తేదీలు ప్రతికూలములు. **చిత్ర1,2:** 2వవారంలో శారీరక అలసట పెరుగును. పిత్రార్జిత అంశాలపై దృష్టి ఉం చుతారు. నూతన ఆలోచనలలో అనుకూల మార్పులు. మంగళకార్యాలకు శ్రీకారం చుడతారు. నిరుద్యోగులకు తీపివార్తలు. 2వవారంలో సవృత్తుల వారికి ఆశాభంగం. 8,9,18,19,27 తేదీలు అనుకూలము కాదు. జూలై 26 మధ్యాహ్నం 11.06 నుంచి 28 మధ్యాహ్నం 1.48 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**ఆగస్టు: ఉత్తర1:** సంకల్పబలం నెరవేరును. విధివిధానాలలో అధిక మార్పులు, వ్యూహాత్మక నిర్ణయాలు చేయుదురు. నూతన వాహనకొనుగోలు వాయిదా. ఆంతరంగిక అంశాలను బహిర్గతం చేయవద్దు. ఇరుగువారితో మనస్పర్ధలు. నిందలు విమర్శల జోలికి వెళ్లవద్దు. మాసాంతంలో ఆర్థిక లబ్ధి. 3,13,21,22,30,31 ప్రతికూల తేదీలు. **హస్త:** వ్యక్తిగత ప్రతిష్ఠలు పెరుగును. సంతానంచే విజయవార్తలు. బంధుప్రీతిని స్వాగతిస్తారు. సహచర ఉద్యోగులతో సమన్వయంతో వ్యవహరించాలి. శాంతిచర్చలతో విజయ ప్రాప్తి. భుజాలు, మోకాళ్ల రుగ్మతలకు వైద్యసేవలుండును. 4,14,22, 23,31 వ్యతిరేక తేదీలని గమనించాలి. **చిత్ర1,2:** వివాద అంశాలు సమసిపోవును. శతృభయం తగ్గును. స్థిరఆలోచనలకే పెద్దపీట వేస్తారు. మాసం మధ్యలో ఇష్టకార్యసిద్ధి. తోబుట్టువులతో సహకరించండి. శరీరానికి వైద్య సేవలందించాలి. గృహనిర్మాణ పనులలో ఆటంకాలధికము. 5,15,23,24 తేదీలు అనుకూలం కాదు. ఆగస్టు 22 సాయంత్రం 4.58 నుంచి 24 రాత్రి 7.12 వరకు ముఖ్య అంశాలలో జాగ్రత్త అవసరం.

**సెప్టెంబరు: ఉత్తర1:** ప్రతిబంధక వ్యవహారాలు వాయిదా పడును. నరాల, భుజాలతీపు అధికము. వ్యవహార శైలిలో మార్పులు చేయాలి. స్పెక్యులేషన్ లాభసాటి కాదు. ఎదుటివారితో ఆచితూచి సంభాషిస్తారు. అకాలభోజనాలధికం. 9,18,26,27 అనుకూలతేదీలు కాదు. **హస్త:** ధనం మంచినీళ్ల ప్రాయంగా ఖర్చుపెడుదురు. ప్రయత్నపూర్వకంగా కార్యసిద్ధి. కుటుంబ అన్యోన్యత పెరుగును. నూతన వ్యాపార ఒప్పందాలు జాప్యం. స్వవృత్తుల వారికి కీర్తి పెరుగును. 3వ వారంలో న్యాయవిషయాలచే కలవర పాటు. అవివాహితులకు శుభవార్తలు. 1,10,11,19,27,28 తేదీలు వ్యతిరేకములు. **చిత్ర1,2:** హామీ సంతకాలచే సమస్యలుండును. మిత్ర సహాయంతో లబ్ధి కల్గును. సంతానసౌఖ్యం లాభించును. రహస్య సమాలోచనలు బెడిసికొట్టును. మాసాంతంలో నిద్రలేమి,విసుగు అధికం. 1,2,20,28,29 ప్రతికూలతేదీలు. సెప్టెంబరు 18 రాత్రి 12.55 నుంచి 20 అర్ధరాత్రి 1.40 వరకు ప్రతికూల సమయం.

**అక్టోబరు: ఉత్తర1:** గృహవాతావరణం అనుకూలము. సాహస నిర్ణయాలపై దృష్టి సారిస్తారు. పెద్దల ఆశీస్సులు, ప్రోత్సాహంతో కీలక అంశాలలో ముందంజ. ఋణదాతల వత్తిడి పెరుగును. దూర ప్రయాణాలలో ఆలస్యంగా లబ్ధి. 6,7,15,16,23,24 ప్రతికూలతేదీలు. **హస్త:** వ్యూహాత్మక ఆలోచనలు ఫలించును. పాతమిత్రత్వం కోరుకుంటారు. భాగస్వామ్య ఒడంబడికలు నెరవేరును. బంధువులతో ప్రీతిగా మాట్లాడండి. ఉద్యోగ నిర్వహణలో సమస్యలుండును. శుభకార్యాలలో సంతానంచే సమస్యలు. స్పెక్యులేషన్ నష్టదాయకం. 7,8,16,17,25 తేదీలు వ్యతిరేకములు. **చిత్ర1,2:** వ్యక్తిగత దూషణలు తగ్గిస్తారు. ఆడంబరాలకు ధనవ్యయం. మేనమామ సహాయంతో కార్యసిద్ధి. స్త్రీలకు యోగవంతం. ఏకాభిప్రాయ సాధనతో నిర్ణయాలు సాధ్యమగును. ఉద్యోగుల మీద నిఘా ఉన్నది. ఉదర సమస్య రాగల సూచన. హాస్యంచే గౌరవం పెరుగును. 8,9,17,26 అనుకూల తేదీలు కాదు. అక్టోబరు 16 మధ్యాహ్నం 11.14 నుంచి 18 ఉ10.37 వరకు అనుకూలం కాదు.

**నవంబరు: ఉత్తర1:** శక్తియుక్తులతో కార్యసిద్ధి. లౌకిక విషయాలపై శ్రద్ధ చూపుదురు. పుణ్య కార్యాచరణపై మక్కువ చూపుదురు. మాసాంతంలో త్రిప్పట, ఖర్చులు అధికం. మిత్ర శతృత్వాలను గమనించి మసలుకోవాలి. నూతన వాహనకొనుగోలుకు మార్గం సుగమం. మాసాంతంలో శతృబెడద. సంతాన సమస్యలచే మనోచింతన అధికం. 2,3,12, 20,30 అనుకూల తేదీలు కాదు. **హస్త:** వ్యాపార నిర్ణయాలు వాయిదా పడును. ఋణాన్వేషణకు సమయం కేటాయించాలి. ముఖ్యవిషయాలలో హామీలుండవద్దు. కళారంగాలలో ఉన్నవారికి శతృబెడద. మాసం మధ్యలో స్థానచలన సూచన. విసుగు, ఆందోళన తగ్గును. నేత్ర రుగ్మత నుంచి ఉపశమనం. 4,13,21 తేదీలు వ్యతిరేకములని భావించాలి. **చిత్ర1,2:** స్నేహ సంబంధాలు, కుటుంబసౌఖ్యం మెరుగుపడును. పరిష్కారం కాని సమస్యకు మోక్షం కల్గును. అంకితభావానికి పెద్దపీట వేస్తారు. అకాల భోజనాదులు. పాదరుగ్మత రాగల సూచన. 5,13,14,22 ప్రతికూల తేదీలు. నవంబరు 12 రాత్రి 10.31 నుంచి 14 రాత్రి 9.39 వరకు వ్యతిరేక సమయం.

**డిశంబరు: ఉత్తర1:** రాజీధోరణితో వెళ్తారు. విమర్శలను ప్రతిఘటిస్తారు. వాగ్ధోరణిని అదుపుచేస్తారు. రక్షణ కొరకుగా వ్యక్తుల సహాయాలని తీసుకోవాలి. ధర్మావేశం అనుకూలం కాదు. మాసాంతంలో మనస్పర్ధలుండును. సంతానానికి పరోక్షసహాయం. అవివాహితులకు శుభసమయం. 9,17,18, 27,28 తేదీలు ప్రతికూలములు. **హస్త:** జాయింట్ వ్యాపారాలు లాభిస్తాయి. స్పెక్యులేషన్ దారి తప్పును. 3వవారంలో ఉద్యోగనిర్వహణలో సమస్యలు. వాహనసౌఖ్యం లాభించును. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. మానవతాభావంతో మెలుగుతారు. 1,10,18,19,28,29 అనుకూల తేదీలు కాదు. **చిత్ర1,2:** సంతాన అంశాలు సజావుగా సాగును. ఉదరలోపం పెరుగును. అభివృద్ధిలో స్వల్ప మందకొడి. భయాందోళనలుండవు. ఆర్భాటాలచే ధనవ్యయం. భాగస్వామ్య నిర్ణయాలలో కీలకమార్పులు. మాసం మధ్యలో మనోవాంఛలు సిద్ధించును. 2,11,19,20,29,30 వ్యతిరేకతేదీలని భావించాలి. డిశంబరు 10 ఉదయం 8.29 నుంచి 12 ఉదయం 8.50 వరకు సమయం ప్రతికూలమని భావించాలి.

**జనవరి 2017: ఉత్తర1:** కఠిననిర్ణయాలు తీసుకుందురు. పుకార్లను నమ్మి నష్టపోతారు. పితృవర్గంవారితో స్వల్ప మనస్పర్ధలు. శ్వాసకోశ రుగ్మతలుండును. మంగళకార్యాలకు ఆటంకాలు తొలగిపోవును. మోకాళ్ల రుగ్మత ఏర్పడును. గృహమరమ్మత్తులకై ధనవ్యయం. 5,6,14,23,24 తేదీలు వ్యతిరేకములు. **హస్త:** స్పెక్యులేషన్ అనుకూలం కాదు. మానసిక చింతన పెరుగును. ఆదాయానికి గండి. సజ్జన సహచర్యంచే లబ్ధి. 2వ వారం మధ్యలో కుటుంబ చికాకుల నుంచి ఉపశమనం. వృత్తి సమస్యలు స్వల్పంగా పెరుగును. మాసం చివరలో విందు, వినోదాలతో మానసికోల్లాసం. 6,7,15,24,25 ప్రతికూలతేదీలు. **చిత్ర1,2:** స్వయంరంగాల వారికి స్వల్ప లోపాలు. దైవకార్యాలపై శ్రద్ధ చూపిస్తారు. మృదువాక్కులతో ఆకట్టుకుంటారు. వృత్తి వ్యాపారాలలో జాగ్రత్తగా ఉండాలి. కళత్ర విభేదములు తగ్గును. సోదర సంఘీభావంతో మాసం మధ్యలో శుభ వార్తలు. 7,8,16,25,26 అనుకూలతేదీలు కాదు. జనవరి 6 మధ్యాహ్నం 3.45 నుంచి 8 సాయంత్రం 5.54 వరకు అనుకూలం కాదని గమనించాలి.

**ఫిబ్రవరి 2017: ఉత్తర1:** సంతానంచే విజయవార్తలు. భయాందోళనలు తగ్గును. ప్రతిష్ఠాత్మక నిర్ణయాలు విజయవంతం. పరోపకారం, సత్సాంగత్యం పెరుగును. సంతాన సఖ్యతకు ప్రణాళిక సిద్ధం చేస్తారు. మాస చివరలో ఆశాభంగం. దైవకార్యాచరణపై మొగ్గు చూపుదురు. 2,10,11,20 తేదీలు ప్రతికూలములు. **హస్త:** మనోనిబ్బరం కొనసాగిస్తారు. పితృవర్గం వారితో పేచీలుండవు. 2వ వారంలో ఆర్థికంగా వృద్ధి. నిద్రలేమి ఉండదు. దీర్ఘకాల సమస్య పరిష్కారదిశలో ఉండును. వ్యక్తిగత విమర్శలు వద్దు. వాహన మరమ్మత్తులుండును. 3,11,12,21 అనుకూల తేదీలు కాదు. **చిత్ర1,2:** ఆర్థిక పరిపుష్టి కల్గును. అకాల భోజనాలు, నిద్రలేమి అధికం. మనోవాంఛలు ఆలస్యంగా సిద్ధించును. సంతానానికి సహాయం చేస్తారు. సమయస్ఫూర్తిగా నిర్ణయాలు తీసుకోవాలి. శాంత స్వభావంతో అనుకూలత. సోమరితనం తగ్గిస్తారు. కళత్రసౌఖ్యముండును. నిస్వార్ధ సేవతో గుర్తింపు లభించును. 4,12,13,22 వ్యతిరేకతేదీలు. ఫిబ్రవరి 2 రాత్రి 9.12 నుంచి 4 అర్ధరాత్రి 12.16 వరకు ప్రతికూల సమయం.

**మార్చి 2017: ఉత్తర1:** స్థిరాదాయం తగ్గును. ఖర్చులు, విమర్శలు, విసుగు పెరుగును. స్పెక్యులేషన్ యోగించదు. ముఖ్య విషయాలలో గోప్యత పాటించాలి. మాసం మధ్యలో స్తంభించిన కార్యం సానుకూలం. సోదరమైత్రి పెరుగును. 1,9,10,19,28,29 ప్రతికూల తేదీలు. **హస్త:** వ్యవహారశైలిలో మార్పులుండును. హడావుడి నిర్ణయాలు తీసుకోలేరు. స్వవృత్తులు, రాజకీయులకు అభివృద్ధి సాధారణం. ఆరోగ్య అంశాలలో తాత్సారం వద్దు. గృహవాతావరణం ఆశాజనకం. నిర్వహణ బాధ్యతలో లోపాలు సవరించాలి. 2,10,11,20,21 అనుకూలములు కాదు. **చిత్ర1,2:** పాత మిత్రత్వంచే విజయప్రాప్తి. సంయమనంతో విజయాన్ని పొందుదురు. ఉన్నతస్థాయి వ్యక్తులతో లబ్ధి. స్పెక్యులేషన్ ఆశాజనకం. అవివాహితులకు వివాహయోగం. కళత్రంచే ఖర్చులధికం. 3,11,12,21, 22 తేదీలు వ్యతిరేకములు. మార్చి 1 రాత్రి 3.16 నుంచి 4 ఉ5.40 వరకు తిరిగి 29 మ 11.39 నుంచి 31 మ12.32 వ్యతిరేకము.



# తులారాశి

చిత్ర 3,4పా (రా,రి), స్వాతి1,2,3,4పా (రూ,రే,రో,తా), విశాఖ 1,2,3పా (తీ,తూ,తే)

| | |
|---|---|
| ఆదాయము: | 11 |
| వ్యయము : | 04 |
| పూజ్యత : | 05 |
| అవమానం : | 06 |

**తులారాశి వారు పఠించాల్సిన శ్రీ లలితా అష్టాక్షరీ నామాలు**

ఓం దక్షిణాదక్షిణారాధ్యాయై నమః (923)
ఓం దరస్మేరముఖాంబుజాయై నమః (924)
ఓం శ్రుతిసంస్తుతవైభవాయై నమః (929)
ఓం పంచసంఖ్యోపచారిణ్యై నమః (950)
ఓం బంధూకకుసుమప్రఖ్యాయై నమః (964)
ఓం సువాసిన్యర్చనప్రీతాయై నమః (971)
ఓం బిందుతర్పణసంతుష్టాయై నమః (974)
ఓం దశముద్రాసమారాధ్యాయై నమః (977)
ఓం త్రిపురాశ్రీవశంకర్యై నమః (978)
ఓం జ్ఞానజ్ఞేయస్వరూపిణ్యై నమః (981)
ఓం వాంఛితార్థప్రదాయిన్యై నమః (989)
ఓం అభ్యాసాతిశయజ్ఞాతాయై నమః (990)
ఓం షడధ్వాతీతరూపిణ్యై నమః (991)
ఓం అవ్యాజకరుణామూర్తయే నమః (992)
ఓం అజ్ఞానధ్వాంతదీపికాయై నమః (993)
ఓం ఆబాలగోపవిదితాయై నమః (994)
ఓం సర్వానుల్లంఘ్యశాసనాయై నమః (995)
ఓం శ్రీచక్రరాజనిలయాయై నమః (996)
ఓం శ్రీమత్త్రిపురసుందర్యై నమః (997)
ఓం శివశక్త్యైక్యరూపిణ్యై నమః (999)

**గమనిక:** 16వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

ఆగస్టు 11 వరకు గురువు ఏకాదశ స్థాన సంచారంచే నిర్వహణ బాధ్యతలు పెరుగును. విధాన నిర్ణయాలు ఆలస్యంగా సాగును. జాయింట్ వ్యాపార నిర్ణయాలు వాయిదా పడును. శక్తియుక్తులు, హుందాతనంతో వ్యవహరించిననూ లబ్ధి తగ్గును. ఆగస్టు 12 నుంచి గురువు ద్వాదశస్థాన సంచారంచే కపటులు చేసిన మోసంతో ఆర్థిక నష్టం. అసత్యాలధికం. విమర్శలు, దూషణలు ఉండును. వాగ్దానాల జోరు తగ్గును. శస్త్రచికిత్స రాగల సూచన. లౌకిక విషయాలపై శ్రద్ధ చూపలేరు.

2017 జనవరి 26 వరకు ఏలినాటి శని తృతీయభాగంలోనే ఉంటారు. రాజీధోరణితో వెళ్లుట ఉత్తమము. ఆర్థికమాంద్యం ఉండును. హామీలచే నష్టం రాగల సూచన కలదు. ఎదుటివారి నుంచి ఆశించినది పూర్తిగా రాదు. కుటుంబంలో మనశ్శాంతి ఉండును. వ్యవహార శైలిలో అనుకూల మార్పులుండును. జనవరి 27 నుంచి సంవత్సరాంతం వరకు శని తృతీయ రాశిలో సంచారంచే సోదర సమస్యలు రాగలవు. భూ,గృహ ధనవిషయంలో చికాకులధికము. ఆర్థిక పరిపుష్టి తగ్గును.

గ్రహసంచార స్థితిగతులను విశ్లేషించగా దీర్ఘ ప్రణాళికలు లాభించును. లౌకిక విషయాలపై శ్రద్ధ పెరుగును. సంతాన అంశాలు సజావుగా సాగును. జీవనోపాధిలో స్థిరత్వమేర్పడును. సోదరులతో జాగ్రత్తగా మెలగాలి. వివేకంతో ఆదాయమార్గాలను అన్వేషిస్తారు. ఎంతటి కార్యభారమైననూ సాధిస్తామనే ధైర్యం వస్తుంది. వృత్తిరీత్యా ఉన్నతులు రాగల సూచన. ఆర్భాటా లకు, ఆడంబరాలకు అధిక ధనవ్యయం. రహస్య చర్చలు సానుకూలంగా నడుచును. బుద్ధిబలంతో జాగ్రత్త పడుతూ వస్తారు. న్యాయ స్థాన లావాదేవీలచే విజయప్రాప్తి. శుభకార్య పరంపరచే ఆర్థికమాంద్యం ఏర్పడే సూచన. అనవసర హామీలు ఇవ్వటంతో వత్తిడి పెరిగి అంచనాలు తారుమారగును. స్త్రీలకు స్వల్పంగా అనుకూలం. రాజకీయులకు ప్రయోజనాలు తక్కువ. విద్యార్థినీ విద్యార్థులకు అవకాశాలు మెండు. స్వయం ఉపాధివాసులకు విజయాలు కలిసివస్తాయి. స్పెక్యులేషన్ నిదానంగా రాణించును. మిగిలిన అన్నీ రంగాల వారికి ఏకాభిప్రాయ సాధనతో లబ్ధిని పొందగలుగుదురు.

**ఏప్రిల్: చిత్ర3,4:** శుభసంకేతాలుండును. ఆర్థిక మాంద్యం ఉండదు. శత్రువులపై విజయం సాధిస్తారు. అలౌకిక విషయాలపై ఆసక్తి చూపుతారు. స్వవృత్తుల వారికి 2వవారంలో ఊరట. హామీ ప్రయత్నాలు చేయవద్దు. 9,17,18,27,28 ప్రతికూల తేదీలు. **స్వాతి:** స్వవృత్తుల వారికి ఆశాజనకం. రాజకీయ వాసులకు అనుకూలం. సంతాన శ్రద్ధ చూపుతారు. స్పెక్యులేషన్ రాణింపు. చర్మసమస్య కలదు. 3వవారంలో ఆచితూచి సంభాషించాలి. 9,10,19,29 అనుకూల తేదీలు కాదు. **విశాఖ1,2,3:** ముఖ్య ప్రయాణాలు లాభించును. పాదాలకు రుగ్మత రాగల సూచన. మిత్రశత్రుత్వాలను తెలుసుకుంటారు. స్వీయకల్పనా శక్తిచేత మనోచింతనను అధిగమిస్తారు. కుటుంబ నిర్ణయాలు గట్టెకును. ఉద్యోగ, వ్యాపారులకు మాసం మధ్య నుంచి అనుకూలం. సంతానంచే కీర్తి ప్రతిష్ఠలు. 10,11, 20,29,30 తేదీలు వ్యతిరేకములు. ఏప్రిల్ 9 అర్ధరాత్రి 1.57 నుంచి 11 అర్ధరాత్రి 3.33 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహించాలి.

**మే: చిత్ర3,4:** భాగస్వామ్య చర్చలు నెరవేరును. మాతృవర్గీయులచే లబ్ధి. కీర్తి ప్రతిష్ఠలను రక్షించుకుంటారు. దంపతుల మధ్య అన్యోన్యత తగ్గును. స్వల్ప ప్రతికూలతలున్నా ఆశాభావంతో ఉంటారు. 2వవారంలో వృథా ప్రయాణాలు. ఆర్భాటాలచే ధనవ్యయం. 6,7,15,25 తేదీలు అనుకూలం కాదు. **స్వాతి:** శుభకర వార్తలతో మాస ప్రారంభం. ధనక్షయానికి అడ్డుకట్ట వేస్తారు. వాతరోగ బాధలు 2వపక్షంలో అధికం. ప్రశాంతచిత్తంతో కీలకసమస్య పరిష్కారం. స్త్రీమూలకంగా లాభించుదురు. 7,16,26 వ్యతిరేకతేదీలని గమనించాలి. **విశాఖ1,2,3:** వేధింపు జనుల విమర్శలను తట్టుకుంటారు. రాజీధోరణిని అవలంబిస్తారు. నూతన ఆదాయ మార్గాలను అన్వేషిస్తారు. పాతమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. అనవసర ఖర్చులున్ననూ మనోవాంఛలు నెరవేరును. ప్రతిభకు గుర్తింపు లభించును. 8,17,18,27 ప్రతికూల తేదీలు. మే 7 మధ్యాహ్నం 12.42 నుంచి 9 మధ్యాహ్నం 1.08 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

**జూన్: చిత్ర3,4:** ఋణభారం పెరుగును. స్పెక్యులేషన్‌లో అపజయం. వాగ్దాన భంగములుండును. సామర్థ్యం లేని వ్యక్తులచే విమర్శలు. 2వ పక్షంలో ముఖ్యప్రయాణాలచే లబ్ధి. స్థానచలన అవకాశములున్నవి. అకాల భోజనాదులున్నవి. 2,3,11,12, 21,22,30 తేదీలు అనుకూలం కాదు. **స్వాతి:** వ్యూహాత్మక అంశాలు కలిసిరావు. గర్వభంగములున్నవి. సంతానానికి పరోక్ష సహాయం అందిస్తారు. దూరబంధువుల నుంచి శుభవార్తా శ్రవణం. కుటుంబంతో విహారాలతో 4వవారంలో ప్రశాంతత. స్వల్పంగా ఆరోగ్య భంగములున్నవి. 3,4,12, 13,22,23 ప్రతికూల తేదీలు. **విశాఖ1,2,3:** అవివాహితులకు స్వల్పంగా శుభవార్తలు. మిత్రశత్రుత్వాలను గమనించలేరు. ఉద్యోగులకు అధికారుల నుంచి విమర్శలు. మానసిక సంఘర్షణ తగ్గించాలి. ఆర్థిక స్థితి మెండు. మాసాంతంలో వృత్తి, వ్యాపారాలలో ముందడుగు. 4,5,13,14,23,24 తేదీలు వ్యతిరేకములు. జూన్ 3 రాత్రి 11.02 నుంచి 5 రాత్రి 11.31 వరకు ప్రతికూల వాతావరణం.

**జూలై: చిత్ర3,4:** ఆర్థిక నష్టం పూడ్చుకుంటారు. ఋణసమస్యలు స్వల్పంగా తగ్గును. ఇష్టకార్యసిద్ధికై కఠిన పరిశ్రమ చేస్తారు. శరీర తేజస్సు పెరుగును. శ్వాసనాళ సమస్యలకై వైద్యుని సంప్రదించాలి. 2వ పక్షంలో బంధుసమాగంలో ఆచితూచి మాట్లాడాలి. 8,9,18,19,27,28 తేదీలు వ్యతిరేకములు. **స్వాతి:** మాసాంతంలో స్థానచలన సూచనలు. అంచనాలు వాస్తవరూపం దాల్చవు. సాహస ప్రయత్నాలు వద్దు. కార్మికులకు 3వ వారంలో అనుకూలం. ఆత్మవిశ్వాసంతో మాసాంతంలో విజయ ప్రాప్తి. మృదు సంభాషణచే నూతన అవకాశాలు. 1,9,10,19,20,28 అనుకూల తేదీలు కావు. **విశాఖ1,2,3:** మనోసంకటాలు అధికమగును. దైవారాధనకి అధిక సమయం కేటాయిస్తారు. ఆరోగ్యంపై శ్రద్ధ చూపించాలి. ఆర్థిక అంశాలపై 2వవారంలో పట్టు. సంతానంచే శుభవార్తలు. 2,11,20, 21,29 ప్రతికూల తేదీలు. జూలై 1 ఉదయం 7.29 నుంచి 3 ఉదయం 9.01 వరకు తిరిగి 28 మధ్యాహ్నం 1.48 నుంచి 30 సాయంత్రం 4.35 వరకు వ్యతిరేకసమయంగా భావించాలి.

**ఆగస్టు: చిత్ర3,4:** ఆశాజనకంగా మాసం గడిచిపోవును. హామీ ప్రయత్నాలు నెరవేరును. ధనక్షయమున్నది. ప్రతిష్ఠాత్మక నిర్ణయాలలో జాప్యమున్ననూ విజయవంతం. 2వపక్షంలో ఉద్యోగస్థిరత్వం. కుటుంబ విషయాలలో కీలక నిర్ణయాలు. నూతన పరిచయస్థులతో జాగ్రత్త వహించాలి. 5,15,23,24 అనుకూలరోజులు కాదు. **స్వాతి:** కుటుంబ సమస్యలు సర్దుమణుగును. నూతన అగ్రిమెంట్లు కలిసివచ్చును. భాగస్వామ్య నిర్ణయాలతో ఆర్థిక లబ్ధి. స్వవృత్తుల వారికి కృషికి తగిన ఫలితం. స్త్రీలకు శుభ సమయం. మాసాంతంలో ఆదాయానికి మించిన ఖర్చులు. 6,16,24,25 ప్రతికూల సమయములు. **విశాఖ1,2,3:** వివాదాలుండవు. స్వయంవృత్తుల వారికి పూర్తి అనుకూలం. సాహసప్రయత్నాలు ఫలిస్తాయి. స్వర్ణాభరణ కొనుగోళ్లుండును. క్రీడా రంగాల వారికి విమర్శలు. న్యాయ విషయాలలో వాయిదాతో మనస్తాపం. స్పెక్యులేషన్‌లో గెలుపు తక్కువ. 7,8,17,25,26 వ్యతిరేక తేదీలు. ఆగస్టు 2 రాత్రి 7.12 నుంచి 26 రాత్రి 10.23 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**సెప్టెంబరు: చిత్ర3,4:** అధికారుల బెడద ఉండదు. కృతనిశ్చయం బలంగా ఉండును. వ్యూహాత్మక శక్తి, ఆత్మవిశ్వాసం పెరుగును. రెండవ పక్షంలో శరీరబాధలుండును. బంధుమిత్రాదులతో వైరి వద్దు. పంతాలకు పోయి మోసపోవు సూచన. ఉన్నత వ్యక్తుల పరిచయాలుండును. 1,2,11, 12,20,28,29 ప్రతికూల తేదీలు. **స్వాతి:** తలచిన కార్యాలు వాయిదా. స్పెక్యులేషన్‌లో రాణింపు తక్కువ. సంతాన అంశాలలో క్రొత్త నిర్ణయాలు చేస్తారు. జ్ఞాపకశక్తి, సోదర సంఘీభావం పెరుగును. కంఠ సమస్య రాగల సూచన. పితృవర్గీయులచే సహాయ సహకారాలు. 2,3,12,13,20,21, 29,30 అనుకూల తేదీలు కాదు. **విశాఖ1,2,3:** గృహనిర్మాణ పనులు శ్రద్ధగా ఆచరిస్తారు. మాసం మధ్యలో స్వల్పంగా మనక్లేశములు. వ్యాపార ఉద్యోగ సమస్యలున్నవి. ముంజేతి సమస్యకై వైద్యసహాయం తీసుకోవాలి. రహస్య మంతనాలు వద్దు. అంకితభావానికి పెద్దపీట వేస్తారు. 3,4,13, 14,21,22 ప్రతికూల సమయములు. సెప్టెంబరు 20 అర్ధరాత్రి 1.40 నుంచి 23 అర్ధరాత్రి 3.02 వరకు సమయం ప్రతికూలమని భావించాలి.

**అక్టోబరు: చిత్ర3,4:** వినోదకాలక్షేపాలు అధికం. స్థిరాస్తి నిర్ణయాలలో వాయిదా. నిర్ణయాలను నిర్భయంగా చెప్పగలరు. లాభార్జనకై నూతన నిర్ణయాలు చేస్తారు. స్త్రీలకు యోగవంతం. అధికారుల నుంచి ప్రశంసలు. సంతానరీత్యా సమస్యలుత్పన్నం. నేత్రలోపముందని గ్రహించాలి. 8,9,17, 26 అనుకూలతేదీలు కాదు. **స్వాతి:** శరీరానికి వైద్యసేవలు అవసరం. సమయస్ఫూర్తి లోపించును. జాయింట్‌వ్యాపారులకు ఆదాయానికి గండి. పినతల్లి, మేనమామ సహాయంతో లబ్ధి. రాజీప్రయత్నాల జోలికి వెళ్లకండి. కళత్రంచే ఖర్చులు. ఇరుగువారితో కలహాలకు తావివ్వవద్దు. 9,10, 18,27 తేదీలు ప్రతికూలములు. **విశాఖ1,2,3:** కార్యదీక్షాబాధ్యత పెరుగును. సోదరులచే సమస్యలు. దూరప్రయాణాలచే సమయం వృధా. పుణ్యకార్యాచరణపై మక్కువ పెరుగును. దీర్ఘప్రణాళికలో లోపాలున్నవని గమనించలేరు. మాసాంతంలో స్నేహిత వర్గీయులతో ప్రశాంతంగా గడుపుదురు. 1,10,11,19,28 వ్యతిరేకతేదీలుగా గ్రహించాలి. అక్టోబరు 18 ఉ 10.37 నుంచి 20 మధ్యాహ్నం 11.11 వరకు అనుకూలం కాదు.

**నవంబరు: చిత్ర3,4:** ఆప్తమిత్రుల అండదండలు అధికం. ఆశలు నిరాశలు కావు. అధర్మకార్యాలవైపు వెళ్లరు. న్యాయ అంశాలలో విజయం. సోమరితనాన్ని తగ్గించాలి. శక్తియుక్తులతో, హుందాతనంతో అధికార లబ్ధి. నూతన గృహకొనుగోలులో ముందంజ. 5,13,14,22 తేదీలు వ్యతిరేకములు. **స్వాతి:** వ్యక్తిగత విమర్శలు చేయరు. వ్యాపార అంశాలలో పావులు కదుపుతారు. రోగనిరోధకశక్తి పెరుగును. పరోపకారం, సత్సాంగత్యం పెరుగును. మాసం మధ్యలో కుటుంబ కలహాలతో అశాంతి. తోటి ఉద్యోగస్థులతో జాగ్రత్తగా సంభాషించాలి. 6,14,15,23,24 అనుకూల తేదీలు కాదని గ్రహించాలి. **విశాఖ1,2,3:** నూతన విధి విధానాలచే విజయ ప్రాప్తి. ఉన్నత వ్యక్తులచే కార్యసిద్ధి. సంతాన సఖ్యత విషయంలో చికాకులు. స్పెక్యులేషన్ లాభసాటి కాదు. అంతర్గత శతృబెడదలు. మాసాంతంలో తెలియని ఆందోళన,భయం పెరుగును. 7,15,16,24,25 ప్రతికూల తేదీలు. నవంబరు 14 రాత్రి 9.39 నుంచి 16 రాత్రి 8.59 వరకు వ్యతిరేక సమయమని గమనించాలి.

**డిశంబరు: చిత్ర3,4:** రోగబాధలు ఉపశమనం. స్థిరలావాదేవీలలో లోపాలు సడలును. స్పెక్యులేషన్ యోగింపు. శుభకర చర్చలచే లబ్ధి. స్వయం రంగాల వారికి నూతన ఆలోచనలు ఫలించును. 2వ పక్షంలో వాగ్దోరణిచే సమస్యలున్నవి. పితృఅంశాలపై దృష్టి పెడతారు. ఆధ్యాత్మిక విషయాలలో పాల్గొంటారు. 2,3,11,19,20,29,30 అనుకూలతేదీలు కాదు. **స్వాతి:** బంధుప్రీతిచే కార్యలాభం. పరువు, ప్రతిష్ఠలను పెంచుకుంటారు. ఋణదాతల వత్తిడి ఉన్ననూ 2వవారంలో ఆశాజనక స్థితులు. హామీ సంతకాలు వద్దు. స్థానచలన అవకాశములు లేవు. దాంపత్య అన్యోన్యత ఉండును. 3,4,12, 20,21,30,31 తేదీలు వ్యతిరేకములు. **విశాఖ1,2,3:** వ్యూహాత్మక నిర్ణయాలతో సమస్యలు చేధిస్తారు. సంతానంచే శుభవార్తలు. భూలావాదేవీలు ఫలించును. మానసికచింతలు తగ్గును. వాస్తవ విషయాలను గోప్యంగా ఉంచాలి. సంతానంచే కీర్తి పెరుగును. ఉద్యోగస్తులపై నిఘా తగ్గును. 4,5,13,21,22,31 తేదీలు ప్రతికూలములని గ్రహించాలి. డిశంబరు 12 ఉదయం 8.50 నుంచి 14 ఉదయం 8.16 వరకు ప్రతికూలం.

**జనవరి 2017: చిత్ర3,4:** ముఖ్యకార్యాలను వాయిదా వేస్తారు. ధనం మంచినీళ్ల ప్రాయంగా ఖర్చగును. మాసాంతంలో సోమరితనం. కీలక విషయాలలో ఇతరుల జోక్యం వద్దు. పితృవర్గం వారితో సంయమనంతో వ్యవహరించాలి. కుటుంబంలో విజయోత్సాహం ఉంటుంది. ఉద్యోగ నిర్వహణలో ఆటంకాలుండును. 7,8,16,25,26 ప్రతికూల సమయములు. **స్వాతి:** సహచరులతో విభేదాలు తగ్గును. 3వవారంలో మనస్థైర్యం సన్నగిల్లును. కొంత జాప్యంతో కార్యసిద్ధి. వాహనసమస్య పెరుగును. నిరుద్యోగులకు అనుకూలము. స్థిరాస్తి విషయంలో న్యాయపోరాటాలు చేయాలని తలుస్తారు. 8,9,17,26,27 అనుకూల సమయములు కాదు. **విశాఖ1,2,3:** అవివాహితులు నిర్ణయాలు తీసుకోలేరు. సెటిల్‌మెంట్ వ్యవహారంలో లోపాలు పెరుగును. ఒంటరిజీవితంచే సమస్యలు వస్తుంటాయి. స్పెక్యులేషన్ లాభించిననూ, తిరిగి నష్టపోవు సూచన. తోబుట్టువులతో సహకరించండి. నిర్భీతితో వ్యవహరిస్తారు. 1,9,10,18,28 వ్యతిరేక తేదీలు. జనవరి 8 సాయంత్రం 5.54 నుంచి 10 సా6.44 వరకు ప్రతికూలం.

**ఫిబ్రవరి 2017: చిత్ర3,4:** సొంతవారిని విభేదించవద్దు. నీచవ్యక్తుల సహవాసానికి దూరంగా ఉంటారు. క్షణికావేశంతో ధననష్టం. మంగళ కార్యాలకు అవాంతరములుండవు. సంతానంచే స్వల్పంగా అశాంతి. స్పెక్యులేషన్ సాధారణం. నిద్రలేమి ఉండును. 3,4,12,13,22 అనుకూల తేదీలు కాదు. **స్వాతి:** చలాకీతనం, కళాకాంతులు తగ్గును. జాయింట్ నిర్వహణలో లోపాలు కనపడును. సంతాన నిర్ణయాలను ఖాతరు చేయరు. రక్తసంబంధీకులచే సమస్యలు తగ్గును. వాతరోగబాధలు ఉపశమనం. న్యాయలావాదేవీలలో అనుకూలతలుండును. 4,5,13,14,23 తేదీలు ప్రతికూలములు. **విశాఖ1,2,3:** సోదర సమన్వయం అవసరమని గ్రహిస్తారు. ఆత్మపరిశోధనకు ప్రాధాన్యత ఇస్తారు. కళత్ర సలహాలను స్వీకరిస్తారు. హడావుడి నిర్ణయాలచే నష్టం. శతృవర్గవైషమ్యాల ప్రభావం తగ్గును. 5,6,14,15,24,25 వ్యతిరేక సమయములుగా భావించాలి. ఫిబ్రవరి 4 అర్ధరాత్రి 12.16 నుంచి 6 అర్ధరాత్రి 2.39 వరకు వ్యతిరేకము.

**మార్చి 2017: చిత్ర3,4:** మానసిక వత్తిడి తగ్గును. స్వీయకల్పనాశక్తి పెరుగును. శుభకార్యాచరణకు రంగం సిద్ధం. సాహస ప్రయత్నాలు చేస్తారు. వాహన మరమ్మత్తులుండును. భూ, గృహలావాదేవీలలో అనుకూలతలు. 3,11,12,21,22,30 తేదీలు వ్యతిరేకములు. **స్వాతి:** వృధా ప్రయాణాలు ఉండవు. స్థానచలన అవకాశములు లేవు. నిర్మాణాత్మక శక్తులు పెంచుకుంటారు. మాసాంతంలో సోదరఅంశాలు మెరుగగును. శరీరతేజస్సు పెరుగును. మాతృవర్గీయులచే లబ్ధి. 4,12,13,22,23,31 ప్రతికూల రోజులు. **విశాఖ1,2,3:** స్పెక్యులేషన్ రాణింపు కలదు. ఆడంబరాలకు ధనవ్యయం. వివాదాంశాలు మటుమాయం. సహచర ఉద్యోగులతో సమన్వయం పాటించాలి. కార్యసిద్ధిలో జాప్యం కల్గును. స్వవృత్తుల వారికి గౌరవ భంగములున్నవి. అవివాహితులకు వివాహయోగం. సమయస్ఫూర్తికి ప్రాధాన్యత ఇవ్వలేరు. మాసాంతంలో మనోవ్యాకులత. 5,13,14, 23,24 అనుకూలరోజులు కాదు. మార్చి 4 ఉదయం 5.40 నుంచి 6 ఉదయం 8.21 వరకు అనుకూల సమయం కాదు.



# వృశ్చికరాశి

విశాఖ 4పా (తో), అనూరాధ 1,2,3,4పా (నా,నీ,నూ,నే) జ్యేష్ఠ 1,2,3పా (నో,యా,యీ,యు)

| | |
|---|---|
| ఆదాయము: | 02 |
| వ్యయము : | 08 |
| పూజ్యత : | 01 |
| అవమానం : | 02 |

### వృశ్చికరాశి వారు పఠించాల్సిన శ్రీ లలితా అష్టాక్షరీ నామాలు

| | |
|---|---|
| ఓం మూలవిగ్రహరూపిణ్యై నమః | (840) |
| ఓం భవచక్రప్రవర్తిన్యై నమః | (843) |
| ఓం సర్వోపనిషదుద్ఘుష్టాయై నమః | (852) |
| ఓం శాంత్యతీతకలాత్మికాయై నమః | (853) |
| ఓం కార్యకారణనిర్ముక్తాయై నమః | (862) |
| ఓం కామకేలితరంగితాయై నమః | (863) |
| ఓం కనత్కనకతాటంకాయై నమః | (864) |
| ఓం లీలావిగ్రహధారిణ్యై నమః | (865) |
| ఓం అంతర్ముఖసమారాధ్యాయై నమః | (870) |
| ఓం బహిర్ముఖసుదుర్లభాయై నమః | (871) |
| ఓం యజమానస్వరూపిణ్యై నమః | (883) |
| ఓం ధనధాన్యవివర్ధిన్యై నమః | (886) |
| ఓం విశ్వభ్రమణకారిణ్యై నమః | (889) |
| ఓం తత్త్వమర్థస్వరూపిణ్యై నమః | (908) |
| ఓం సదాశివకుటుంబిన్యై నమః | (911) |
| ఓం సవ్యాపసవ్యమార్గస్థాయై నమః | (912) |
| ఓం సర్వాపద్వినివారిణ్యై నమః | (913) |
| ఓం చైతన్యార్ఘ్యసమారాధ్యాయై నమః | (918) |
| ఓం చైతన్యకుసుమప్రియాయై నమః | (919) |
| ఓం తరుణాదిత్యపాటలాయై నమః | (922) |

**గమనిక:** 16వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

ఆగస్టు 11 వరకు గురువు దశమస్థాన సంచారంచే ఆందోళన, చికాకులు సడలును. శుభకార్యాలకు సిద్ధమగుదురు. మనోవాంఛలు ఆలస్యంగా సిద్ధించును. సంకల్పబలం నెరవేరును. అనవసర సమస్యలు తగ్గును. ఆప్తమిత్రుల అండదండలు లభించును. ఆగస్టు 12 నుంచి సంవత్సరాంతం వరకు గురువు ఏకాదశస్థాన గురుసంచారంచే పరిశోధనా శక్తి, బుద్ధిబలం పెరుగును. స్థిరాదాయం తగ్గును. హామీలకై సమయం వృధా అగును. వ్యూహాత్మక నిర్ణయాలు త్వరగా చేయలేరు.

2017 జనవరి 26 వరకు ఏలినాటి శని రెండవభాగంగా జన్మరాశిలో శనిగ్రహ సంచారంచే స్వీయకల్పనాశక్తి మందగతి. ఆశాజనక స్థితులు తక్కువగా ఉండును. అలౌకిక విషయాలపై ఆసక్తి పెరుగును. శారీరక అలసట అధికం. మానసిక దౌర్బల్యం పెరుగును. జనవరి 27 నుంచి సంవత్సరాంతం వరకు శని ద్వితీయస్థాన అతిచార సంచారంచే చేదు అనుభవాలు తరచుగా చవి చూస్తారు. రానిబాకీలను వదిలివేస్తారు. వర్గ వైషమ్యాల పోరు పెరుగును. కుటుంబ కలతలు స్వల్పంగా ప్రారంభమగును.

గ్రహసంచార స్థితిగతులను విశ్లేషించగా వివాద వ్యాఖ్యలపై మౌనం వహిస్తారు. అవివాహితులకు అనవసర ప్రయాణాలు. నూతన ప్రణాళికలను సమయానికి సిద్ధం చేయలేరు. అంతర్గత కలహాలు, ఋణభారం పెరుగును. స్నేహితులు బాధ్యతలను స్వీకరించలేరు. భాగస్వామ్య నిర్ణయాలలో సమస్యలు తలెత్తును. పారిశ్రామికులు విసుగుతో కాలం గడపాలి. స్థానచలన అవకాశములు మెండు. కల్మష అంశాలపైనే తరచూ దృష్టి ఉంచుదురు. మానసిక శారీరక వత్తిడితో పాటు ఖర్చు పెరిగి ఆదాయం తగ్గును. స్పెక్యులేషన్ గొప్పగా రాణించదు. అంచనాలు వాస్తవరూపం దాల్చలేవు. శత్రువర్గీయులను త్వరగా అంచనా వేయలేరు. రహస్య మంత్రాంగం జోలికి వెళ్లరు. మనోసంకటాలతో పోరాటం అధికం. స్త్రీలకు స్వల్పంగా అనుకూలం. సాఫ్ట్‌వేర్, మెకానికల్, సంగీత, సినీ, వైద్య, విద్య రంగాల వారికి ఊరటలు లభించును. రాజకీయ వాసులకి తేజస్సు తగ్గును. ఇతర అన్నీ రంగాల వారికి సానుకూల పరిస్థితులు కనపడుతున్న ప్పటికీ ఆదాయ వనరులను సకాలంలో పెంచుకోలేరు.

**ఏప్రిల్: విశాఖ4:** శుభకార్యసిద్ధి. బుద్ధిబలంతో నిర్ణయాలు తీసు కుంటారు. హామీ ప్రయత్నాలు నెరవేరును. ప్రశంసలధికం. హాస్యంచే గౌరవం పెరుగును. సంతాన శుభకార్యచర్చలు వాయిదా. గృహ మరమ్మ త్తులకై ధనవ్యయం. మాసాంతంలో ఆలోచనలు, కోరికలు తగ్గి, ప్రశాంతతతో ఉంటారు. 10,11,20,30 తేదీలు అనుకూలం కాదు. **అనూరాధ:** సంతానంపై విమర్శలుండును. అవివాహితులు నిర్ణయాలు తీసుకోలేరు. జీవనోపాధిలో చిక్కులున్ననూ మాసం మధ్యలో తగ్గుముఖం. రానిబాకీలపై పరిష్కారాలు చేస్తారు. 2వపక్షంలో కుటుంబ కలతలు సమసిపోవును. 11,12,21,30 తేదీలు ప్రతికూలములని గ్రహించాలి. **జ్యేష్ఠ:** వివాద విషయాలలో జోక్యం చేసుకుంటారు. ఉద్యోగ నిర్వహణలో సమస్యలు. 12,13,22,23 వ్యతిరేకతేదీలు. ఏప్రిల్ 11 అర్ధరాత్రి తదుపరి 3.33 నుంచి 14 ఉదయం 8.32 వరకు సమయం అనుకూలం కాదని గమనించి, ముఖ్య విషయాలలో జాగ్రత్త వహించాలి.

**మే: విశాఖ4:** సమయస్ఫూర్తిని పాటించలేరు. ఆధిపత్య సంభాషణలతో కార్యసిద్ధి కాదు. నరాల,భుజాల తీపు అధికం. దైవకార్యాచరణపై మక్కువ. పితృవర్గం నుంచి సహాయసహకారాలు. ఇతరులపై దూషణ, నిందలు తగ్గించాలి. ఉన్నతవ్యక్తుల పరిచయాలు లాభించవు. 8,17, 18,27 వ్యతిరేక రోజులు. **అనూరాధ:** ఋణభారం పెరుగును. బంధువుల నుంచి వత్తిడి అధికం. 2వవారంలో స్తంభించిన పనులలో ముందంజ. సంయ మనం, సమయస్ఫూర్తితో కార్యబాధ్యతను గట్టెక్కిస్తారు. అమూల్య విశేషాలను తెలుసుకోవటంలో ఆసక్తి. 1,9,18,19,28 అనుకూలతేదీలు కాదు. **జ్యేష్ఠ:** ఆర్భాట వ్యవహారాలను మానుకోలేరు. వాదనా పటిమ తగ్గును. స్పెక్యులేషన్ లాభసాటి. ఆరోగ్యభంగములున్నవి. వృత్తి ఉద్యోగాలలో అనుకోని మార్పులు. మాసం మధ్యలో తోబుట్టువులతో విహారయాత్రలు. 2,10,19,20,29 ప్రతికూల రోజులని భావించాలి. మే 9 మధ్యాహ్నం 1.08 నుంచి 11 సాయంత్రం 4.30 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహించాలి.

**జూన్: విశాఖ4:** ఖచ్చిత నిర్ణయాలు తీసుకుందురు. మధ్యమధ్యలో ఆర్థిక మాంద్యం. రాజీధోరణికి కట్టుబడరు. గృహనిర్మాణంలో ఆటుపోట్లు. కుటుంబ విరోధాలు వచ్చిననూ వెంటనే సమసిపోవును. 2వపక్షంలో నిద్రాసౌఖ్యంతో ఉల్లాసంగా ఉంటారు. 4,5,13,14,23,24 ప్రతికూల తేదీలు. **అనూరాధ:** భూ,గృహ మార్పులు ఉన్నవి. మరమ్మత్తులకు ధనవ్యయం. మిత్రభేదం లేదు. నూతన వ్యాపారఒప్పందాలు లాభించును. ముఖ్య విధాన నిర్ణయాలలో ఇతరుల జోక్యం వద్దు. ఆర్భాటాలకు, ఆడంబరాలచే ధనవ్యయం.5,6,14,15,24,25 తేదీలు వ్యతిరేకములు. **జ్యేష్ఠ:** రహస్య నిర్ణయాలు దాచలేరు. మనోసంకటం మాసాంతంలో అధికం. శరీరానికి వైద్యసేవలవసరం. స్పెక్యులేషన్ రాణించును. బంధువులతో మనస్పర్థలు రానీయకండి. న్యాయపోరాటాలలో అసంతృప్తి. మాసం మధ్యలో శుభ కార్య పరంపర. 6,7,15,16,25,26 అనుకూలరోజులు కాదు. జూన్ 5 రాత్రి 11.31 నుంచి 7 అర్ధరాత్రి 2.00 వరకు ప్రతికూలసమయం.

**జూలై: విశాఖ4:** ప్రత్యేక ప్రతిపత్తిని ఆశిస్తారు. ఋణవిముక్తికి మార్గం సుగమం. నూతన అగ్రిమెంట్లు ఫలించును. స్వవృత్తుల వారికి ప్రోత్సాహ కరం. సోదర సంఘీభావంతో లబ్ధి. ముంజేతి సమస్యచే ముఖ్య కార్యాలలో జాప్యం. కొనుగోళ్లలో లోపాలను గ్రహించాలి. 2,11,20,21,29 తేదీలు ప్రతికూలములు. **అనూరాధ:** మాసం మధ్యలో ఆరోగ్యభంగములు. ఆత్మవిశ్వాసంతో ముందుకు వెళతారు. అంతర్గత వ్యవహారాలు మందకొడి. నిర్మాణాత్మక శక్తి పెంచుకుంటారు. అధికారుల పంజా ఉన్నదని గమనించాలి. కపటస్వభావంచే ఇతరులను పలకరించవద్దు. 3,12,21,22,30 అనుకూలం కాదు. **జ్యేష్ఠ:** స్వార్థబుద్ధి తగ్గును. వివాదాంశాలచే మనఃక్లేశము. సంతాన అంశాలలో నూతన కార్యాచరణ రూపొందిస్తారు. ప్రణాళికలలో మార్పుచేర్పులుండును. పరోపకారం, సత్సాంగత్యం పెరుగును. భూ,గృహ లావాదేవీలలో మాసాంతానికి శుభవార్తలు. 3,4,13,22,23, 31 వ్యతిరేకరోజులు. జూలై 3 ఉదయం 9.01 నుంచి 5 మధ్యాహ్నం 11.44 వరకు తిరిగి 30 సాయంత్రం 4.35 నుంచి ఆగస్టు 1 రాత్రి 8.19 వరకు వ్యతిరేక సమయం.

**ఆగస్టు: విశాఖ4:** కళత్రంచే ఖర్చులధికము. పుణ్యకార్యాచరణకై మక్కువ పెరుగును. శత్రువర్గ వైషమ్యాల సమాచారం సేకరిస్తారు. సునాయాస ప్రయత్నాలు కూడా కఠినమగును. జ్ఞాపకశక్తిచే కొంత లబ్ధి. దూరప్రయాణాలలో నూతన పరిచయాలు. తండ్రి ఆజ్ఞలను ధిక్కరిస్తారు. 7,8,17,25,26 తేదీలు అనుకూలం కాదు. **అనూరాధ:** అనవసర స్పెక్యులేషన్‌చే ధనవ్యయం. శుభచర్చలు వాయిదా పడును. మాసం మధ్య నుంచి ఆశాజనక పరిస్థితులుండను. మాతృ అంశాలపై శ్రద్ధ చూపిస్తారు. భాగస్వామ్య వ్యాపారాలలో చిక్కులు. ధైర్యంతో ముందడుగు వేయాలి. 8,9,18,26,27 ప్రతికూలరోజులు. **జ్యేష్ఠ:** శక్తియుక్తులతో ఇతరులను మెప్పించలేరు. సంతానం తప్పుదారి వెళ్లకుండా జాగ్రత్త తీసుకుంటారు. వాహన మరమ్మత్తులకై ధనవ్యయం. వ్యూహాత్మక, నిర్మాణాత్మక శక్తులను పెంచుతారు. కళత్రంచే ధనవ్యయం. శారీరక రుగ్మతలు తగ్గును. 9,10, 19,27,28 తేదీలు అనుకూలం కాదని గ్రహించాలి.ఆగస్టు 26 రాత్రి 10.23 నుంచి 28 అర్ధరాత్రి 3.06 వరకు ఆవేశాలకు లోను కాకుండా నిర్ణయాలు దాటవేసే ధోరణిలో ఉండాలి.

**సెప్టెంబరు: విశాఖ4:** అధికారులచే సమస్యలున్నవి. ఆత్మవిశ్వాసం తగ్గును. ఉద్యోగులపై నిఘా పెరుగును. స్వీయకల్పనా శక్తి పెంచుకోవాలి. గౌరవమర్యాదలకు భంగం కల్గకుండా జాగ్రత్తలు తీసుకోవాలి. అవివాహితులకు శుభవార్తలున్నవి. ఋణభారం తగ్గును. అన్యోన్యత సుఖ సంతోషాలతో మాసాంతంలో ఆనందం. 3,4,13,14,21,22 అనుకూల రోజులు కాదు. **అనూరాధ:** రాబడి విషయాలలో నిర్ణయాలు మారును. సంతానంపై వ్యాకులత్వ మేర్పడును. విమర్శలకు దూరంగా ఉండాలి. దూరప్రాంత ప్రయాణాలలో విజయం చేకూరును. నాస్తికత్వానికి దగ్గరవుతారు. వ్యాపారాదులలో అధికారుల బెడద తగ్గును. మాసం మధ్యలో శారీరక మానసిక వత్తిడులు తగ్గును. 4,5,14,15,22,23 ప్రతికూలతేదీలు. **జ్యేష్ఠ:** కుటుంబ నిర్ణయాలను శిరసావహిస్తారు. సునాయాస ప్రయత్నాలు కఠినము. రాజకీయులకు అనుకూలము. భాగస్వామ్య ఒప్పందాలలో ఆచితూచి వ్యవహరించాలి. స్వవృత్తుల వారికి సహాయసహకారాలు. 5,6,15,16, 23,24 తేదీలు వ్యతిరేకములు. సెప్టెంబరు 23 అర్ధరాత్రి 3.02 నుంచి 25 ఉదయం 8.38 వరకు ముఖ్య అంశాలలో తొందరపాటు వద్దు.

**అక్టోబరు: విశాఖ4:** స్వయంవృత్తుల వారికి అనుకూలము. మనోవాంఛలు నెమ్మదిగా సిద్ధించును. హడావుడి నిర్ణయాలచే నష్టం. జీర్ణాశయ సమస్య రాగల సూచన. చలాకీతనం, వందనీయతతో ప్రయాణాలలో విజయం. స్వర్ణాభరణ కొనుగోళ్లు ఉండును. 1,10,11,19,28 ప్రతికూలతేదీలు. **అనూరాధ:** భాగస్వామ్య నిర్ణయాలు నెరవేరును. రహస్యచర్చలు ఫలించవు. మేనమామ సహాయంతో కార్యసిద్ధి. స్త్రీలకు విశ్రాంతి తక్కువైననూ యోగవంతం. స్థానచలనములున్నవి. అంకిత భావానికి పెద్దపీట వేస్తారు. 2,12,20,29 తేదీలు అనుకూలం కాదు. **జ్యేష్ఠ:** సంపాదనలో ముందంజ ఉన్ననూ కార్యసిద్ధి, ఆధిపత్యపోరుకి ఖర్చధికము. ముఖ్యవ్యక్తులచే హామీలుండును. కాంట్రాక్టులు, స్పెక్యులేషన్‌లో తప్పుదారి. కళత్రంచే కీలక నిర్ణయాలు. 3వవారంలో కోపం, నైరాశ్యం తగ్గించాలి. 3,12,13,21,30,31 ప్రతికూలరోజులు. అక్టోబరు 20 మ11.11 నుంచి 22 మ 2.35 వరకు నిదానమే ప్రధానంగా భావించాలి.

**నవంబరు: విశాఖ4:** నిర్మాణాత్మక శక్తులను పెంచుకుంటారు. ఋణదాతల వత్తిడి ఉండదు. సంతానానికి విజయప్రాప్తి. లౌకిక విషయాలపై ఆసక్తి చూపండి. కుటుంబ వ్యవహారాలలో ఇతరుల జోక్యం వద్దు. నిర్భీతిగా వ్యవహరించలేరు. 7,15,16,24,25 తేదీలు వ్యతిరేకములు. **అనూరాధ:** స్పెక్యులేషన్‌లో నష్టముండదు. కుటుంబ అన్యోన్యత పెరుగును. శుభచర్చలలో పాల్గొనటంచే పితృవర్గం వారు సంతోషపడుదురు. అవివాహితులకు వివాహయోగం. స్వవృత్తుల వారికి కొంత ఆశాభంగం. మాసాంతంలో ఆగ్రహంతో సంభాషించవద్దు. 8,16,25,26 అనుకూల తేదీలు కాదు. **జ్యేష్ఠ:** శుభకరచర్చలు వ్యక్తిగతంగా చేయలేరు. మాసాంతంలో మనఃక్లేశములు. ఆధ్యాత్మిక అంశాలలో ఆసక్తి. వాతపిత్తాదులు తగ్గుముఖం. వృత్తివ్యాపారాలలో ముందంజలో ఉంటారు. ఆదాయానికి మించిన ఖర్చులు. 9,17,26,27 ప్రతికూలరోజులు. నవంబరు 16 రాత్రి 8.59 నుంచి 18 రాత్రి 10.36 వరకు అనుకూల సమయం కాదు.

**డిశంబరు: విశాఖ4:** చంచలత్వాన్ని విడనాడుదురు. పాలనానిర్ణయాలు ఆలస్యంగా సాగును. స్వయంవృత్తుల వారికి పురోగమనం. హామీలు ఇవ్వకండి. సంతాన అంశాలలో వివాదాలుండును. స్త్రీలకు మాసాంతంలో యోగవంతం. పొట్టకు సంబంధించి జాగ్రత్తకు తీసుకోవాలి. న్యాయ స్థానంచే సమస్యలుండవు. 4,5,13,21,22,31 తేదీలు అనుకూలములు కాదు. **అనూరాధ:** శుభకార్యాచరణకు విజయం చేకూరును. ధైర్యంతో అడుగులు వేయగలరు. అధికారులతో సంయమనంతో వ్యవహరించాలి. గుప్త సమాచారాన్ని బహిర్గతం చేయవద్దు. విహారయాత్రలలో అనారోగ్య సూచన. 5,6,14,22,23 ప్రతికూల తేదీలు. **జ్యేష్ఠ:** శస్త్ర చికిత్సరాగల సూచన కలదు. సజ్జన సహచర్యం లబ్ధిని అందించును. స్నేహసంబంధాలు మెరుగుపడును. అంచనాలు అధికంగా వేయవద్దు. వృత్తి వ్యాపారాలలో లోపాలని గమనించి సరిచేస్తారు. కుటుంబంతో సుఖసంతోషాలతో గడుపుదురు. 6,7,14,15,24 వ్యతిరేక తేదీలని గ్రహించాలి. డిశంబరు 14 ఉ8.16 నుంచి 16 ఉదయం 8.54 వరకు ప్రతికూల సమయం.

**జనవరి 2017: విశాఖ4:** ఇష్టార్థసిద్ధి కల్గును. తోబుట్టువులతో మాట పట్టింపులు ఉండవు. అధర్మకార్యాలను ఆపుదురు. దూరప్రాంత ప్రయాణాలు లాభించును. కీలక విషయాలకై న్యాయసలహాలను స్వీకరిస్తారు. ధనక్షయాన్ని తగ్గిస్తారు. 1,9,18,27,28 తేదీలు వ్యతిరేకములు. **అనూరాధ:** రహస్య నిర్ణయాలను బహిర్గతం చేయరు. ఋణదాతల వత్తిడిని తట్టుకుంటారు. ఉన్నతవ్యక్తులచే మాసం మధ్యలో లబ్ధి. గృహ నిర్మాణ పనులు చురుకుగా సాగును. బంధువులతో సామరస్యంగా సంభాషించలేరు. సంతానంపై అధిక శ్రద్ధ. మాసాంతంలో నిద్రాభంగం, అకాలభోజనాదులు. 1,2,10,19,29 ప్రతికూలతేదీలు. **జ్యేష్ఠ:** ఊహించని సౌకర్యాలు ఏర్పడును. బంధువులతో సామరస్యంగా మెలుగుదురు. స్వవృత్తుల వారికి ఆశాజనక మాసం. వస్తుకొనుగోళ్లతో ధనవ్యయం. స్త్రీలకు యోగవంతం. ఉద్యోగస్తులకు కార్యభారం అధికం. అధికారుల నిఘా ఉందని గమనించాలి. 2,3,11,20,30 ప్రతికూలరోజులు. జనవరి 10 సాయంత్రం 6.44 నుంచి 12 రాత్రి 7.49 వరకు వ్యతిరేక రోజులు.

**ఫిబ్రవరి 2017: విశాఖ4:** వాగ్దానభంగములుండవు. అవివాహితులకు ఊహించని వార్తలు. ప్రతిభకు గుర్తింపు లభించును. సాహసప్రయత్నాలు చేయవద్దు. గౌరవమర్యాదలను కాపాడుకొంటారు. సంతాన అంశాలలో వివాదాలు సమసిపోవును. ఆర్థికమాంద్యముండును. మాటల ధోరణి తగ్గిస్తారు. 5,6,14,15,24 ప్రతికూలతేదీలు. **అనూరాధ:** భూ, గృహమార్పులధికము. గృహవాతావరణం ఆశాజనకం. ఆర్థిక అంచనాలు తారుమారు కావు. ప్రశంసలకు, ఆర్భాటాలకు ప్రాధాన్యతనిస్తారు. భాగస్వామ్య చర్చలు నెరవేరును. రాజకీయవాసులకు అనుకూలం.స్పెక్యులేషన్ లాభసాటి. పరనిందారోపణలు వద్దు. 6,7,15,16,25,26 అనుకూల తేదీలు కాదు. **జ్యేష్ఠ:** ఆత్మవిశ్వాసం పెరుగును. వ్యూహాత్మక నిర్ణయాలు చేయగలరు. స్థానచలన సూచన కలదు. అనవసర ఖర్చు తగ్గిస్తారు. ప్రతిబంధక సమస్యలున్ననూ ధైర్యంతో ముందడుగు. ధర్మావేశం అనుకూలం కాదు. 7,8,16,17,26 తేదీలు వ్యతిరేకములు కాదు. ఫిబ్రవరి 6 అర్ధరాత్రి 2.39 నుంచి 9 ఉదయం 5.09 వరకు అనుకూలం కాదు.

**మార్చి 2017: విశాఖ4:** భేషజాలకు వెళ్లరు. శత్రువర్గ వైషమ్యాల సమాచారాన్ని సేకరిస్తారు. అవినీతి కార్యాలను వ్యతిరేకిస్తారు. సోదర సహకారం పెరుగును. స్పెక్యులేషన్‌లో నష్టసూచన. సోమరితనం పెరుగును. స్థిరాదాయంలో మార్పు ఉండదు. అసత్యవాక్కులచే సమస్యలుండను. 5,13,14,23,24 అనుకూలరోజులు కాదు. **అనూరాధ:** తోబుట్టువుల విమర్శలకు ధీటుగా సమాధానం చెప్తారు. ముఖ్యప్రయాణాలు రద్దగును. శతృవులపై కాలుదువ్వవద్దు. ప్రతిపనిలో నాన్చుడు అధికము. స్త్రీ మూలకంగా లాభించుదురు. 6,14,15,24,25 ప్రతికూలతేదీలు. **జ్యేష్ఠ:** చలాకీతనం, ఉత్సాహంతో సంతాన విజయప్రాప్తి. చర్మసంబంధ రుగ్మత రాగల సూచన కలదు. నూతన వాహనకొనుగోలుకు శ్రీకారం. అవివాహితులకు వివాహయోగం. అభివృద్ధి అంశాలపై దృష్టి పెడతారు. 6,7,16, 25,26 తేదీలు అనుకూలం కాదని భావించాలి. మార్చి 6 ఉదయం 8.21 నుంచి 8 మధ్యాహ్నం 11.58 వరకు ప్రతికూల సమయము.



# ధనూరాశి

మూల 1,2,3,4పా (యే,యో,భా,బి), పూర్వాషాఢ 1,2,3,4పా (భూ,ధ,భా,ఢ) ఉత్తరాషాఢ 1పా(భే)

| | |
|---|---|
| ఆదాయము: | 05 |
| వ్యయము : | 14 |
| పూజ్యత : | 04 |
| అవమానం : | 05 |

**ధనస్సురాశి వారు పఠించాల్సిన శ్రీ లలితా అష్టాక్షరీ నామాలు**

ఓం సనకాదిసమారాధ్యాయై నమః (726)
ఓం శివజ్ఞానప్రదాయిన్యై నమః (727)
ఓం నామపారాయణప్రీతాయై నమః (732)
ఓం మిథ్యాజగదధిష్ఠానాయై నమః (735)
ఓం భవదావసుధావృష్ట్యై నమః (742)
ఓం పాపారణ్యదవానలాయై నమః (743)
ఓం దౌర్భాగ్యతూలవాతూలాయై నమః (744)
ఓం జరాధ్వాంతరవిప్రభాయై నమః (745)
ఓం రోగపర్వతదంభోళ్యై నమః (748)
ఓం మృత్యుదారుకుఠారికాయై నమః (749)
ఓం జపాపుష్పనిభాకృత్యై నమః (766)
ఓం పాటలీకుసుమప్రియాయై నమః (773)
ఓం మందారకుసుమప్రియాయై నమః (776)
ఓం మార్తాండభైరవారాధ్యాయై నమః (785)
ఓం మంత్రిణీన్యస్తరాజ్యధురే నమః (786)
ఓం సత్యజ్ఞానానందరూపాయై నమః (791)
ఓం సామరస్యపరాయణాయై నమః (792)
ఓం పరమంత్రవిభేదిన్యై నమః (812)
ఓం మునిమానసహంసికాయై నమః (816)
ఓం పంచాశత్పీఠరూపిణ్యై నమః (833)

**గమనిక:** 16వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

ఆగస్టు 11 వరకు నవమస్థానంలో గురువు సంచారంచే పితృవర్గ నిర్ణయాలను శిరసావహిస్తారు. జీర్ణాశయలోపం తగ్గును. వివాదాంశాలు సమసిపోవును. రావలసిన బాకీలు వసూలగును. శుభకార్య చర్చలు సిద్ధించును. ఆందోళన, విసుగు, మనోసంకటాలు తగ్గుముఖం. ఆశ్రిత పక్షపాతం పెరుగును. ఆగస్టు 12 నుంచి సంవత్సరాంతం వరకు గురువు దశమస్థాన సంచారంచే రక్త సంబంధీకులతో తరచూ చర్చలు చేస్తుంటారు. ఆర్థిక మాంద్యం ఉండు సూచన కలదు. స్థిర లావాదేవీలలో లోపాలు తలెత్తును. దినచర్యలో తరచూ మార్పులు కల్గును. కీలక నిర్ణయాలలో ముఖ్యపాత్ర పోషించలేరు.

2017 జనవరి 26 వరకు ఏలినాటి శని ప్రథమభాగంలో ఉంటారు. పోటీలను ఎదుర్కొంటారు. వ్యక్తిగత కక్షలను తగ్గిస్తారు. వివాదవిషయాల వైపు వెళ్లరు. సమయస్ఫూర్తి, సామరస్యం, సంయమనం ప్రధాన అస్త్రాలుగా చేపట్టి జీవనం సాగిస్తారు శరీరానికి వైద్యసేవలవసరం. జనవరి 27 నుంచి సంవత్సరాంతం వరకు అతిచారంచే శని జన్మరాశి సంచారంచే సహచరులతో స్వల్ప విభేదాలు రాగల సూచన. అన్యసహాయం కోసం కాలయాపన జరుగును. అవివాహితులకు అదృష్టయోగం.

గ్రహసంచార స్థితులను విశ్లేషించగా పరోక్షంగా సామరస్య ధోరణిని అవలంబిస్తారు. శుభకార్య పరంపరను కొనసాగిస్తారు. కీలక నిర్ణయాలలో ప్రధానపాత్ర పోషిస్తారు. ఆరోగ్య భంగములున్ననూ విజయపంథాలో సాగుదురు. ఆడంబరాలకు దూరంగా ఉంటారు. స్త్రీలకు శుభకరము. ఋణ దాతల వత్తిడి తగ్గును. ఏకాభిప్రాయ సాధనతో స్థిరనిర్ణయాలు విజయాన్ని అందించును. ఆదాయానికి మించిన ఖర్చులున్ననూ ధైర్యంగా ఉంటారు. రహస్య చర్చలు ఫలించును. బంధుప్రీతి మెండు. విమర్శలు, నిందలు, దూషణలు అధికంగా ఉన్ననూ పట్టించుకోరు. స్పెక్యులేషన్‌చే ధనవ్యయం. వివాదాంశాలలో తలదూర్చరు. రాజకీయ కళారంగాల వారికి అనుకూలము. విద్య, వైద్య, మెకానికల్ వాసులకు సోమరితనం పెరుగును. సాఫ్ట్‌వేర్ రంగానికి పూర్తి అనుకూలతలు. మిగిలిన అన్నిరంగాల వారికి పరిస్థితులన్నీ తటస్థంగా ఉన్ననూ లబ్ధి కల్గును.

**ఏప్రిల్: మూల:** విసుగు, ఆందోళన, శరీరఅలసట అధికం. వాగ్దాన భంగములుండవు. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులధికము. రావలసిన సొమ్ము రాగలదు. మాసాంతంలో కుటుంబ కలతలు సమసిపోవును. ఇతరులకు మార్గదర్శకంగా తారసపడుదురు. 13,14,23,24 తేదీలు ప్రతికూలములు. **పూర్వాషాఢ:** ఉద్యోగ సంతాన కుటుంబస్థితులలో మెరుగుదల. హామీ ప్రయత్నాలు నెరవేరవు. వ్యక్తిగత కక్షలు తగ్గును. 4వవారం స్పెక్యులేషన్‌లో స్వల్ప రాణింపు. 14,15,24,25 అనుకూల తేదీలు కాదు. **ఉత్తరాషాఢ 1:** ఉద్యోగులకు అధికారుల నుంచి సమస్యలు కలవు. 2,4 వారాలలో ఆర్థికంగా పుంజుకుంటారు. దూరప్రయాణాలు లాభిస్తాయి. ప్రశాంతత లభించును. స్నేహసంబంధాలు లాభిస్తాయి. స్వవృత్తుల వారికి అభివృద్ధి. 3వవారంలో వాగ్ధోరణి అదుపులో ఉంచాలి. 15,16, 25,26 తేదీలు అనుకూలములు కాదు. ఏప్రిల్ 14 ఉదయం 8.32 నుంచి 16 సాయంత్రం 5.17 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**మే: మూల:** ప్రతిభకు రాణింపు కలదు. శ్వాసనాళ, భుజ ముంజేతి సమస్యలు పెరుగును. స్వయంవృత్తులవారికి పెట్టుబడి లభించును. శత్రు నిర్ణయాలచే భయముండదు. అవివాహితులకు శుభవార్తలు. అసత్యాలచే అపజయం. 11,20,21,30 ప్రతికూలతేదీలు. **పూర్వాషాఢ:** వ్యక్తిగత ప్రతిష్ఠలు తగ్గును. ఊహించని ఖర్చులు పెరుగును. ఋణదాతల వత్తిడి అధికం. శుభకార్య చర్చలు ఫలించును. సహ ఉద్యోగులతో స్వల్ప విభేదం. సొంతవారితో అవసరా లధికం. కార్యదీక్షాబాధ్యతను పెంచుకుంటారు. 12,21,22,31 అనుకూల తేదీలు కాదు. **ఉత్తరాషాఢ 1:** బంధుప్రీతి పెరుగును. అసత్యఆరోపణలతో విమర్శలు చేస్తుంటారు. మగత నిద్రచే నష్టం. ఆహారనియమాలు పాటిస్తారు. స్పెక్యులేషన్‌లో యోగం లేదు. సంతానానికి విజయప్రాప్తి. 4,5,13,23 అనుకూలం కాదు. మే 11 సాయంత్రం 4.30 నుంచి 13 రాత్రి 11.56 వరకు అనుకూలం కాదు.

**జూన్: మూల:** అవినీతి కార్యాలను వ్యతిరేకిస్తారు. రహస్య మంతనాలు ఉండును. వాహనచోదకంలో జాగ్రత్త అవసరము. అధర్మ కార్యాలవైపు ఆసక్తిచే దీర్ఘనష్టం. 2వవారంలో మనశ్శాంతి. చివరివారంలో కుటుంబ పరంగా పూర్ణవిజయాలు. 7,8,17,26,27 ప్రతికూల తేదీలు. **పూర్వాషాఢ:** రెండవపక్షంలో పూర్తిగా అనుకూలం. ఆర్థికపరంగా నూతన నిర్ణయాలు చేస్తారు. సంతానవిషయాలలో ధనవ్యయం. అవివాహితులకు వివాహయోగం. అలంకార సామాగ్రిపై మక్కువ. నిద్రలేమిని తగ్గించండి. ఆత్మపరిశోధనకు ప్రాధాన్యత ఇస్తారు. 8,9,18,27,28 వ్యతిరేక తేదీలు. **ఉత్తరాషాఢ 1:** పెద్దల నిర్ణయాలను గౌరవించలేరు. ధైర్యసాహసాలతో శస్త్ర చికిత్సకు మొగ్గుచూపుతారు. గోప్యతలను వ్యతిరేకిస్తారు. 2వపక్షంలో ఏకాగ్రత, ప్రయత్నంతో కార్యసిద్ధి. 1,9,10,19 ప్రతికూలములు. జూన్ 7 అర్ధరాత్రి 2.00 నుంచి 10 ఉ8.06 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**జూలై: మూల:** స్పెక్యులేషన్ అనుకూలించును. కంఠం నుంచి ఉదరం వరకు సమస్యలు. విధివిధానాలలో మార్పులున్నవి. నమ్మకద్రోహం చేసేవారితో జాగ్రత్త. గృహనిర్మాణంలో ఆటుపోట్లు. ఉద్యోగస్తులకు ఊరట లభించును. గర్వభంగములుండును. 4,5,14,15,23,24 అనుకూలములు కాదు. **పూర్వాషాఢ:** బుద్ధిబలంతో విమర్శలు తట్టుకుంటారు. ముఖ్యసమస్యని పరిష్కరిస్తారు. మనోబలం పెరుగును. స్పెక్యులేషన్‌లో ముందంజ. తోబుట్టువులతో మనస్పర్థలు తొలగును. కీలకచర్చలలో నిర్భీతిగా వ్యవహరిస్తారు. 5,6,15,16,24,25 అనుకూలం కాదు. **ఉత్తరాషాఢ 1:** ఆర్థిక వెసలుబాటు కల్గును. 2వపక్షమంతా ఆశాజనక స్థితిగతులు. ఏకాభిప్రాయ సాధనలో గెలుపు సాధిస్తారు. అనారోగ్యవ్యాప్తి కలదు. మాసాంతంలో విజయవార్తా శ్రవణం. భూ, లావాదేవీలు ఫలించును. 6,7,16,17,25,26 తేదీలు ప్రతికూలములు. జూలై 5 మధ్యాహ్నం 11.44 నుంచి 7 సాయంత్రం 5.12 వరకు ప్రతికూల సమయం.

**ఆగస్టు: మూల:** ఆర్థిక సామాజిక విలువలపై శ్రద్ధ పెరుగును. స్థానచలన అవకాశములు కలవు. పంతాలకు, పట్టింపులకు వెళ్తారు. ప్రణాళికాబద్ధంగా రూపకల్పన చేస్తారు. వ్యాపారస్థులకు అధికారుల బెడద. శతృపీడ తగ్గును. స్పెక్యులేషన్ సాధారణం. 1,10,11,20,28,29 అనుకూలతేదీలు కాదు. **పూర్వాషాఢ:** శుభకార్యఅంశాలపై దృష్టి పెడతారు. రోగబాధలకు ఉపశమనం. కుటుంబ నిర్ణయాలు లాభించును. ఆర్థిక లబ్ధి ఉంది. ప్రధాన సమస్యకు పరిష్కారం లభ్యం. మానసిక దౌర్బల్యం తగ్గును. 2,11,12,21,29,30 ప్రతికూలతేదీలు. **ఉత్తరాషాఢ1:** 2వ వారం స్పెక్యులేషన్‌కు అనుకూలం కాదు. భాగస్వామ్య చర్చలు నెరవేరును. నాల్గవవారంలో బంధువుల ద్వారా లబ్ధిని పొందుతారు. వాహన చోదకంలో జాగ్రత్త వహించాలి. భుజముల తీపు తగ్గును. 3,13,21,22,30 తేదీలు అనుకూలం కాదు. ఆగస్టు 1 రాత్రి 8.19 నుంచి 3 అర్ధరాత్రి 2.07 వరకు తిరిగి 28 అర్ధరాత్రి 3.06 నుంచి 31 ఉదయం 9.49 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహిస్తూ నిర్ణయాలు తీసుకుంటూ ఉండాలి.

**సెప్టెంబరు: మూల:** కల్మషఅంశాలకు దూరంగా ఉంటారు. దినచర్యలో అధికమార్పులు చేస్తారు. సమయస్ఫూర్తి, ఆర్థిక పరిపుష్టి ఉండును. సోదరులతో సంఘీభావం ఏర్పరుచుకోవాలి. పంతాలకు, ఆర్భాటాలకు వెళ్లవద్దు. వాహన మరమ్మత్తులుండును. 7,16,24,25 ప్రతికూలములు. **పూర్వాషాఢ:** స్పెక్యులేషన్‌లో దూకుడును తగ్గిస్తారు. వాగ్ధోరణిలో అసత్యాలు దొర్లును. సంజాయిషీలుండను. సంతానవిజయాలచే కీర్తి. మాసం మధ్యలో హడావుడి ప్రయత్నాలు. ఉద్యోగ నిర్వహణలో బాధ్యతలు పెరుగును. 8, 17,25,26 అనుకూలం కాదు. **ఉత్తరాషాఢ1:** మనోసంకటాలను పారద్రోలుదురు. 2వ వారంలో గొప్పవ్యక్తుల పరిచయాలు కల్గును. అంతర్గత వ్యవహారాలు మందకొడి. 2వవారంలో విహారాలకై ధనవ్యయం. దైవకార్యాచరణపై మక్కువ చూపుతారు. తండ్రి ఆజ్ఞలను శిరసావహిస్తారు. 9,18,27 ప్రతికూల తేదీలు. సెప్టెంబరు 25 ఉదయం 8.38 నుంచి 27 సాయంత్రం 4.00 వరకు ప్రతికూల సమయం.

**అక్టోబరు: మూల:** వ్యక్తిగత నిర్ణయాలకు పెద్దపీట వేస్తారు. అలౌకిక విషయాలపై ఆసక్తి పెరుగును. మానసిక శారీరక చిక్కులు తగ్గును. ఆశాజనక పరిస్థితులున్ననూ ముఖ్యకార్యాలు వాయిదా. ఋణలావాదేవీలు తగ్గుముఖం. స్వల్పంగా స్పెక్యులేషన్ లబ్ధి. వాయిదాలకై వెంపర్లాడవద్దు. 4,13,14,22 ప్రతికూలతేదీలు. **పూర్వాషాఢ:** సాత్వికత్వం, చలాకీతనం, చిరుమందహాసాలతో ఇతరులను ఆకర్షిస్తారు. సంకల్పబలంచే లోపాలు తగ్గును. బంధుప్రీతి పెరుగును. ఉద్యోగస్థులకు ఆలస్యంగా విజయాలుండును. స్త్రీలకు యోగవంతమైన మాసం. 5,6,14,15,23 అనుకూలములు కాదు. **ఉత్తరాషాఢ1:** పోటీలను ఎదుర్కొంటారు. హామీ ప్రయత్నాలు నెరవేరును. గౌరవప్రతిష్ఠలు కాపాడుకుంటారు. కీలకనిర్ణయాలలో జాగ్రత్తలు తీసుకుంటారు. కళత్రసలహాలచే లబ్ధి. సంతాన సమస్యలపై శ్రద్ధ వహిస్తారు. 6,7,15,16,24 అనుకూల తేదీలు కాదు. అక్టోబరు 22 మ 2.35 నుంచి 24 రాత్రి 9.32 వరకు వ్యతిరేకసమయం.

**నవంబరు : మూల:** సంతానంపై విమర్శలుండును. కుటుంబకలతలు రాగల సూచన కలదు. వివాదవిషయాలలో జోక్యం చేసుకుంటారు. ఉద్యోగస్తులపై అధికారుల పంజా ఉండును. ఉదరసంబంధ లోపములుండును. 1,10,18,28 అనుకూల తేదీలు కాదు. **పూర్వాషాఢ:** బంధుప్రీతిని స్వాగతించలేరు. సంజాయిషీ, క్షమాపణలు సిద్ధంగా ఉంటాయి. రాజీధోరణి వైపు వెళ్లరు. పాతమిత్రత్వం కోరుకుంటారు. విధానపాలనా నిర్ణయాలు సజావుగా సాగును. స్పెక్యులేషన్‌లు దారితప్పిస్తాయి. అకాలభోజనాదులు పెరుగును. 1,2,11,19,29 వ్యతిరేక తేదీలు. **ఉత్తరాషాఢ1:** సహచరులతో సంయమనం పాటించలేరు. వ్యాపారంలో ఒడిదుడుకులు. హాస్యానికి వెళ్లకండి. మాసం చివరలో అనుకూల వార్తాశ్రవణం. ప్రయత్నంతో కార్యం విజయం దిశగా ఉండును. భాగస్వామ్య నిర్ణయాలు వాయిదా పడును. రక్తసంబంధీకులచే సమస్యలు సమసిపోవును. వివాదాంశాలలో తలదూర్చవద్దు. గృహమరమ్మత్తులకై ధనవ్యయం. 3,12,20,30 అనుకూల తేదీలు కాదు. నవంబరు 18 రాత్రి 10.36 నుంచి 20 అర్ధరాత్రి తదుపరి 4.02 వరకు ప్రతికూల సమయం.

**డిశంబరు: మూల:** వాహనచోదకంలో జాగ్రత్తలు తీసుకుంటారు. అవివాహితులకు అదృష్టయోగం. కార్మికులకు అనుకూల కాలం. సంతాన సౌఖ్యం కల్గును. ఆశాభావంతోనే ముందుకు కదలండి. వృత్తిలో నూతన మార్పులకై అన్వేషిస్తారు. మాసాంతంలో ఋణవత్తిడి తగ్గును. ప్రత్యేక ప్రతిపత్తిని ఆశిస్తారు. 7,8,15,16,25 ప్రతికూలతేదీలు. **పూర్వాషాఢ:** మాసం మధ్యలో కుటుంబ సమస్యలు తలెత్తును. పరనింద ఆరోపణలు పెరుగును. శుభకరచర్చలలో ఆచితూచి వ్యవహరించాలి. దంపతుల మధ్య అన్యోన్యత ఉండును. జీవనసరళిపై నూతన ఆలోచనలు చేస్తారు. మాసం మధ్యలో అధికఖర్చు కలదు. 8,9,16,17,26 అనుకూలం కాదు. **ఉత్తరాషాఢ1:** దూరప్రయాణాలు రద్దగును. ఉదరసమస్య లోపంతో వైద్యసేవలుండును. పంతాలకు వెళ్లినందున లబ్ధి ఉండదని గ్రహించాలి. వ్యాపార లావాదేవీలలో విజయం సిద్ధిస్తుంది. స్త్రీలకు అనుకూలం. 9,10,17,18,27 వ్యతిరేకములు. డిశంబరు 16 ఉదయం 8.54 నుంచి 18 మధ్యాహ్నం 12.40 వరకు అనుకూల సమయం కాదు.

**జనవరి 2017: మూల:** ముఖ్య ఒప్పందాలు రద్దగును. ఆరోగ్య భంగములు, సంతానఅవాంతరములు తగ్గును. గౌరవమర్యాదలు కాపాడుకుంటారు. నిర్వహణ బాధ్యత లోపాలు సవరిస్తారు. స్థాన చలన ఆశలు నిరాశలు కావు. మాసం చివరలో కృషికి తగిన ఫలితం. 3,4,12, 21,22 అనుకూలములు కాదు. **పూర్వాషాఢ:** కీలక నిర్ణయాలచే ఆర్థిక మాంద్యం ఏర్పడును. స్త్రీలకు శుభకరం. సోమరితన వ్యాప్తి హెచ్చు. కుటుంబ విరోధాలు తగ్గును. ఉద్యోగస్తులకు అధికారుల అండ పెరుగును. అలౌకిక విషయాలపై ఆసక్తి పెంచుతారు. 4,5,13,22,23 అనుకూల తేదీలు కాదు. **ఉత్తరాషాఢ1:** నిర్మాణాత్మక శక్తులు పెరుగును. ఋణదాతల వత్తిడి తగ్గును. పరిశోధనాత్మక శక్తి పెరుగును. న్యాయసలహా సంప్రదింపులుండును. సోదరమైత్రి మెరుగ్గా ఉండును. హామీ సంతకాలు పెట్టవద్దు. 5,6,14,23,24 తేదీలు అనుకూలం కాదు.జనవరి రాత్రి 7.49 నుంచి 14 రాత్రి 10.55 వరకు అనుకూలరోజులు కాదు.

**ఫిబ్రవరి 2017: మూల:** పోటీలను ఎదుర్కొంటారు. నూతన ప్రణాళికలు సిద్ధం చేస్తారు. ఆవేశాలకు వెళ్లి ధనవ్యయం చేస్తారు. స్వీయకల్పనా శక్తి పెరుగును. స్వయంవృత్తుల వారికి చక్కని పురోగమనం. కళత్రవర్గీయులచే సమస్యలు. మాసాంతంలో నూతన వస్తుకొనుగోళ్లు. 8,9,17,18,27,28 ప్రతికూలములు. **పూర్వాషాఢ:** స్థానచలన సూచన కలదు. జూదనష్టములు ఎక్కువ. జీర్ణాశయ లోపముంది. ఆచారవ్యవహారములలో మార్పులు. పితృసంబంధంగా స్వల్ప ఆటంకాలు. దీర్ఘకాల సమస్యకు పరిష్కారం. ఆదాయానికి మించిన ఖర్చులుండును. 9,10,18,19,28 అనుకూలం కాదు. **ఉత్తరాషాఢ1:** భాగస్వామ్య చిక్కులు మాసాంతంలో తగ్గును. న్యాయనిర్ణయాలకై సమయం వృథా చేస్తారు. విచార సంఘటనలు పదేపదే తలచవద్దు. వాగ్ధోరణిచే అనుకూల స్థితిగతులు. 2వవారంలో జీవన స్థితిపై మెరుగైన ఆలోచనలు చేస్తారు. స్వయం ఉపాధి వారికి ఆర్థిక వెసలుబాటు కల్గును. 2,10,11,20 అనుకూల తేదీలు కాదు. ఫిబ్రవరి 9 ఉదయం 5.09 నుంచి 11 ఉ 8.55 వరకు ప్రతికూలమని భావించాలి.

**మార్చి 2017: మూల:** వాగ్ధోరణిని అదుపుచేస్తారు. శతృవర్గ వైషమ్యాల బెడద తగ్గును. ధర్మావేశం అనుకూలం కాదని తెలుసుకుంటారు. లేనిపోని వ్యవహారాలలో కీలకబాధ్యత తీసుకోవద్దు. సంతానంచే ఉత్సాహముండును. మాసాంతంలో మనోవాంఛలు నెరవేరును. 7,8,17,26,27 తేదీలు అనుకూలం కాదు. **పూర్వాషాఢ:** స్థిరాదాయం తగ్గును. శుభవార్తాశ్రవణం కలదు. స్వార్ధబుద్ధిని తగ్గిస్తారు. ఆర్భాటాలకు, ఆడంబరాలకు దూరం. మేనమామ సహాయసహకారాలుండును. వ్యాపార లావాదేవీలలో సరిక్రొత్త పంథాతో వెళతారు. నేత్రలోపముందని గ్రహించాలి. 8,9,18,27 ప్రతికూల తేదీలు. **ఉత్తరాషాఢ1:** నూతన అగ్రిమెంట్లు లాభించును. వృథా ప్రయాణాలచే అనారోగ్యమేర్పడును. మేధాశక్తితో సమస్యలను పరిష్కరించుకుంటారు. మానసిక వత్తిడి ఉండదు. మాసాంతంలో ఆచితూచి సంభాషించాలి. చంచలత్వం అధికం. నూతన పరిచయాలు అధికం చేయవద్దు. గృహ వాతావరణం ఆశాజనకం. 1,9,10,19 అనుకూలం కాదు. మార్చి 8 మధ్యాహ్నం 11.58 నుంచి 10 సాయంత్రం 4.59 వరకు వ్యతిరేకతేదీలు.



# మకరరాశి

ఉత్తరాషాఢ 2,3,4పా(భో,జా,జి),శ్రవణం 1,2,3,4పా (జూ,జె,జో,ఖ) ధనిష్ఠ 1,2,పా (గా,గి)

| | |
|---|---|
| ఆదాయము: | 08 |
| వ్యయము : | 08 |
| పూజ్యత : | 07 |
| అవమానం : | 05 |

**మకరరాశి వారు పఠించాల్సిన శ్రీ లలితా అష్టాక్షరీ నామాలు**

| | |
|---|---|
| ఓం దహరాకాశరూపిణ్యై నమః | (609) |
| ఓం కావ్యాలాపవినోదిన్యై నమః | (613) |
| ఓం కైవల్యపదదాయిన్యై నమః | (625) |
| ఓం సింధూరతిలకాంచితాయై నమః | (632) |
| ఓం సర్వవేదాంతసంవేద్యాయై నమః | (645) |
| ఓం సత్యానందస్వరూపిణ్యై నమః | (646) |
| ఓం లోపాముద్రార్చితాయై నమః | (647) |
| ఓం సదసద్రూపధారిణ్యై నమః | (661) |
| ఓం లోకయాత్రావిధాయిన్యై నమః | (664) |
| ఓం బ్రహ్మాత్మైక్యస్వరూపిణ్యై నమః | (672) |
| ఓం భావాభావవివర్జితాయై నమః | (680) |
| ఓం శోభనాసులభాగత్యై నమః | (683) |
| ఓం చతురంగబలేశ్వర్యై నమః | (691) |
| ఓం సర్వలోకవశంకర్యై నమః | (697) |
| ఓం సచ్చిదానందరూపిణ్యై నమః | (700) |
| ఓం దేశకాలాపరిచ్ఛిన్నాయై నమః | (701) |
| ఓం సర్వోపాధివినిర్ముక్తాయై నమః | (708) |
| ఓం సదాశివపతివ్రతాయై నమః | (709) |
| ఓం గురుమండలరూపిణ్యై నమః | (713) |
| ఓం దక్షిణామూర్తిరూపిణ్యై నమః | (725) |

**గమనిక:** 16వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

ఆగస్టు 11 వరకు గురువు అష్టమస్థాన సంచారంచే జూదనష్టములు. నిద్రా భంగములుండును. కీర్తి ప్రతిష్ఠలు తగ్గును. అధర్మకార్యాలవైపు ఆసక్తి పెరుగును. శరీరానికి గాయం కాగల సూచన కలదు. విధివిధానాలలో మార్పులు పెరుగును. ఆగస్టు 12 నుంచి సంవత్సరాంతం వరకు గురువు నవమస్థాన సంచారంచే అవివాహితులకు శుభవార్తలు. కళత్రభోగం పరిఢ విల్లును. ఆంతరంగికుల సలహాలను స్వీకరిస్తారు. ఆదాయం పెరుగును. ప్రతిబంధక వ్యవహారాలు తగ్గును. కుటుంబ వాతావరణంలో ప్రశాంతత.

2017 జనవరి 26 వరకు శని ఏకాదశస్థాన సంచారంచే విజయ వార్తలు వింటారు. స్పెక్యులేషన్ రాణింపు కలదు. స్వార్ధ బుద్ధిని తగ్గిస్తారు. నేత్ర, దంత రుగ్మతలు ఏర్పడు సూచన కలదు. కుటుంబ కలతలు సర్దుమణుగును. స్వయంవృత్తుల వారికి పూర్తి ఆశాజనక స్థితి. జనవరి 27 నుంచి సంవత్సరాంతం వరకు శని ద్వాదశ సంచారంచే స్థిరాస్తి అంశాలలో నిర్ణయాలు ఆగిపోవును. కుటుంబ సమస్యలు అనుకోకుండా గుప్పుమనును. శుభకార్యచర్చలు ఆగు సూచన. భూ, గృహ మార్పులధికం. అంతర్గత కలహాలు, పరనింద ఆరోపణలు పెరగటంతో కార్యదీక్షా బాధ్యతకు భంగమేర్పడును.

గ్రహసంచార స్థితిగతులను పరిశీలించగా శారీరక, మానసిక సంఘర్షణలు ఉన్ననూ ధైర్యంగా ఉంటారు. శక్తియుక్తులతో ఇతరుల మెప్పును సంపాదిస్తారు. ప్రణాళికలో మార్పుచేర్పులు చేసి ఫలితాలను అనుకూలంగా పొందగలరు. జాయింటు వ్యాపారస్థులకు పూర్తి అనుకూలత. స్నేహ సంబం ధాలు మెండగును. వ్యక్తిగత విమర్శలు, దూషణలు ఉన్ననూ శిరసావహిస్తారు. వాగ్ధోరణిని అదుపులో ఉంచుకుంటారు. మేనమామ సహాయంతో కార్యసిద్ధి. సంతాన అంశాలు సజావుగా సాగును. సాహస ప్రయత్నాలు కొంతవరకే ఫలించును. హాస్యంతో పనులు కావని తెలుసుకుంటారు. దైవకార్యాలపై శ్రద్ధ ఎక్కువ చూపిస్తారు. ఉదరలోపంతో ఆర్థిక ధనవ్యయం. స్త్రీలకు పూర్తి అనుకూలము. రాజకీయ, రవాణా, వ్యవసాయ, గృహనిర్మాణ, కంప్యూటర్, మెడికల్, క్రీడావాసులకు లబ్ధి ఉన్నప్పటికీ మనశ్శాంతి తగ్గును.

**ఏప్రిల్ : ఉత్తరాషాఢ 2,3,4:** అవివాహితులకు వివాహయోగం. కఠిన నిర్ణయాలు తీసుకొనలేరు. ఆధిపత్య పోరుకై ఉపక్రమిస్తారు. నూతన మార్గాలచే ఆర్థిక లబ్ధి. అంకితభావానికి పెద్దపీట వేస్తారు. స్పెక్యులేషన్‌తో మధ్యవాటంగానే ఉండండి. వాహనచోదకంలో జాగ్రత్త. మిత్రత్వ సంభాషణలు లాభాన్నివ్వవు. 7,15,16,25,26 తేదీలు ప్రతికూలములు. **శ్రవణం:** కుటుంబ విరోధాలు తగ్గును. ఏకాభిప్రాయ సాధన సాధిస్తారు. ధైర్యసాహసాలను ప్రదర్శిస్తారు. వృత్తి వ్యాపారాదులలో ఇతరుల జోక్యం వద్దు. సంతాన అంశాలలో నూతన ప్రణాళికలు. మాసాంతంలో నూతన వస్తుకొనుగోళ్లు. 8,16,17,26,27 వ్యతిరేక దినములు. **ధనిష్ఠ1,2:** భాగస్వామ్య నిర్ణయాలలో లోపాలు కలవు. తరచూ ఆర్థికమాంద్యం. విహారాలలో నూతన పరిచయాలచే లబ్ధి. బంధుప్రీతి పెరుగును. ఉద్యోగస్తులకు అధికారులచే ప్రశంసలు. 9,18,28 అనుకూలం కాదు. ఏప్రిల్ 16 సా5.17 నుంచి 18 అర్ధరాత్రి తదుపరి 4.58 వరకు ప్రతికూల సమయం.

**మే : ఉత్తరాషాఢ 2,3,4:** చలాకీతనం పెరుగును. సంతానానికి విజయ ప్రాప్తి. ఉద్యోగస్తులకు ఊరట. కుటుంబంలో శుభవాతావరణ మేర్పడును. న్యాయపోరాటం చేయాలనిపిస్తుంది. మాసాంతంలో సంయమనంతో వ్యవహరించాలి. ఇరుగువారితో ఆవేశాలకు వెళ్లవద్దు. 4,5,13,23 అనుకూలం కాదు. **శ్రవణం:** సోదరమైత్రి, నిద్రలేమి తగ్గును. సమస్యల వలయాన్ని ఛేదిస్తారు. జీర్ణాశయ లోపం కలదు. జూదనష్టములు ఎక్కువ. స్పెక్యులేషన్ రాణించును. ఇతరులపై విమర్శలు వద్దు. లాభార్జనకై నూతన ఆలోచనలు చేయుదురు. పితృభాగ్య సమస్యలు కొలిక్కి వచ్చును. 5,6,14,24 తేదీలు వ్యతిరేకములు. **ధనిష్ఠ1,2:** దూషణలు, విమర్శలు పెరుగును. ధర్మకార్యాలు వాయిదా పడును. అనారోగ్య బాధలు స్వల్పం. ఉద్యోగస్తులపై నిఘా ఉన్నది. మాసాంతమంతా సుఖ సంతోషాలతో పరిఢవిల్లును. 6,15,25 అనుకూల తేదీలు కాదు. మే 13 రాత్రి 11.56 నుంచి 16 మధ్యాహ్నం 11.07 వరకు అనుకూల సమయం కాదని గమనించాలి.

**జూన్ : ఉత్తరాషాఢ 2,3,4:** మానసిక సంఘర్షణలు తగ్గును. ఆర్థికనష్టం పూడ్చుకుంటారు. సంతానంచే శుభవార్తలు. పెద్దల ఆశీస్సులు లభించును. భుజాల తీపురాగల సూచన. నూతన పరిచయాలు లాభించవు. నిత్య భయాందోళనను వదలండి. స్త్రీలకు శుభకరం. 1,9,10,19,28 ప్రతికూల తేదీలని భావించాలి. **శ్రవణం:** సాహసనిర్ణయాలపై దృష్టి సారిస్తారు. హుందాతనం ప్రదర్శిస్తారు. శరీరానికి వైద్య సేవలవసరం. ఆదాయం లాభసాటిగా ఉంటుంది. భార్యాభర్తల మధ్య మనస్పర్ధలు రాగల సూచన. విందు వినోదాలలో జాగ్రత్తగా మాట్లాడండి. మాసం చివరలో మనశ్శాంతి. 2,10,11,20,29 తేదీలు అనుకూలం కాదు. **ధనిష్ఠ 1,2:** 3వ వారంలో స్నేహ సంబంధాలు పెరుగును. ఋణదాతల వత్తిడి తగ్గును. ఆధ్యాత్మిక కార్యక్రమాలకి మొగ్గు చూపుతారు. ఊహించని సౌకర్యాలు ఏర్పడును. 3,11,12,21,30 వ్యతిరేకతేదీలుగా గ్రహించాలి. జూన్ 10 ఉదయం 8.06 నుంచి 12 సాయంత్రం 6.16 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**జూలై: ఉత్తరాషాఢ 2,3,4:** కార్యబాధ్యతను గట్టెక్కిస్తారు. మనోవాంఛలు నెరువేరును. స్పెక్యులేషన్ స్వల్ప అనుకూలం. బంధుద్వేషాన్ని విడనాడండి. వృత్తి వ్యాపారాలలో 2వపక్షంలో ఆటుపోట్లు. ఏకాభిప్రాయ సాధనతో నిర్ణయాలు సాధ్యమగును. రహస్యమంతనాలు వద్దు. 6,7,16,17, 25,26 అనుకూలములు కాదు. **శ్రవణం:** శుభకార్యచర్చలు సఫలం. కుటుంబ నిర్ణయాలు ఫలించును. వ్యూహాత్మక శక్తులతో నూతన పథకాలు. వైద్య, క్రీడారంగాల వారికి మాసాంతంలో లబ్ధి. న్యాయస్థానంచే సమస్యలుండవు. 7,8,17,18,26,27 తేదీలు ప్రతికూలములు. **ధనిష్ఠ 1,2:** కుటుంబ అన్యోన్యతలో లోపాలు కనపడును. 2వ పక్షంలో వివాదాంశాలు తెరపైకి వచ్చును. ముఖ్యకార్యాలు వాయిదా. నిరుద్యోగులకు శుభవార్తలు. దూరప్రయాణాలు లాభించును. ఆత్మవిశ్వాసంతో ముందుకు వెళతారు. 8,9,18,19,27 తేదీలు అనుకూలము కాదు. జూలై 7 సాయంత్రం 5.12 నుంచి 9 అర్ధరాత్రి 2.25 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**ఆగస్టు: ఉత్తరాషాఢ 2,3,4:** సోమరితనం హెచ్చగును. కళత్రంచే ఖర్చులధికం. హడావుడి నిర్ణయాలచే మనఃక్లేశములు. భాగస్వామ్య వ్యాపారాలలో నూతన ఒడంబడికలు. గుప్తసమాచారాన్ని బహిర్గతం చేయవద్దు. సంతాన విజయాలతో మనోల్లాసం. 3,13,21,22,30,31 ప్రతికూల తేదీలు. **శ్రవణం:** వృత్తి నిర్వహణలో లోపాలు పెరుగును. తెరచాటు నిర్ణయాలు సఫలం కావు. మనోనిబ్బరం పాటించలేరు. స్పెక్యులేషన్ లాభసాటి. 2వవారంలో విసుగు, ఆందోళన తగ్గును. శుభ కార్యానికి మార్గం సుగమం. భూ లావాదేవీలలో అనుకూల వార్తలు. 4,14,22, 23,31 వ్యతిరేక తేదీలని గమనించాలి. **ధనిష్ఠ,1,2:** కీలక నిర్ణయాలలో అసత్యాలు చోటుచేసుకొనును. మాతృ అంశాలపై శ్రద్ధ చూపిస్తారు. నూతన గృహ విషయాలలో ప్రణాళికలు సిద్ధమగును. ఆదాయానికి మించిన ఖర్చులు. 5,15,23,24 తేదీలు అనుకూలం కాదు. ఆగస్టు 3 అర్ధరాత్రి 2.07 నుంచి 6 ఉదయం 10.56 వరకు తిరిగి 31 ఉదయం 9.49 నుంచి 2 సాయంత్రం 6.56 వరకు సమయం ప్రతికూలం.

**సెప్టెంబరు : ఉత్తరాషాఢ 2,3,4:** ఆర్ధిక అంశాలలో హామీలు ఇవ్వలేరు. వివాద వ్యాఖ్యలకు మూల్యం చెల్లిస్తారు. స్థానచలన అవకాశాలు కలవు. నీచ ఆలోచనలు పెరుగును. మిత్రులతో విందు వినోదాలలో పాల్గొంటారు. ఉద్యోగ నిర్వహణలో ఆటంకములుండును. సోదరశ్రద్ధ పెరుగుతుంది. 9,18,26,27 అనుకూలతేదీలు కాదు. **శ్రవణం:** సామరస్యంగా వ్యవహరించలేరు. నిద్రలేమితో అనారోగ్యం పెరుగును. కుటుంబ వ్యతిరేకత లుండవు. స్వయం ఉపాధిరంగం వారికి అనుకూలం. సంతాన సఖ్యతకు కృషిచేస్తారు. గృహలావాదేవీలలో అప్రమత్తత అవసరం. 1,10,11,19, 27,28 తేదీలు వ్యతిరేకములు. **ధనిష్ఠ1,2:** వ్యక్తిగత ఆకర్షణలకు ధనవ్యయమగును. మానవతాభావం పెరుగును. చిక్కు సమస్య నుంచి విముక్తి. వర్గవైషమ్యాల పోరు ఉండదు. అనుకోని ప్రయాణాలచే లబ్ధి. మృదు సంభాషణలతో ఆకట్టుకుంటారు. కళత్రసలహాలచే కీలక నిర్ణయాలు. 1,2,20,28,29 ప్రతికూలతేదీలు. సెప్టెంబరు 27 సాయంత్రం 4.00 నుంచి 9 అర్ధరాత్రి 1.48 వరకు నిదానమే ప్రధానంగా భావిస్తుండాలి.

**అక్టోబరు: ఉత్తరాషాఢ 2,3,4:** హామీలచే గౌరవ ప్రశంసలు. కుటుంబ నిర్ణయాలు వాయిదా పడవు. ఉదరలోపంతో ధనవ్యయం. స్థిర ఆలోచనలు కలిసివచ్చును. సోమరితనం పెంచవద్దు. పితృసలహాలను స్వీకరించరు. 6,7,15,16,23,24 ప్రతికూలతేదీలు. **శ్రవణం:** మరమ్మత్తులకై ధనవ్యయమగును. అనవసరహామీలను ఇవ్వరు. సంతానానికి ఆలస్యంగా ధనం అందజేస్తారు. స్త్రీలకు మాసం మధ్య నుంచి అనుకూలం. జీవన సరళిలో మార్పులకు నూతన ఆలోచనలు. ఆధ్యాత్మిక అంశాలలో పాల్గొంటారు. 7,8,16,17,25 తేదీలు వ్యతిరేకములు. **ధనిష్ఠ 1,2:** స్వీయ నిర్ణయాలు ఆలస్యంగా ఫలించును. శుభసంకేతాలు ఆలస్యంగా అందును. వాగ్ధోరణిని తగ్గించాలి. స్వయంవృత్తుల వారికి మంచి పురోగమనము. ఆర్ధికమాంద్యం పెరిగినందున ఋణములు చేస్తారు. వాహనచోదకంలో జాగ్రత్త. 8,9,17, 26 అనుకూల తేదీలు కాదు. అక్టోబరు 24 రాత్రి 9.32 నుంచి 27 ఉదయం 7.40 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**నవంబరు: ఉత్తరాషాఢ 2,3,4:** మాసం మధ్యలో చిక్కు సమస్యలను ఛేదిస్తారు. బంధుప్రీతి మెండగును. రోగబాధలు ఉపశమించును. ఆలోచనలకు పదునుపెట్టాలి. అధికవ్యయ ప్రయాసలతో విజయసాధన కలదు. ఉద్యోగస్తులకు అధిక కార్యభారం. 2,3,12,20,30 అనుకూల తేదీలు కాదు. **శ్రవణం:** 3వ వారంలో ముఖ్య వ్యవహారం కార్యరూపం దాల్చును. మాసాంతంలో ఆందోళన, భయం పెరుగును. వ్యక్తిగత ప్రతిష్ఠలకు వెళ్లవద్దు. సోదరవర్గీయులతో భేదాభిప్రాయాలు తొలగును. స్పెక్యులేషన్చే నష్టముంది. సంతానానికి విజయప్రాప్తి. 4,13,21 తేదీలు వ్యతిరేకములని భావించాలి. **ధనిష్ఠ 1,2:** సంతానంచే శుభవార్తలు. 2వ వారంలో మానసిక చాంచల్యముండును. బంధుసహాయముండును. వ్యవహారశైలిలో మార్పులుండును. అధికారులతో అపహాస్యం వద్దు. స్పెక్యులేషన్ లబ్ధి. శరీర తేజస్సు పెరుగును. 5,13,14,22 ప్రతికూల తేదీలు. నవంబరు 20 అర్ధరాత్రి 4.02 నుంచి 23 మధ్యాహ్నం 1.33 వరకు వ్యతిరేక సమయమని గ్రహించాలి.

**డిశంబరు: ఉత్తరాషాఢ 2,3,4:** సాహసప్రయత్నాలు చేయాలని ఆరాటం. 2వ వారంలో స్వల్ప అశాంతి. ఆదాయవనరులకు గండి పడును. ఋణ సమస్యలు వేధించును. సంతానంచే ఉత్సాహాన్ని పొందుతారు. ఈర్ష్యాద్వేషాలు తగ్గును. కీలకఅంశాలపై దృష్టి ఉంచుతారు. కళత్రంచే ఖర్చులు. 9,17,18,27,28 తేదీలు ప్రతికూలములు. **శ్రవణం:** పితృనిర్ణయాలు వ్యతిరేకమగును. మానసిక చింతన పెరుగును. స్పెక్యులేషన్ యోగించును. స్థానచలన సూచనలు. పాలనాపర శక్తియుక్తులు పెంచవలెను. అకాల భోజనాలధికము. జాయింటుదారులకు నిర్వహణలో లోపాలు తగ్గును. 1,10,18,19,28,29 అనుకూలతేదీలు కాదు. **ధనిష్ఠ 1,2:** స్పెక్యులేషన్ రాణింపు తక్కువ. మంగళకార్యములకు తెరతీస్తారు. అవివాహితులకు వివాహయోగం. నిరుద్యోగులకు ఆశాజనకం. నూతన అన్వేషణలతో జీవనం సాఫీగా ఉండును. మాసం మధ్యలో మిత్రభేదం కలదు. 2,11, 19,20,29,30 వ్యతిరేకతేదీలని భావించాలి. డిశంబరు 18 మధ్యాహ్నం 12.40 నుంచి 20 రాత్రి 8.44 వరకు వ్యతిరేక సమయం.

**జనవరి 2017: ఉత్తరాషాఢ 2,3,4:** విజయపంథాలో నడుస్తారు. నూతన పథకాలను అన్వేషిస్తారు. అగ్రిమెంట్లు లాభిస్తాయి. అన్నిరంగాల వారికి అనుకూలస్థితులేర్పడును. భాగస్వామ్య ఒడంబడికలు నెరవేరును. అధికారుల వత్తిడి ఉన్ననూ సమయస్ఫూర్తితో వ్యవహరిస్తారు. స్పెక్యులేషన్ సాధారణం. 5,6,14,23,24 తేదీలు వ్యతిరేకములు. **శ్రవణం:** కళత్రయోగం కలదు. స్థానచలన ఆశలు చిగురిస్తాయి. శతృవైషమ్యాలు తగ్గును. వాహనచోదకంలో జాగ్రత్త వహించాలి. సంతాన అంశాలలో నూతన నిర్ణయాలు. పితృవర్గీయులతో మాటపట్టింపులుండును. స్వవృత్తుల వారు ధైర్యంగా ముందుకు వెళ్లాలి. నూతన వ్యాపార ఒప్పందాలు లాభించును. 6,7,15,24,25 ప్రతికూలతేదీలు. **ధనిష్ఠ 1,2:** కపటస్వభావులను దూరంగా ఉంచుదురు. స్పెక్యులేషన్ దూకుడు తగ్గిస్తారు. 7,8,16,25,26 అనుకూలతేదీలు కాదు. జనవరి 14 రాత్రి 10.55 నుంచి 17 ఉదయం 5.38 వరకు వ్యతిరేక సమయము.

**ఫిబ్రవరి 2017 : ఉత్తరాషాఢ 2,3,4:** వివాద వ్యాఖ్యలపై మౌనం వహిస్తారు. కంఠం లేక ఉదర సమస్యలున్నవి. పరోపకారం, సత్సాంగత్యం పెరుగును. శుభకార్యాలకు చర్చలుండును. సాహసప్రయత్నాలతో ఆదాయం తగ్గును. శతృబెడదలుండును. 2,10,11,20 తేదీలు ప్రతికూలములు. **శ్రవణం:** అవివాహితులకు అనవసర ప్రయాణాలు. వ్యక్తిగత కక్షలను తగ్గిస్తారు. కుటుంబ కలతలు తగ్గుముఖం. నూతన నిర్ణయాలు విజయవంతం. న్యాయవిషయాలు వాయిదా. వాహనసౌఖ్యం. బంధువుల ఆదరణ సంపాదిస్తారు. శరీరానికి వైద్యసేవలవసరం. 3,11,12,21 అనుకూల తేదీలు కాదు. **ధనిష్ఠ 1,2:** భాగస్వామ్య నిర్ణయాలు వాయిదా పడును. సంఘీభావంతో సంయమనంతో ఉండాలి. మాసం మధ్యలో త్రిప్పట, ఖర్చులుండును. తోబుట్టువులతో అంగీకారంతో కార్యసిద్ధి. ఉద్యోగ నిర్వహణలో బాధ్యతలు పెరుగును. కల్యాణవిషయంలో ఆలస్యమును అధిగమిస్తారు. 4,12,13,22 వ్యతిరేకతేదీలు. ఫిబ్రవరి 11 ఉదయం 8.55 నుంచి 13 మధ్యాహ్నం 3.13 వరకు అనుకూలం కాదు.

**మార్చి 2017: ఉత్తరాషాఢ 2,3,4:** ధర్మావేశం ప్రతికూలమగును. వ్యాపారాదులలో లోపాలు సర్దుకుంటాయి. శుభవార్తాశ్రవణం. స్థిరాస్తులలో జాగ్రత్తలు తీసుకోవాలి. సహచర ఉద్యోగస్తులతో సంయమనంతో వ్యవహరించాలి. కుటుంబంతో విహారయాత్రలుండును. ఆర్భాటాలకు, పంతాలకు వెళ్లవద్దు. 1,9,10,19,28,29 ప్రతికూల తేదీలు. **శ్రవణం:** వాగ్ధోరణిని అదుపుచేస్తారు. కళత్రంచే ఖర్చులధికం. హామీ ప్రయత్నాలు విరమిస్తారు. ఆస్తి ఒప్పందాలు ఫలించవు. సజావు ఆలోచనలకు ప్రాధాన్యత ఇవ్వండి. స్వయంవృత్తుల వారికి కొంత ఆశాభంగములు. శ్వాసకోశ రుగ్మతులున్నవి. 2,10,11,20,21 అనుకూలములు కాదు. **ధనిష్ఠ 1,2:** కీలక నిర్ణయాలు వాయిదా. మాసాంతంలో పరువు, ప్రతిష్ఠలకు భంగకరం కాగల సూచన. మాతృవర్గీయులచే లబ్ధి. ప్రయాణాలలో సమస్యలు. గృహనిర్మాణ ఆలోచనలు సడలును. కపట స్వభావులు స్నేహితులగుదురు. 3,11,12,21,22 తేదీలు వ్యతిరేకములు. మార్చి 10 సాయంత్రం 4.59 నుంచి 12 రాత్రి 11.56 వరకు ప్రతికూలం.



# కుంభరాశి

ధనిష్ఠ 3,4 పా (గూ,గే), శతభిషం 1,2,3,4పా (గో,సా,సీ,సూ), పూర్వాభాద్ర 1,2,3పా (సే,సో,దా)

| | |
|---|---|
| ఆదాయము | 08 |
| వ్యయము | 08 |
| పూజ్యత | 03 |
| అవమానం | 05 |

**కుంభరాశి వారు పఠించాల్సిన శ్రీ లలితా అష్టాక్షరీ నామాలు**

ఓం పుణ్యశ్రవణకీర్తనాయై నమః (544)
ఓం వియదాదిజగత్ప్రసువే నమః (550)
ఓం సర్వవ్యాధిప్రశమన్యై నమః (551)
ఓం సర్వమృత్యునివారిణ్యై నమః (552)
ఓం కలికల్మషనాశిన్యై నమః (555)
ఓం కమలాక్షనిషేవితాయై నమః (558)
ఓం తాంబూలపూరితముఖ్యై నమః (559)
ఓం దాడిమీకుసుమప్రభాయై నమః (560)
ఓం మైత్ర్యాదివాసనాలభ్యాయై నమః (570)
ఓం మహాప్రళయసాక్షిణ్యై నమః (571)
ఓం ప్రజ్ఞానఘనరూపిణ్యై నమః (574)
ఓం మాతృకావర్ణరూపిణ్యై నమః (577)
ఓం మహాకైలాసనిలయాయై నమః (578)
ఓం మృణాలమృదుదోర్లతాయై నమః (579)
ఓం మహాసామ్రాజ్యశాలిన్యై నమః (582)
ఓం శ్రీషోడశాక్షరీవిద్యాయై నమః (587)
ఓం త్రికోణాంతరదీపికాయై నమః (597)
ఓం దక్షయజ్ఞవినాశిన్యై నమః (600)
ఓం దరాందోళితదీర్ఘాక్ష్యై నమః (601)
ఓం దరహాసోజ్జ్వలన్ముఖ్యై నమః (602)

**గమనిక:** 16వపేజీలోని "రాశిఫలితాలు చదువరులకు గమనిక" అను వివరాలను చదివి, తదుపరి ఈ దిగువ ఫలితాలను చదువమని కోరడమైనది.

ఆగస్టు 11 వరకు గురువు సప్తమస్థాన సంచారంచే అనుకూల పరిస్థితులు ఉన్నప్పటికీ గురుచండాల యోగం ఏర్పడటంతో రాజీ ప్రక్రియలవైపు మొగ్గు చూపాలి. విశేష వ్యక్తుల పరిచయాలతో సమస్యలు వచ్చును. దాయాదుల అభిమానాలు తగ్గును. ఆగస్టు 12 నుంచి అష్టమస్థానంలో గురుసంచార కారణంగా సంతానంచే సమస్యలు అధికమగును. సోదరులతో జాగ్రత్తగా మెలగాలి. తరచూ ప్రతికూలతలు ఎదురగుచుండును. వైద్యసేవలధికము.

2017 జనవరి 26 వరకు దశమస్థాన సంచారంచే ప్రశాంతత తక్కువ. మానసిక శారీరక సంఘర్షణలతో వ్యతిరేక నిర్ణయాలు తీసుకుంటారు. లాభం లేని ఖర్చులు పెరుగును. మనోసంకటాలతో కాలం గడపాలి. నమ్మిన వారినే మోసం చేస్తారు. అకాలభోజనాదులధికము. జనవరి 27 నుంచి సంవత్సరాంతం వరకు శని ఏకాదశ స్థాన సంచారంచే ఉపశాంతి లభించును. జీవనోపాధిలో స్థిరత్వానికి దారి కనపడును. ప్రణాళికలో మార్పు చేర్పులు కల్గును. నూతన ఆలోచనలు ఫలించును.

గ్రహసంచార స్థితిగతులను విశ్లేషించగా నాస్తికత్వ మిత్రులతో ధనవ్యయం. కళత్ర కారణంగా అనవసర సమస్యలు వచ్చును. సంతాన సమస్యలకు పరిష్కారాలు ఆలస్యంగా లభించును. ముఖ్యవిషయాలలో రాజీపడుతూ కాలయాపన చేయాలి. అవివాహితులకు వివాహయోగముంది. తరచూ ఎదుటివారిని కించపరిచేలా వ్యవహరించటంతో మొదటికే మోసం వచ్చును. స్త్రీలకు సౌఖ్యం తక్కువ. సాఫ్ట్‌వేర్, రియల్‌ఎస్టేట్, నౌకా, క్రీడా, సినీ రాజకీయ రంగాల వారికి ఆలస్యంగా లబ్ధి. స్వయంవృత్తుల వారికి ఆశాజనకం. సంవత్స రాంతంలో విజయానికి చేరువగుదురు. శుభకార్య చర్చలు వాయిదా పడును. ఋణదాతల వత్తిడి పెరుగును. దురలవాట్లు పెరుగును. వివేకంతో ఆదాయమార్గాలను అన్వేషించలేరు. చేసిన తప్పులకు పశ్చాత్తాపం చెందిననూ ప్రయోజనముండదు. దైవ కార్యాలపై శ్రద్ధ పెరుగును. కుటుంబ వ్యక్తులతో సఖ్యత తగ్గును. పితృవర్గ నిర్ణయాలను శిరోధార్యంగా భావించలేరు. ప్రణాళికలో మార్పు చేర్పులు చేయగలరు. ఆంతరంగికుల సలహాలు స్వీకరిస్తారు.

**ఏప్రిల్: ధనిష్ఠ 3,4:** మనోసంకటాలధికము. ఆలస్యవిజయం. స్థానచలన అవకాశములు కలవు. పంతాలకు, పట్టింపులకు వెళ్లవద్దు. కళత్ర సుఖమధికం. కార్యదీక్షా బాధ్యతను చేపడుతారు. వాదనాశక్తి తగ్గును. సోదర వ్యవహారాలలో మార్పులుండవు. 9,17,18,27,28 ప్రతికూల తేదీలు. **శతభిషం:** మేధాశక్తితో ప్రతి విషయాన్ని రహస్యంగా ఆలోచించాలి. వాస్తవ విషయాలను గోప్యంగా ఉంచగలరు. నేత్ర దంత రుగ్మతలు పెరుగును. వాహన కొనుగోలు నిర్ణయం వాయిదా. సంతానంచే అమితోత్సాహం. నూతన ఒప్పందాలు రాణిస్తాయి. 9,10,19,29 అనుకూల తేదీలు కాదు. **పూర్వాభాద్ర 1,2,3:** అవివాహితులకు శుభవార్తలు. వాగ్దానములు తగ్గించాలి. అనవసర ప్రయాణాలతో ధనక్షయం. స్పెక్యులేషన్‌లో గెలుపు తక్కువ. ఆంతరంగికుల సలహాలను స్వీకరించాలి. 10,11,20,29,30 తేదీలు వ్యతిరేకములు. ఏప్రిల్ 18 అర్ధరాత్రి 4.58 నుంచి 21 సాయంత్రం 5.47 వరకు ప్రతికూలం.

**మే: ధనిష్ఠ 3,4:** మాసం మధ్యలో అనుకూల స్థితులచే విజయప్రాప్తి. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులు కలవు. వాగ్దాన భంగములు కలవు. సెంటిమెంట్ బలాన్ని పెంచుకుంటారు. అధికంగా అంచనాలు వేయవ్దు. నూతన నిర్ణయాలను ముందుగా బహిర్గతం చేయవద్దు. 6,7,15,25 తేదీలు అనుకూలం కాదు. **శతభిషం:** మౌనానికి అధిక ప్రాధాన్యత ఇవ్వాలి. మిత్రభేదం కలదు. ఆర్థికంగా స్థిర నిర్ణయాలు తీసుకుంటారు. అధికారుల వత్తిడి ఉండదు. భూలావాదేవీలలో అనుకూల పరిస్థితులు. అవివాహితులకు శుభవార్తలు. 3వ వారంలో స్పెక్యులేషన్‌చే నష్టం. 7,16,26 వ్యతిరేకతేదీలని గమనించాలి. **పూర్వాభాద్ర 1,2,3:** 2వపక్షంలో వ్యవహారాలు స్తంభించు సూచన. శరీర బలహీనతచే అనారోగ్య సూచన. లాభం లేని ఖర్చులు పెరుగును. కృతనిశ్చయం బలంగా ఉండాలి. 8,17,18,27 ప్రతికూల తేదీలు. మే 16 మధ్యాహ్నం 11.07 నుంచి 18 రాత్రి 11.58 వరకు ముఖ్య అంశాలలో తొందరపాటు వద్దు.

**జూన్: ధనిష్ఠ 3,4:** హామీలకై సమయం వృధా. ఇరుగుపొరుగుతో సయోధ్యగా ఉండలేరు. సరికొత్త ఆలోచనలకు తెరతీస్తారు. న్యాయస్థాన లావాదేవీలు సామాన్యం. సంతానసౌఖ్యం లాభించును. గృహనిర్మాణ కార్యక్రమాలలో సడలింపులు. 2,3,11,12,21,22,30 తేదీలు అనుకూలం కాదు. **శతభిషం:** ఋణ సమస్యలపై ఊరట కలదు. ఖర్చును అదుపు చేయలేరు. 4వవారంలో ప్రతిబంధక శతృవులు ఎదురగుదురు. స్థానచలన అవకాశములున్నవి. బంధుప్రీతి పెరుగును. నిస్వార్థ సేవతో గుర్తింపు. పెద్దల ఆశీస్సులతో కార్యవిజయం. 3,4,12,13,22,23 ప్రతికూల తేదీలు. **పూర్వాభాద్ర 1,2,3:** సంతానం నిర్ణయాలను పాటించలేరు. సోమరితనం తగ్గించుకోవాలి. ఆంతరంగిక అంశాలపై చర్చలు వద్దు. కుటుంబ విరోధాలు సర్దుమణుగును. మాసాంతంలో మనోల్లాసం పెరుగును. 4,5,13,14,23,24 తేదీలు వ్యతిరేకములు. జూన్ 12 సా6.16 నుంచి 15 ఉదయం 6.47 వరకు ప్రతికూల సమయం.

**జూలై : ధనిష్ఠ 3,4:** కీలక నిర్ణయాలు తీసుకోలేరు. ఆర్థిక అంచనాలు చేయలేరు. శక్తి యుక్తులతో ఇతరులను మెప్పించలేరు. రాజకీయవాసులకు శృంగభంగము. ఆలోచనలకు పదును పెట్టాలి. మాసాంతంలో ప్రయత్న కార్యసిద్ధి. సంతాన శుభవార్తలు. 8,9,18,19,27,28 తేదీలు వ్యతిరేకములు. **శతభిషం:** వివాదఅంశాలు రాగల సూచన. సమయస్ఫూర్తిని పాటించగలరు. కళత్రభోగం పరిఢవిల్లును. బంధుసహాయంపై ఆశ వద్దు. ఆధ్యాత్మికఅంశాలపై మక్కువ. అధికార యంత్రాంగంతో మాసం మధ్యలో కార్యసిద్ధి. 1,9,10,19,20,28అనుకూల తేదీలు కావు. **పూర్వాభాద్ర 1,2,3:** సంజాయిషీలు, క్షమాపణలు అధికము. జీర్ణాశయ సమస్య రాగల సూచన. గృహ నిర్మాణ పనులు మందకొడి. సృజనాత్మక శక్తిపెరుగును. ఉద్యోగస్తులకు అధిక కార్యభారమున్ననూ అధికారుల నుంచి ప్రశంసలు. స్త్రీలకు యోగవంతం. నిరుద్యోగులకు శుభవార్తలు. 2,11,20,21,29 ప్రతికూల తేదీలు. జూలై 9 అర్ధరాత్రి 2.25 నుంచి 12 మధ్యాహ్నం 2.24 వరకు అనుకూల సమయం కాదు.

# 2016-17లో లాస్‌ఏంజిల్స్ నగరానికి శుభసమయాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 31 | శని | శు.తదియ | శ్రవణం | ఉ08.25 | నుంచి | 09.37 | వరకు |
| 31 | శని | శు.తదియ | శ్రవణం | ఉ10.56 | నుంచి | మ3.37 | వరకు |
| 01 | ఆది | శు.చవితి | ధనిష్ఠ | ఉ08.20 | నుంచి | 09.30 | వరకు |
| 01 | ఆది | శు.చవితి | ధనిష్ఠ | ఉ10.52 | నుంచి | 01.12 | వరకు |
| 02 | సోమ | శు.పంచమి | శతభిషం | ఉ07.50 | నుంచి | 09.27 | వరకు |
| 02 | సోమ | శు.పంచమి | శతభిషం | మ02.54 | నుంచి | 05.45 | వరకు |
| 04 | బుధ | శు.సప్తమి | ఉత్తరాభాద్ర | ఉ07.42 | నుంచి | 09.19 | వరకు |
| 04 | బుధ | శు.సప్తమి | ఉత్తరాభాద్ర | ఉ10.40 | నుంచి | 11.37 | వరకు |
| 04 | బుధ | శు.సప్తమి | ఉత్తరాభాద్ర | మ02.45 | నుంచి | 05.37 | వరకు |
| 05 | గురు | శు.అష్టమి | రేవతి | ఉ07.37 | నుంచి | 09.15 | వరకు |
| 06 | శుక్ర | శు.నవమి | అశ్వని | ఉ07.34 | నుంచి | 09.00 | వరకు |
| 06 | శుక్ర | శు.నవమి | అశ్వని | ఉ10.32 | నుంచి | 12.15 | వరకు |
| 08 | ఆది | శు.ద్వాదశి | రోహిణి | రా10.10 | నుంచి | 11.16 | వరకు |
| 09 | సోమ | శు.ద్వాదశి | రోహిణి | ఉ07.22 | నుంచి | 08.59 | వరకు |
| 09 | సోమ | శు.ద్వాదశి | రోహిణి | ఉ10.21 | నుంచి | 11.10 | వరకు |
| 09 | సోమ | శు.త్రయోదశి | రోహిణి | మ03.02 | నుంచి | 05.18 | వరకు |
| 09 | సోమ | శు.త్రయోదశి | మృగశిర | రా10.06 | నుంచి | 11.12 | వరకు |
| 11 | బుధ | పూర్ణిమ | పునర్వసు | మ02.54 | నుంచి | 05.10 | వరకు |
| 11 | బుధ | పూర్ణిమ | పునర్వసు | రా09.58 | నుంచి | 11.04 | వరకు |
| 12 | గురు | బ.పాడ్యమి | పునర్వసు | ఉ07.10 | నుంచి | 08.47 | వరకు |
| 12 | గురు | బ.పాడ్యమి | పుష్యమి | మ03.01 | నుంచి | 05.06 | వరకు |
| 13 | శుక్ర | బ.విదియ | పుష్యమి | ఉ07.06 | నుంచి | 08.43 | వరకు |
| 14 | శని | బ.తదియ | మఘ | ఉ10.01 | నుంచి | 12.49 | వరకు |
| 14 | శని | బ.తదియ | మఘ | మ02.42 | నుంచి | 04.58 | వరకు |
| 16 | సోమ | బ.పంచమి | ఉత్తర | ఉ9.53 | నుంచి | మ12.20 | వరకు |
| 16 | సోమ | బ.పంచమి | ఉత్తర | రా09.38 | నుంచి | 10.09 | వరకు |
| 18 | బుధ | బ.సప్తమి | హస్త | ఉ09.45 | నుంచి | 11.40 | వరకు |
| 18 | బుధ | బ.సప్తమి | చిత్ర | మ02.26 | నుంచి | 04.42 | వరకు |
| 19 | గురు | బ.అష్టమి | చిత్ర | మ03.06 | నుంచి | 03.41 | వరకు |
| 20 | శుక్ర | బ.నవమి | స్వాతి | ఉ10.56 | నుంచి | 12.23 | వరకు |
| 20 | శుక్ర | బ.నవమి | స్వాతి | మ02.18 | నుంచి | 04.34 | వరకు |
| 21 | శని | బ.దశమి | అనూరాధ | రా09.35 | నుంచి | 10.25 | వరకు |
| 22 | ఆది | బ.ఏకాదశి | అనూరాధ | మ12.18 | నుంచి | 02.11 | వరకు |
| 22 | ఆది | బ.ఏకాదశి | అనూరాధ | సా04.27 | నుంచి | 06.52 | వరకు |
| 22 | ఆది | బ.ఏకాదశి | అనూరాధ | రా09.15 | నుంచి | 10.21 | వరకు |

## శ్రీ దుర్ముఖి - మాఘమాసం

**2017 జనవరి 29 నుంచి ఫిబ్రవరి 20 వరకు శుభసమయాలు**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 29 | ఆది | శు.విదియ | శతభిషం | ఉ10.21 | నుంచి | 03.50 | వరకు |
| 29 | ఆది | శు.తదియ | శతభిషం | రా08.47 | నుంచి | 11.10 | వరకు |
| 01 | బుధ | శు.పంచమి | రేవతి | ఉ10.09 | నుంచి | 11.44 | వరకు |
| 01 | బుధ | శు.షష్ఠి | రేవతి | రా09.45 | నుంచి | 10.58 | వరకు |
| 02 | గురు | శు.సప్తమి | అశ్వని | మ11.15 | నుంచి | 01.27 | వరకు |
| 02 | గురు | శు.సప్తమి | అశ్వని | మ03.43 | నుంచి | 06.08 | వరకు |
| 05 | ఆది | శు.దశమి | రోహిణి | ఉ09.54 | నుంచి | 01.16 | వరకు |
| 05 | ఆది | శు.దశమి | రోహిణి | సా04.45 | నుంచి | 05.56 | వరకు |
| 05 | ఆది | శు.దశమి | రోహిణి | రా08.20 | నుంచి | 10.42 | వరకు |
| 06 | సోమ | శు.ఏకాదశి | మృగశిర | ఉ09.49 | నుంచి | 12.25 | వరకు |
| 06 | సోమ | శు.ఏకాదశి | మృగశిర | మ03.28 | నుంచి | 05.23 | వరకు |
| 06 | సోమ | శు.ఏకాదశి | మృగశిర | రా08.16 | నుంచి | 10.38 | వరకు |
| 08 | బుధ | శు.త్రయోదశి | పునర్వసు | మ12.30 | నుంచి | 02.51 | వరకు |
| 08 | బుధ | శు.త్రయోదశి | పునర్వసు | మ03.20 | నుంచి | 05.45 | వరకు |
| 08 | బుధ | శు.చతుర్దశి | పుష్యమి | రా08.08 | నుంచి | 10.30 | వరకు |
| 09 | గురు | శు.చతుర్దశి | పుష్యమి | మ11.10 | నుంచి | 01.00 | వరకు |
| 09 | గురు | శు.చతుర్దశి | పుష్యమి | మ03.30 | నుంచి | 05.41 | వరకు |
| 10 | శుక్ర | బ.పాడ్యమి | మఘ | రా08.00 | నుంచి | 10.23 | వరకు |
| 11 | శని | బ.పాడ్యమి | మఘ | ఉ09.30 | నుంచి | 12.52 | వరకు |
| 12 | ఆది | బ.తదియ | ఉత్తర | రా07.53 | నుంచి | 10.15 | వరకు |
| 13 | సోమ | బ.తదియ | ఉత్తర | ఉ09.22 | నుంచి | 12.25 | వరకు |
| 13 | సోమ | బ.చవితి | హస్త | రా08.30 | నుంచి | 10.11 | వరకు |
| 15 | బుధ | బ.పంచమి | చిత్ర | ఉ09.15 | నుంచి | 11.44 | వరకు |
| 15 | బుధ | బ.పంచమి | చిత్ర | మ02.52 | నుంచి | 05.17 | వరకు |
| 15 | బుధ | బ.షష్ఠి | చిత్ర | రా07.40 | నుంచి | 10.03 | వరకు |
| 16 | గురు | బ.షష్ఠి | స్వాతి | ఉ09.10 | నుంచి | 10.15 | వరకు |
| 16 | గురు | బ.సప్తమి | స్వాతి | రా07.56 | నుంచి | 09.59 | వరకు |
| 18 | శని | బ.అష్టమి | అనూరాధ | రా07.30 | నుంచి | 11.47 | వరకు |
| 20 | సోమ | బ.దశమి | మూల | మ03.26 | నుంచి | 04.58 | వరకు |
| 20 | సోమ | బ.దశమి | మూల | రా07.21 | నుంచి | 08.10 | వరకు |

## శ్రీ దుర్ముఖి - ఫాల్గుణమాసం

**2017 ఫిబ్రవరి 27 నుంచి మార్చి 23 వరకు శుభసమయాలు**

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 27 | సోమ | శు.విదియ | ఉత్తరాభాద్ర | సా06.53 | నుంచి | 11.41 | వరకు |
| 01 | బుధ | శు.చవితి | రేవతి | ఉ08.20 | నుంచి | 11.41 | వరకు |
| 01 | బుధ | శు.చవితి | అశ్వని | మ01.57 | నుంచి | 04.22 | వరకు |
| 01 | బుధ | శు.చవితి | అశ్వని | రా09.08 | నుంచి | 11.33 | వరకు |
| 02 | గురు | శు.పంచమి | అశ్వని | ఉ10.58 | నుంచి | 12.10 | వరకు |
| 04 | శని | శు.సప్తమి | రోహిణి | ఉ09.37 | నుంచి | 11.29 | వరకు |
| 05 | ఆది | శు.అష్టమి | మృగశిర | ఉ09.33 | నుంచి | 12.48 | వరకు |
| 05 | ఆది | శు.నవమి | మృగశిర | రా08.52 | నుంచి | 10.48 | వరకు |
| 08 | బుధ | శు.ద్వాదశి | పుష్యమి | ఉ09.21 | నుంచి | 11.39 | వరకు |
| 08 | బుధ | శు.ద్వాదశి | పుష్యమి | రా08.40 | నుంచి | 11.05 | వరకు |
| 10 | శుక్ర | శు.చతుర్దశి | మఘ | ఉ09.21 | నుంచి | 12.25 | వరకు |
| 10 | శుక్ర | శు.చతుర్దశి | మఘ | రా08.32 | నుంచి | 10.57 | వరకు |
| 12 | ఆది | బ.పాడ్యమి | ఉత్తర | ఉ10.05 | నుంచి | 12.40 | వరకు |
| 12 | ఆది | బ.పాడ్యమి | ఉత్తర | రా09.25 | నుంచి | 11.20 | వరకు |
| 13 | సోమ | బ.విదియ | హస్త | ఉ10.01 | నుంచి | 11.54 | వరకు |
| 13 | సోమ | బ.విదియ | హస్త | రా09.21 | నుంచి | 11.46 | వరకు |
| 15 | బుధ | బ.తదియ | స్వాతి | ఉ09.54 | నుంచి | 10.47 | వరకు |
| 15 | బుధ | బ.చవితి | స్వాతి | ఉ10.48 | నుంచి | 12.35 | వరకు |
| 15 | బుధ | బ.చవితి | స్వాతి | రా09.13 | నుంచి | 11.09 | వరకు |
| 16 | గురు | బ.చవితి | స్వాతి | ఉ09.50 | నుంచి | 11.02 | వరకు |
| 17 | శుక్ర | బ.షష్ఠి | అనూరాధ | రా09.07 | నుంచి | 11.30 | వరకు |
| 18 | శని | బ.షష్ఠి | అనూరాధ | ఉ09.42 | నుంచి | 01.22 | వరకు |
| 19 | ఆది | బ.అష్టమి | మూల | రా08.57 | నుంచి | 11.22 | వరకు |
| 20 | సోమ | బ.అష్టమి | మూల | మ11.26 | నుంచి | 01.23 | వరకు |
| 20 | సోమ | బ.అష్టమి | మూల | రా08.53 | నుంచి | 09.30 | వరకు |
| 22 | బుధ | బ.దశమి | ఉత్తరాషాఢ | ఉ09.26 | నుంచి | 10.10 | వరకు |
| 22 | బుధ | బ.దశమి | ఉత్తరాషాఢ | రా08.45 | నుంచి | 11.10 | వరకు |
| 23 | గురు | బ.ఏకాదశి | శ్రవణం | ఉ09.22 | నుంచి | 10.55 | వరకు |
| 23 | గురు | బ.ఏకాదశి | శ్రవణం | రా08.41 | నుంచి | 11.06 | వరకు |

## కుజదోషముందని భయపడవద్దు

జన్మలగ్నం నుంచి 2,4,7,8,12 స్థానాలలో కుజుడుంటే కుజ దోషముందని భావం. దీని ప్రభావం కేవలం కుజమహాదశ సమయంలోనే వచ్చును. ఇతర దశలలో రానే రావు. ఇతర గ్రహస్థితులచే కూడా వ్యతిరేకతలు సంభవిస్తుంటాయి. ఇది తెలియక కుజదోష ప్రభావంతోనే.. సమస్యలు వచ్చాయని చాలామంది భయపడుతూ, మానసికవేదనతో ఉండటం ఈ మధ్యకాలంలో పరిపాటయినది.

కుజదోషం పలుసందర్భాలలో భంగమవుతుంటుంది. ప్రతి వారు ధైర్యంగా ముందుకెళ్ళుటకు, వారికున్న అపోహలు తొల గించుటకై చేసే చిన్ని ప్రయత్నమే ఈ శీర్షిక. కుజుడు కర్కాటక సింహరాశులలో లేక లగ్నాలలో సంచారముంటే కుజదోషం భంగ మగును. మేష వృశ్చిక మకర సింహ ధనూ మీన లగ్నాలు, రాశుల యందు జన్మించిన జాతకులకు కూడా కుజదోషం భంగమగును.

మిధున కన్య రాశులలో మరియు లగ్నాలలో జన్మించి, జన్మ లగ్నానికి ద్వితీయ స్థానంలో కుజుడు ఉంటే 2వస్థాన కుజదోషం భంగమగును. మకర కర్కాటక లగ్నాలలో లేక రాశులలో జన్మించి, సప్తమ స్థానంలో కుజుడుంటే 7వస్థాన కుజదోషం భంగమగును. ధనూ మీన లగ్నాలు మరియు రాశులలో జన్మించి అష్టమస్థానంలో కుజగ్రహ సంచారముంటే, 8వస్థాన కుజదోషం ఉండదు. మిధున కన్య లగ్నాలు మరియు రాశులలో జన్మించి 12వస్థానంలో కుజదోషముంటే భంగమగును. ఇలా విశ్లేషిస్తే 95శాతం వారికి కుజదోషమున్నప్పటికీ, అది సంపూర్ణంగా భంగమవుతుంది.

కుజదోషముంటే కుజమహాదశలోనే ప్రభావాన్ని చూపిస్తుంది. ఈ కుజమహాదశ ఏయే నక్షత్రాల వారికి ఏయే వయసులలో వస్తుందో తెలుసుకుంటే ఇంకా పూర్తి వివరాలు తెలుసుకున్న వారవుతారు. చిత్ర ధనిష్ఠ మృగశిర నక్షత్ర జాతకులకు జన్మించిన తోడనే కుజమహాదశ ప్రారంభమగును. ఏపాదంలో జన్మించినప్ప టికీ, 7 సంవత్సరాల వయసు లోపలే కుజమహాదశ వెళ్లును. ఈ సమయంలో వివాహాలు చేయరు. కనుక చిత్ర ధనిష్ట మృగశిర జాతకులకు కుజదోషముందనే భయాన్ని, బెంగను విడనాడండి.

రోహిణి హస్త శ్రవణా నక్షత్ర జాతకులకు జన్మతోనే చంద్ర మహాదశ ప్రారంభమై, ఆపై కుజమహాదశ ప్రవేశించును. మొత్తం మీద 17 సంవత్సరాలకు కుజమహాదశ వెళ్లును. వివాహం 17 సంవత్సరాల తదుపరే చేస్తారు. రోహిణి హస్త శ్రవణం జాతకులు కూడా కుజదోషం ఉందనే భయాన్ని విడనాడండి.

ఆరుద్ర స్వాతి శతభిషా జాతకులకు నిజంగానే కుజదోషముండి భంగం కాకుండా ఉంటే, ప్రభావం కుజమహాదశలోనే వస్తుంది. 113సం॥లు జీవిస్తే కుజమహాదశ వస్తుంది. అది జరిగేపని కాదు.

పునర్వసు విశాఖ పూర్వాభాద్ర జాతకులు 90సం॥లు వయసు దాటితే కుజదశ వస్తుంది. దోషముంటే 90 సం॥లు ఆగాలి. సమయం వృధా చేసుకుని కుజదోషముందని ఆలోచించవద్దు.

పుష్యమి అనూరాధ ఉత్తరాభాద్ర జాతకులు వృద్ధాప్యంలోనే కుజదోషం వర్తిస్తుంది. అది సహజమే. కల్తీఆహారం తింటూ... ఈరోజులలో కుజదోషముందని ఆలోచించవద్దు.

ఆశ్లేష జ్యేష్ఠ రేవతి నక్షత్రాలు కుజదోష భంగ నక్షత్రాలు. అనగా ఆశ్లేష కర్కాటకరాశి, జ్యేష్ఠ వృశ్చికరాశి, రేవతి మీనరాశి. ఈ రాశి జాతకులకు కుజదోషమున్ననూ భంగమగునని శాస్త్రవచనం.

అశ్వని భరణి కృత్తిక1వపాద జాతకులు కుజుని స్వస్థానమైన మేషరాశిలోను, మఖ పుబ్బ ఉత్తర 1వపాద జాతకులు కుజుని మిత్రస్థానమైన సింహరాశిలోను, మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢ 1వపాద జాతకులు మరో మిత్రస్థానమైన ధనూరాశిలో జన్మించారు. ఈ జాతకులకు కుజదోషమున్నప్పటికీ, కుజ స్వస్థాన మిత్రస్థానాలలో జన్మించినందున, కుజదోషం భంగమగునని శాస్త్ర వచనం.

చివరగా వృషభరాశి కృత్తిక 2,3,4 పాద జాతకులు, కన్యారాశి ఉత్తర 2,3,4పాద జాతకులు, మకరరాశి ఉత్తరాషాఢ 2,3,4 పాదాలలో జన్మించిన జాతకులు మాత్రమే కుజదోష ఆలోచన చేయాలి. అయినా వీరందరికీ 21 సంవత్సారాల వయసు రాగానే కుజమహాదశ వెళ్లిపోతుంది. కనుక 22 సంవత్సరాల వయసు రాగానే వివాహం చేసుకోండి. – శ్రీనివాసగార్గేయ

## చవితి, అష్టమి, నవమి... దోషములా ?

చవితి షష్ఠి అష్టమి నవమి ద్వాదశి చతుర్దశి తిధులనగానే సహజంగా భయపడుతూ ఉంటారు. ఈ తిధులలో ముహూర్తాలు చేయకూడదని చాలామంది భావిస్తుంటారు. చవితి ప్రారంభమైన 10 గంటల తదుపరి, షష్ఠి ప్రారంభమైన 2 గంటల తదుపరి, అష్టమి ద్వాదశి తిథులు ప్రారంభమైన 5గం॥36ని॥ల తదుపరి, నవమి చతుర్దశి తిథులు ప్రారంభమైన 4గం॥24ని॥ల తదుపరి శుభప్రదమని శాస్త్ర నిర్దేశం. దీనికి ముందున్న సమయంలో ముహూర్తాలున్ననూ దోషమని భావం కాదు. శుభ గ్రహసంచారం చేత ఇట్టి దోషాలుండవని శాస్త్ర నిర్దేశము. గ్రహబలాబలాలను గ్రహించే ముహూర్తములను పండితులు నిర్ణయిస్తారు.

## సోమవారం వివాహం ప్రశస్థమే

సోమవారం వివాహమునకు యోగ్యతకాదని, నిషిద్ధమని పండితులు వ్యాఖ్యానిస్తుంటారు. పూర్వకాలామృతము, పురుషార్ధ చింతామణి అనే రెండే రెండు గ్రంధాలలోనే సోమవారం ప్రశస్థము కాదని ఉన్నది. ఈ 2గ్రంధాలలో సోమే సపత్నీప్రదం అని ముద్రితమైనది. సు అక్షరానికి బదులుగా స అక్షరము ముద్రితమైనందున, పలు చోట్ల సోమవారం వివాహానికి తగదని భావిస్తుంటారు. కానీ అత్యధిక ప్రామాణిక గ్రంధాలు సోమవార వివాహం సమ్మతమని మహాప్రశస్థమని అత్యంత శుభకరమని స్పష్టం చేసినవి.

ధర్మసింధు నిర్ణయసింధు అగ్నిపురాణం బృహద్దైవజ్ఞరంజనం బృహస్సంహిత వాయు పురాణం నారదసంహిత గర్గసంహిత ముహూర్తమార్తాండం ముహూర్తపారిజాతం రత్నసారం ముహూర్త ప్రదర్శిని వశిష్ఠసంహిత ముహూర్తచింతామణి ముహూర్తదర్పణం మానసారం ముహూర్తసంగ్రహం జ్యోతిషరత్నమాల రాజమార్తాండం ముహూర్తరత్నావళి వివాహబృందావనం జ్యోతిర్విద్యాభరణం జ్యోతి ర్నిబంధనం ముహూర్తముక్తావళి ముహూర్తగణపతి ముహూర్త ప్రదీపం విద్యామాధవీయం సనత్కుమారసంహిత మరియు రత్నమాల అనబడే ప్రామాణిక గ్రంధముల యందు సోమవారం వివాహం చేయుట ప్రశస్థముతో కూడినట్లుగా తెలియజేయబడినది. సోమ వారం నిషిద్ధమని చెప్పిన పూర్వకాలామృతం పురుషార్ధ చింతామణి అనుగ్రంధములకు ఆధికృత లేనే లేదని పండితులు నిస్సంకోచంగా అంగీకరించవలసి ఉన్నది. కనుక అధిక గ్రంధ నిర్ణయానుసారంగా సోమవారం వివాహానికి ప్రశస్థమే.

## ఏక నక్షత్ర నిర్ణయము

అశ్వని కృత్తిక రోహిణి మృగశిర ఆర్ద్ర పునర్వసు పుష్యమి మఘ పుబ్బ ఉత్తర హస్త చిత్ర విశాఖ అనూరాధ పూర్వాషాఢ ఉత్తరాషాఢ శ్రవణం ఉత్తరాభాద్ర రేవతి నక్షత్రాలు స్త్రీ పురుషులకు వివాహాలలో ఒకటైనచో శుభమే. కృత్తిక మృగశిర పునర్వసు ఉత్తర చిత్ర విశాఖ ఉత్తరాషాఢలు రెండురాశుల సంబంధ నక్షత్రాలలో స్త్రీ పురుషులు జన్మించినచో మొదటిది పురుషరాశి, రెండవది స్త్రీరాశి అయినచో మహా శుభప్రదము. మొదటిది స్త్రీరాశి, రెండవది పురుషరాశిగా ఉన్నచో ఫలప్రదమే, దోషముకాదు. వివాహ నిర్ణయాలలో ఇతర జాతక గ్రహసంచార స్థితిగతులన్నింటినీ పరిగణనలోనికి తీసుకొని శుభములను పొందేది.

## త్రిజ్యేష్ఠ నిర్ణయములు

వివాహ నిర్ణయాలలో వధూవరులకు జ్యేష్ఠానిర్ణయములు జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయించాలి. త్రిజ్యేష్ఠలు, జ్యేష్ఠా చతుష్టములు, జ్యేష్ఠా పంచకములు కూడవని శాస్త్రనిర్ణయం. కనుక దిగువ తెల్పిన రీతిలో జ్యేష్ఠా నిర్ణయములను విశ్లేషించటం జరుగును.

జ్యేష్ఠులనగా తొలిచూలు పిల్లలని అర్థము. ముందు ఒకరు లేక చాలామంది జన్మించి మరణించినచో ఆ మరణించిన వారిలో ప్రథములే జ్యేష్ఠులగుదురు. జీవించి ఉన్న వారిననుసరించి జ్యేష్ఠా నిర్ణయములు చేయరాదు. జన్మక్రమం విడిచి స్త్రీ పురుషులలో జ్యేష్ఠా నిర్ణయము శాస్త్ర విరుద్ధము. జీవించి ఉన్ననూ, మరణించి ననూ ప్రథమ గర్భమున జన్మించినటువంటి వారే జ్యేష్ఠులని భావం.

1. వధూవరులిరువురూ జ్యేష్ఠులై జ్యేష్ఠమాసంలో వివాహం త్రిజ్యేష్ఠ. 2. వధూవరులలో ఒకరు జ్యేష్ఠులై, ఒకరిది జ్యేష్ఠా నక్షత్రమై, జ్యేష్ఠమాస వివాహం త్రిజ్యేష్ఠే. 3. వధూవరులిరువురూ జ్యేష్ఠులు కాకున్ననూ జ్యేష్ఠమాసంలో జన్మించి, జ్యేష్ఠమాస వివాహం జరగటం త్రిజ్యేష్ఠే. 4. వధూవరులిరువురూ జ్యేష్ఠులుగా కున్ననూ వారి జన్మనక్షత్రాలు జ్యేష్ఠలై జ్యేష్ఠమాస వివాహం త్రిజ్యేష్ఠయే. 5. వధూవరిలురువురునూ జ్యేష్ఠులై, ఒకరిది జ్యేష్ఠానక్షత్రమై జ్యేష్ఠమాస వివాహము జ్యేష్ఠా చతుష్టయం. 6. వధూవరులిరువురూ జ్యేష్ఠులై, జ్యేష్ఠ నక్షత్ర జాతకులై జ్యేష్ఠమాస వివాహాన్ని జ్యేష్ఠా పంచకమందురు.

## అభ్యంగన స్నానం

సూర్యసంక్రమణ మాసశివరాత్రి దినములలో, రాత్రి సమయాలలో, పితృకార్యములు ఆచరించే రోజును, ముఖ్య ప్రయాణరోజులలో, వ్రత దీక్షలు చేపట్టే రోజులయందు, పాడ్యమి షష్ఠి అష్టమి ద్వాదశి చతుర్దశి పూర్ణిమ అమావాస్య తిథులయందు, అశ్వని ఆర్ద్ర స్వాతి జ్యేష్ఠ శ్రవణానక్షత్ర రోజులందు, మంగళ గురువారములందు, కృష్ణాష్టమి పర్వదినమందు తలంటుకుని అభ్యంగనస్నానం చేయుట శుభప్రదం కాదు. వివాహాది శుభకార్యాలందు, మకరసంక్రమణానికి ముందుదినమైన భోగిరోజున, తెలుగు సంవత్సరాది ఉగాది రోజున, నరకచతుర్దశి స్వాతి నక్షత్రమందును, కర్కాటక సంక్రమణమునకు 2వరోజున, జాతాశౌచ మృతాశౌచ నివృత్తి రోజులయందు, క్షురకర్మ చేయించిన పిదప అభ్యంగనస్నానాచరణ తప్పనిసరని శాస్త్ర నిర్దేశం. ధనకాముకులగు వారు శుక్రవారం మధ్యాహ్నం తదుపరి అభ్యంగన స్నానము ఆచరించినచో విశేష శుభప్రదము.

## తారాబల గణనలో శుభాశుభాలు

1. జన్మతార లెక్కించే సమయంలో నక్షత్ర 3వపాదమునందు తొలి 2గంటల 48ని॥లు మాత్రమే దోషము. మిగిలిన సమయమంతా శుభకరము. 2. సంపత్తార శుభకరమైనది. 3. విపత్తార లెక్కించే సమయంలో నక్షత్ర 1వపాదంలో తొలి 1గంట 12నిముషాలు మాత్రమే దోషము. మిగిలిన సమయమంతయూ శుభకరము. 4. క్షేమతార శుభకరమైనది. 5. ప్రత్యక్తార లెక్కించే సమయంలో నక్షత్ర 4వపాదమునందు తొలి 3గంటల 12నిముషాలు మాత్రమే దోషము. మిగిలిన సమయమంతయూ శుభకరము. 6. సాధనతార శుభకరమైనది. 7. నైధనతార లెక్కించే సమయంలో నక్షత్ర 2పాదమునందు తొలి 3గంటల 12నిముషాలు మాత్రమే దోషము. మిగిలిన సమయమంతయూ శుభకరము. 8. మిత్రతార శుభకరమైనది. 9. పరమ మిత్రతార కూడా శుభకరమైనది.

## నవవధూ ప్రవేశం

వివాహం తదుపరి 16 రోజుల లోపల సరిదినములందే నూతన వధూగృహప్రవేశం చేయవచ్చును. నూతన వధువు పగటి సమయాలలో అత్తవారింటిలో అడుగిడరాదు. సూర్యాస్తమయం నుంచి మరునాటి సూర్యోదయం లోపల ప్రశస్తము. అనగా వివాహం తదుపరి మొదటి 6,8,10 దినములందు వధువు నూతన గృహప్రవేశం చేసినయెడల, ఆ దినములు తిథి వార నక్షత్ర యోగ కరణములచే శుద్ధము కాకపోయిననూ, ఆరోజు అమావాస్య అయిననూ శుభప్రదమే.

అలాకాక మొదటినెలలో వధువు గృహప్రవేశము జరగనిచో బేసినెలలయందు శ్రవణం ధనిష్ఠ మూల మఘ స్వాతి నక్షత్రాలు రిక్త తిథులు విడిచి నూతన వధువు ప్రవేశం చేయవలయును. ఇది మొదటి సంవత్సరము, మూడవ సంవత్సరము, ఐదవ సంవత్సరమునకు వర్తించును. మొదటి 16 దినములు తదుపరి గృహప్రవేశము చేసినచో పంచాంగశుద్ధితో పాటు వర్జ్య దుర్ము హూర్తములను లేకుండా చూసుకొనాలి.

గృహప్రవేశ సమయంలో ఉన్న లగ్నానికి 8వస్థానంలో ఏ గ్రహములు ఉండకూడదు. ఐతే ఆయుష్కారకుడైన శని అష్టమ స్థానంలో ఉన్నచో భయపడాల్సిన అవసరం లేదు. పూర్ణ ఆయుర్దాయాన్ని అందిస్తాడు గనుక అష్టమశని అనర్థకము కాదు. అష్టమంలో శుభ గ్రహసంచారముండుట మధ్యమప్రదమే కాని నింద్యము కాదు.

## సంక్రమణ పుణ్యకాల విజ్ఞానము

జగద్రక్షుడైన శ్రీ సూర్యనారాయణుడు ఒక్కోరాశిలో ప్రవేశం చేయటాన్ని సంక్రమణం అంటారు. ఆవిధంగా ద్వాదశరాశులలో సంక్రమించే సమయానికి ముందు వెనుకలలో కొన్ని కొన్ని ఘడియలు పుణ్యకాలాలుగా ఉండునని శాస్త్ర నిర్దేశం. ఒక ఘడియ అనగా 24 నిముషాలు. దిగువ తెల్పినరీతిలో ద్వాదశరాశుల సంక్రమణ సమయములకు పుణ్యకాలాలుండును.

1. మేషరాశి ప్రవేశ సంక్రమణాన్ని విషువము అంటారు. పూర్వా పరాలలో 10 ఘడియలు పుణ్యకాలం. 2. వృషభప్రవేశాన్ని హరి పదము అంటారు. పూర్వము మాత్రమే 16 ఘడియలు పుణ్యకాలం. 3. మిథునరాశి ప్రవేశాన్ని షడశీతి అంటారు. పరములో 16 ఘడియలు పుణ్యకాలం. 4. కర్కాటకరాశి ప్రవేశాన్ని అయనమందురు. పూర్వములో 30 ఘడియలు పుణ్యకాలం. దీనినే దక్షిణాయనమందురు. 5. సింహరాశి ప్రవేశాన్ని హరిపదము అందురు. పరములో 16 ఘడియలు పుణ్యకాలం. 6. కన్యారాశి ప్రవేశాన్ని షడశీతి అంటారు. పరములో 16 ఘడియలు పుణ్యకాలం. 7. తులారాశి ప్రవేశాన్ని విషువమందురు. పూర్వా పరాలలో 15 ఘడియలు పుణ్యకాలం. 8. వృశ్చికరాశి ప్రవేశాన్ని హరిపదమందురు. పూర్వ పరాలలో 16 ఘడియలు పుణ్యకాలం. 9. ధనస్సురాశి సంక్రమణాన్ని షడశీతి అందురు. పరములో 16 ఘడియలు పుణ్యకాలం. 10. మకరరాశి ప్రవేశాన్ని అయనమందురు. పరములో 30 ఘడియలు పుణ్యకాలం. ఇదే ఉత్తరాయణ పుణ్యకాలము. 11. కుంభరాశి ప్రవేశాన్ని హరిపదమందురు. పూర్వములో 16 ఘడియలు పుణ్యకాలం. 12. మీనరాశి ప్రవేశమే షడశీతి. పరములో 16 ఘడియలు పుణ్యకాలం.

## కనుమ దోషము

మరణము, శవదహనము, సపిండీకరణ, జాతర, సూర్య సంక్రమణ, గ్రహణదినములకు 2వరోజును కనుమ అందురు. వ్యవహారికంగా పల్లెసీమలందు మరణము సంభవిస్తే, మరణంతో సంబంధములేని వ్యక్తులతో పాటు పల్లె యావత్తు కనుమగా పాటించటం ఆనవాయితీ. ఇది సరికాదు. మరణము జరిగిన ఇంటివారే 2వ రోజును కనుమగా భావించి విసర్జించాలి. జాతరలో పాల్గొనిన వారు మాత్రమే కనుమను తప్పక పాటించాలని శాస్త్ర నిర్ణయము. సంక్రమణ, గ్రహణాలలో సర్పులు పాటించాలి.

## పితృతిధి నిర్ణయము

పితృకార్యమును ఆచరించుటకు అపరాహ్ణకాలము సరియైనదని ధర్మశాస్త్ర గ్రంధకర్తలందరూ నిర్ణయించారు. ఏ తిథి కావలయునో ఆ తిథి ఉన్నరోజున సూర్యోదయ సూర్యాస్తమయాలను తెల్సుకుని దినప్రమాణమును 5 భాగాలుగా చేయాలి. 1. ప్రాతఃకాలము 2. సంగవకాలము 3. మధ్యాహ్నకాలము 4. అపరాహ్ణకాలము 5. సాయాహ్నకాలము. ఈ ఐదు కాలాలలో పితృతిధి అపరాహ్ణకాలంలో ఉండి తీరాలి. తిధి నిర్ణయంలో తిరిగి అపరాహ్ణకాలమును 6 విధములుగా నిర్ణయించారు. కనుక ఖచ్చిత తిధి నిర్ణయాలకోసం దృగ్గణిత పంచాంగాన్నే అనుసరించండి. పూర్వగణితాన్ని అనుసరించిన కారణంగా, ఒక్కోసారి పితృకార్య తిధి అపరాహ్ణంలో ఉండక పోవచ్చును. అప్పుడు పితృకార్యము వృధా పోయే అవకాశముంది.

1. ఈరోజు అపరాహ్ణకాలములో తిధి ఉండి రేపు అపరాహ్ణంలో తిధి లేని యెడల, అపరాహ్ణంలో ఉన్న ఈరోజే ఆబ్దికము పెట్టాలి.

2. ఈరోజు అపరాహ్ణకాలమున తిధి లేక, రేపు అపరాహ్ణ కాలమున తిధి ఉన్న యెడల, అపరాహ్ణకాలమున్న రేపే ఆబ్దికము.

3. రెండురోజుల అపరాహ్ణములలో తిధి పూర్తిగా ఉన్న సందర్భాలలో, 2వరోజునే ఆబ్దికమును నిర్వహించాలి.

4. రెండురోజుల అపరాహ్ణములలో తిధి సమానముగా ఉన్నచో 2వరోజునే ఆబ్దికము. అనగా మొదటిరోజు అపరాహ్ణములో ఎన్ని నిముషాలుండునో, రెండవరోజు కూడా అన్నే నిముషాలుండునని భావము. (3వపాయింట్‌కి, 4వపాయింట్‌కి వ్యత్యాసం ఉంది)

5. రెండురోజుల అపరాహ్ణాలలో తిధి హెచ్చుతగ్గులున్నచో, ఎక్కువ తిధి అపరాహ్ణవ్యాప్తి గల దినమునే ఆబ్దికము.

6. రెండురోజులలో అపరాహ్ణకాలమున తిధి అసలు లేనపుడు మొదటిరోజు సాయహ్నమందలి తొలి 2ఘడియలు తిధి ఉంటే ఈరోజే ఆబ్దికము. అనగా సాయహ్నం ప్రారంభమైన 48నిముషాలలో తిధి ఉండినచో ఈరోజే ఆబ్దికము. అలాకాక ఈ 48 నిముషాలు (2ఘడియలు) దాటిన తర్వాత తిధి వచ్చినచో రేపటిరోజునే ఆబ్దికం.

పై విధంగా అపరాహ్ణమును ఆరు విధములుగా ధర్మసింధు మొదలైన ధర్మశాస్త్రాలు పేర్కొన్నవి. మీ మీ ప్రాంత సూర్యోదయ సూర్యాస్తమయాలను బట్టి దినప్రమాణమును ఉంటుంది. ఒక్కోసారి హైద్రాబాద్‌కు పితృతిధి ఒకరోజు ఉంటే విశాఖపట్నానికి మరోరోజు ఉండే అవకాశముంది. గనుక పాఠకులు గమనించి ఆచరించేది.

## ఖచ్చిత రాహుకాల వివరణ

సంవత్సరం పొడవునా ఒకవారంలో ఒకేసమయంలో రాహుకాల సమయాన్ని పాటించటం పూర్తి అశాస్త్రీయం. రాహుకాలమనగా పగటిదిన ప్రమాణాన్ని 8 సమభాగాలు చేసి ఒక్కోవారంలో ఒక్కోసమయంలో రాహువు అధిపతిగా ఉండేకాలమే రాహుకాలం.

తమిళప్రాంతంలో దినప్రమాణాన్ని ఎలాంటి మార్పులు చేర్పులు చేయకుండా సంవత్సరం పొడవునా ఒకేలా ఆచరించటం విచారకరం. ఏరోజుకారోజు రాహుకాలం గణించే తీరిక ఓపిక లేక తమిళరాజ్యంలో.... ఒకేలా రాహుకాలాన్ని పాటిస్తున్నారు. సూర్యుడు 6గంటలకు ఉదయించి సాయంత్రం 6గంటలకు అస్తమిస్తే దినప్రమాణం 12 గంటలన్నమాట. 8 సమభాగాలు చేయగా ఒక్కోభాగానికి ఒకటిన్నర గంట వచ్చును. ఈ 8 సమభాగాలలో మొదటి గంటన్నర సమయాన్ని ఏవారానికి కేటాయించలేదు. 2వభాగాన్ని సోమవారానికి, 3వ భాగాన్ని శని వారానికి, 4వభాగాన్ని శుక్రవారానికి, 5వభాగాన్ని బుధవారానికి, 6వభాగాన్ని గురువారానికి, 7వభాగాన్ని మంగళవారానికి, 8వభాగాన్ని ఆదివారానికి కేటాయించటం జరిగింది.

సూర్యోదయ సూర్యాస్తమయాలు ఉదయం 6గంటలు, సాయంత్రం 6గంటలుంటే రాహుకాలం ఎలా ఉంటుందని చెప్పే ఓ ఉదాహరణాన్ని మనవారందరూ గుడ్డిగా పాటిస్తున్నారు. కనుక చాంద్రమానస్థులకు ముహుర్తాలలో రాహుకాల ప్రసక్తి లేకపోయిన ప్పటికీ తెలుసుకున్నందున తప్పేమీ లేదు.

ఉదాహరణకు ఓ రోజున సూర్యోదయం ఉదయం 5గం॥46ని॥లకు సూర్యాస్తమం 6గం॥42ని॥లకు ఉన్నప్పుడు, దినప్రమాణం 12గం॥56ని॥లు అవుతుంది. దీనిని 8 భాగాలు చేయగా ఒక్కో భాగానికి 1గం॥37ని॥లు వచ్చును. పైనతెల్పిన భాగాల వివరంగా ఆయా వారాలకు రాహుకాలాన్ని గణితం చేసుకోవాలి. ఇదేవిధంగా యమగండకాలం కూడా ఏరోజుకారోజు మార్పు చెందుతుంటుంది.

పులిని చూసి నక్క వాతపెట్టుకున్న చందంగా దక్షిణాది వాసులను చూసి చాంద్రమానస్థులు రాహుకాలాన్ని, యమగండ కాలాన్ని పాటించాలంటారు. ధర్మసింధు, నిర్ణయసింధు, కాలామృతం, ముహూర్తమార్తాండం, ముహుర్త చింతామణి, వశిష్ఠ నారద భృగు గర్గ సంహితాది గ్రంధాలలో రాహు,యమగండకాలముల ప్రస్తావన లేదు. కనుక వివాహాది ముహూర్తాలు రాహుకాలాలలో ఉన్నచో దోషమని భావించకూడదని పాఠకులు గమనించాలి.

## శుక్రవారం శాంతి దీప ప్రజ్వలన

జాతకాలలో శుక్ర రాహువులు కలిసిన, శుక్ర మహాదశలో రాహు అంతర్దశ, రాహుమహాదశలో శుక్ర అంతర్దశ జరుగుచున్న, శుక్రుడు మూల స్వాతి ఆరుద్ర శతభిషా నక్షత్రాలలో ఉన్ననూ, వివాహ సమస్యలు ఏర్పడి మనశ్శాంతి లేకుండా ఉండును. మనస్పర్ధలతో ఉన్న దంపతులు, అశాంతితో ఉన్న వస్త్ర పసిడి కంప్యూటర్ ఉపకరణ విలాస వస్తు విక్రేతలు, సాఫ్ట్‌వేర్ రంగ వాసులు ప్రతిశుక్రవారం రాహుకాల సమ యంలో శాంతిదీపాన్ని భక్తితో, విశ్వాసంతో ప్రజ్వలన చేసి సమస్యల ఊబి నుంచి గట్టెక్కి అద్భుత విజయాలను పొందండి.

సూర్యోదయం 6గంటలకు, సూర్యాస్తమయం 6 గంటలైనచో శుక్రవారం ఉదయం 10గం॥30ని॥ల నుంచి 12గంటల వరకు రాహుకాలముండును. సూర్యోదయ సూర్యాస్తమయాల మార్పులచే రాహుకాల సమయాలలో కూడా మార్పులుండును. సూర్యోదయ సూర్యాస్తమయాలు వివిధ ప్రాంతాలకి వివిధ సమయాలలో ఉంటాయి. ప్రతి ప్రాంతానికి రాహుకాల ప్రారంభాంత్యాలు తెలియ జేయటం కష్టం. 15 నిమిషాల ఆలస్యంతో మొదలెట్టి,15 ని॥లు ముందుగా ముగించుకుంటే భారతదేశవ్యాప్తంగా అన్నీ ప్రాంతాల వారికి రాహుకాల సమయాలు సరిపోవును. శుక్రవారం ఉదయం 10.45గం॥ని నుంచి 11.45గం॥ని వరకే రాహుకాలంగా భావించుకుని ఆసమయంలో శాంతిదీపాన్ని వెలిగించండి.

**పద్ధతి:** తెలుపు రంగు అలచందలు లేక బొబ్బర్లు 100 గ్రాములు తీసుకోండి. శుభ్రం చేసి పిండిపట్టించండి. (వేయించ వద్దు) శుక్రవార రాహుకాలంలో 2 చెంచాల పిండిని తీసుకుని, కొన్ని చుక్కలు మంచి తేనె కలపండి. గోళీకాయంత పిండిముద్దను నాణెంలా తట్టుకోండి. ప్రమిద లోపల నాణెంలా చేసిన పిండిని పరిచి, ఆవునెయ్యి లేక కొబ్బరినూనెతో 2వత్తులను వెలిగించాలి. ప్రమిదను కుంకుమతో అలం కరించండి.

ప్రమిదలో 2 వత్తుల కొసలు పిండిపైన ఉండేలా పెట్టండి. శాంతిదీపాన్ని పూజా మందిరంలో గానీ, గృహంలో ఎక్కడైనా ఉంచి, మనస్ఫూర్తిగా నమస్కరించండి. నివేదనలు లేవు. రాహు కాలం తదుపరి నూనె వేయాల్సిన అవసరం లేదు. రెండోరోజు శనివారం వత్తిని, పిండిని విసర్జించండి. వారం వారం ప్రమిద మార్చనవసరం లేదు. ఈ సమయంలో ఆచరించలేనివారికై గృహంలోని ఇతరులు ఆచరించవచ్చు. ప్రత్యేక నియమాలు లేవు.

## లక్ష్మీదేవి అనుగ్రహ ప్రాప్తి-1

సాధారణంగా లక్ష్మీదేవి అనుగ్రహ సిద్ధికై లక్ష్మీ అష్టోత్తరాలు, సహస్రనామాలు, లక్ష్మీదేవివ్రతాలు, కనకధారాస్తోత్రాలు మొదలైన వెన్నో పఠిస్తూ ఉంటారు. వీటితో పాటు లక్ష్మీదేవి అనుగ్రహప్రాప్తికి మరికొన్ని మార్గాలు కూడా ఉన్నాయి. అందులో భాగంగా ఆవు పేడతో చేసిన భస్మధారణతో లక్ష్మీదేవి అనుగ్రహాన్ని పొందవచ్చు.

ఈ పరంపరలో ప్రథమంగా కార్తెల గురించి పాఠకులు తెలుసుకోవాలి. జగద్రక్షకుడైన శ్రీ సూర్యనారాయణుడు ఒక్కో నక్షత్రంలో ప్రవేశించటాన్నే కార్తె అని పిలుస్తారు. జ్యోతిశ్శాస్త్రరీత్యా సూర్యగ్రహ స్వక్షేత్రము సింహరాశి, సూర్యగ్రహ ఉచ్ఛక్షేత్రము మేషరాశి. మేషరాశిలో సూర్యగ్రహ స్వనక్షత్రం కృత్తిక ఉండును. సింహరాశిలో సూర్యగ్రహ స్వనక్షత్రం ఉత్తర ఉండును. కృత్తిక నుంచి ఉత్తర వరకు మొత్తం పది నక్షత్రాలు. ఈ పది నక్షత్రాలలో లక్ష్మీదేవి అనుగ్రహాన్ని పొందవచ్చు.

ప్రతి సంవత్సరం కృత్తిక కార్తె మే 11న ప్రారంభమగును. ఉత్తర కార్తె సెప్టెంబరు 13న ప్రారంభమగును. కృత్తిక కార్తె ప్రారంభం తర్వాత 2రోజులు అంటే మే 12 13 తేదీలు, ఉత్తరకార్తె ప్రారంభం తర్వాత 2రోజులు అంటే సెప్టెంబరు 14,15 తేదీలలో ఆవుపేడను సేకరించాలి. ఆవుపేడను సేకరించే సమయంలో చూడి ఆవుపేడ పనికి రాదు. తెలుసుకుని గమనించి సేకరించాలి. సేకరించిన ఆవుపేడలో వలిచిన దానిమ్మకాయ, తొక్కలు విత్తనాలు పేడలో కలిపి పిడకలుగా చేసుకోండి. సంవత్సరానికి 4రోజులు (మే 12,13, సెప్టెంబరు 14,15) దానిమ్మకాయను పేడలో కలిపి పిడకలు చేసుకొనుటకు అవకాశం.

మిగిలిన మాసాలలో కృత్తిక నుంచి ఉత్తర వరకు ప్రతినెలా వస్తూ ఉంటాయి. ఈ 10 రోజులలో కూడా ఒలిచిన నిమ్మకాయ తొక్కలు విత్తనాలు పేడలో కలిపి పిడకలుగా చేసుకోవచ్చును. అయితే ఇక్కడ ఓ ముఖ్యవిషయాన్ని గమనించాలి. మాఘ, పుష్యమాసాలలో కృత్తిక నుంచి ఉత్తర వరకు పూర్ణిమ మధ్యలో వస్తుంటుంది. ఆషాఢ, శ్రావణ, భాద్రపదాలలో కృత్తిక నుంచి ఉత్తర వరకు అమావాస్య మధ్యలో వస్తుంటుంది. కనుక ప్రతినెలలో కూడా కృత్తిక నక్షత్రం మొదలు ఉత్తర నక్షత్రం వరకు వచ్చే దిన నక్షత్రరోజులలో శుక్రవారాలు, పూర్ణిమ, అమావాస్యరోజులు, శుక్రవారంతో కలిసిన పూర్ణిమ, శుక్రవారంతో కలిసిన అమావాస్య రోజులలో మాత్రమే ఉదయం నుంచి సాయంత్రంలోగా ఆవుపేడలో నిమ్మకాయ తొక్కలు విత్తనాలు కలిపి పిడకలు చేసుకోవాలి. ముఖ్యంగా మే 12,13 సెప్టెంబరు 14,15 తేదీలు ఈ కృత్తిక నుంచి ఉత్తర వరకు వచ్చే రోజులలో శుక్రవారాలు, పూర్ణిమ, అమావాస్య దానిమ్మకాయనే వాడండి. నిమ్మకాయను వాడవద్దు.

పై ప్రకారం పిడకలను చేసుకుని బాగా ఎండబెట్టండి. ఎండిన పిడకలను చెదలు తదితర క్రిములు చేరకుండా భద్రంగా ఉండేలా ప్యాక్ చేసుకోండి. ఎండిన పిడకలో కొంతభాగం గాని లేక పూర్తిగా పిడకనుగానీ, ఏరోజైనా సరే...భస్మం చేయాలి. ఈ భస్మం చేసే ముందు పిడక మొత్తాన్ని కాకుండా చిన్న చిన్న ముక్కలుగా చేసుకుని దానిపైన కర్పూరం పొడిని చల్లి, మండించాలి. పిడక బాగా మండి భస్మంగా తయారవుతుంది. ఒకేసారి ఎక్కువ భస్మాన్ని చేసుకొనవద్దు.

ఈ భస్మాన్ని ప్రతిరోజు సూర్యోదయం కంటే ముందే నిద్రలేచి స్నానం చేసి నుదుటన భస్మాన్ని ధరించాలి. శిరస్నానం అవసరం లేదు. ఈ విధంగా నిత్యం భస్మాన్ని ధరిస్తూ ఉంటే లక్ష్మీదేవి అనుగ్రహం ప్రాప్తిస్తుంది. ముఖ్యంగా రాత్రి సమయాలలో ఉద్యోగాలు చేసి, వేకువన వచ్చి నిద్రపోయే వారు, ప్రతిరోజు ఈ కార్యక్రమాన్ని ఆచరించలేరు. కనీసం శుక్రవారం అయినా అట్టివారు సూర్యోదయం లోపలే స్నానం ఆచరించి భస్మాన్ని ధరించండి. ఈ విధంగా పిడకలతో చేసిన భస్మాన్ని ధరిస్తుంటే... శీఘ్రంగా లక్ష్మీదేవి అనుగ్రహం ప్రాప్తి కల్గి, సరైన సమయంలో సరైన నిర్ణయాలు తీసుకుంటూ ఉండే రాజమార్గాలవైపు వెళ్ళు అవకాశాలు వచ్చును.

**గమనికలు**

**మే 12,13 తేదీలలో దానిమ్మకాయతోనే పిడకలు చేయాలి.**

**సెప్టెంబర్ 14,15 తేదీలలో దానిమ్మకాయలతోనే పిడకలు చేయాలి.**

**పిడకలు చేయలేని వారు డబ్బిచ్చి పిడకలను కొనవద్దు.**

**ఒకేసారి దురాశతో అధికంగా పిడకలను చేయవద్దు.**

**అధికంగా పిడకలను చేస్తే ఉచితంగా ఇవ్వటానికి ప్రయత్నించండి.**

**పిడకలను అధికంగా తయారుచేసి అమ్మటానికి ప్రయత్నించకండి.**

**పిడకలను అమ్మినా, కొన్నా లక్ష్మీదేవి అనుగ్రహం ఉండదు.**

**ఒకేసారి కేజీలు, కేజీలుగా భస్మాన్ని తయారుచేయకండి.**

**పసిడికంటే ఈ భస్మం విలువైనది.**

**శ్రద్ధ, విశ్వాసం, భక్తితో గ్రహించండి.**

**కొన్న పిడకలతో తయారైన భస్మంతో లక్ష్మీదేవి ప్రాప్తి సిద్ధించదు.**

**ఎవరైననూ పిడకలను అమ్మటానికి, కొనటానికి ప్రయత్నించకండి.**

**తయారైన భస్మాన్ని బంధువులకు మిత్రులకు హితులకు సన్నిహితులకు ఉచితంగా అందజేయటానికి ప్రయత్నించండి.**

## లక్ష్మీదేవి అనుగ్రహ ప్రాప్తి-2

జాతకచక్రంలో మొత్తం 12రాశులు. ఒక్కోరాశిలో 9 నక్షత్రపాదాలు. ఒక్కోగ్రహానికి ఒక్కోరాశి ఉచ్ఛస్థానం. ఉచ్ఛ స్థానంగా ఉన్న రాశిలోని 9 నక్షత్రపాదాలలో, ఆ ఉచ్ఛ గ్రహ స్వనక్షత్రాలుగా ఉన్న రాశులు కేవలం మూడే ఉంటాయి.

సూర్యగ్రహానికి ఉచ్ఛస్థానం మేషరాశి. ఈరాశిలో కృత్తిక ఒకపాదమే ఉంటుంది. కృత్తిక సూర్య నక్షత్రం. వృషభరాశి చంద్రగ్రహానికి ఉచ్ఛ స్థానం. ఈరాశిలో రోహిణి 4పాదాలతో ఉండును. రోహిణి చంద్ర స్వనక్షత్రం. కర్కాటకరాశి గురుగ్రహ ఉచ్ఛస్థానం. ఈరాశిలో పునర్వసు చివరిపాదమే ఉండును. పునర్వసు గురుగ్రహ స్వనక్షత్రం. ఈ 3 గ్రహాలకి తమ ఉచ్ఛస్థానాలలోనే వాటి స్వనక్షత్రాలు ఉంటాయి. మిగిలిన గ్రహాలకి, తమ తమ ఉచ్ఛస్థానాలలో స్వనక్షత్రాలు ఉండవు. కనుక లక్ష్మీదేవి అనుగ్రహం పొందాలంటే సూర్యనక్షత్ర కృత్తికతో కలిసిన ఆది వారం కావాలి. చంద్రనక్షత్ర రోహిణితో కలిసిన సోమవారం కావాలి. గురునక్షత్ర పునర్వసుతో కలిసిన గురువారం కావాలి.

కృత్తిక మొదటిపాదమే మేషరాశిలో ఉంటుంది. ఈ కృత్తిక నక్షత్ర ప్రమాణం 24 గంటలు ఉండవచ్చు, 23గంటలు ఉండవచ్చు, ఇంకా ఎక్కువ ఉండవచ్చు, తక్కువ ఉండవచ్చు. ఇట్టి స్థితిలో కృత్తిక నక్షత్రమొదటి పాదము ఎన్ని గంటలసేపు ఉంటుంది అని ఇప్పుడే మనం చెప్పలేం. కాబట్టి నక్షత్రప్రమాణం ఎక్కువ, తక్కువలను లెక్కలోకి తీసుకోకుండా కృత్తిక నక్షత్రం ప్రారంభమైన సమయం నుంచి తొలి 5గంటలు మాత్రమే తీసుకుంటే... ఇక ఇబ్బందే ఉండదు. కనుక ఆదివారంతో కూడిన కృత్తిక నక్షత్ర తొలి 5గంటలలోనే... సూర్యోదయం తదుపరి ఉండాలి. అంటే కృత్తిక నక్షత్ర మొదటి పాదము సూర్యోదయం తదుపరి మొదటి గంటలోనే ఉండటానికి చేసే ప్రయత్నమే పైన చెప్పిన వివరణ.

ఇక రెండవనక్షత్రం రోహిణి. ఈ నక్షత్రం 4పాదాలు వృషభంలోనే ఉంటాయి గనుక సూర్యోదయం తర్వాత రోహిణి

నక్షత్రం ఏపాదం ఉన్నా సమస్య ఉండదు. ఇక మూడవనక్షత్రం పునర్వసు. ఈ పునర్వసు నక్షత్ర ప్రమాణం 24 గంటలు ఉండవచ్చు, 23గంటలు ఉండవచ్చు, ఇంకా ఎక్కువ ఉండవచ్చు, తక్కువ ఉండవచ్చు. ఇట్టి స్థితిలో పునర్వసు నక్షత్ర చివరిపాదము ఎన్ని గంటలసేపు ఉంటుందని చెప్పలేం. నక్షత్ర ప్రమాణం ఎక్కువ, తక్కువలను లెక్కలోకి తీసుకోకుండా పునర్వసు నక్షత్రం చివరి 5గంటలు మాత్రమే తీసుకుంటే... ఇక సమస్య లేదు. కనుక గురువారంతో కూడిన పునర్వసునక్షత్ర చివరి 5గంటలలోనే... సూర్యోదయం తదుపరి ఉండాలి. అంటే పునర్వసు నక్షత్ర చివరిపాదము సూర్యోదయం తదుపరి మొదటి గంటలోనే ఉండటానికి చేసే ప్రయత్నమే పైన చెప్పిన వివరణ.

1. కృత్తిక నక్షత్రం తొలి 5గంటలు మాత్రమే ఉన్న ఆదివారం నాటి సూర్యోదయం తదుపరి చేయవలసిన విధివిధానం ఏమిటంటే.... 5 తేనెచుక్కలు అరచేతిలో వేసుకుని సూర్యోదయం కాగానే, సూర్యనారాయణమూర్తికి నమస్కరిస్తూ, అవకాశమున్నచో ఆదిత్య హృదయాన్ని పఠించటానికి ప్రయత్నం చేయండి. లేదా వినటానికి ప్రయత్నం చేయండి. ఆవిధంగా పఠించటానికి, వినటానికి అవకాశం లేకపోతే మనసులోని శ్రీ సూర్యభగవానుని ప్రార్థించండి. అరచేతిలో ఉంచుకున్న 5తేనె చుక్కలను శ్రీసూర్య భగవానునికి నివేదన ఇచ్చినట్లుగా, మనసులోనే భావించండి. తదుపరి ఆ తేనెను ఎవరైతే నివేదించారో... వారే ప్రసాదంగా అప్పుడే స్వీకరించండి.

2. రోహిణి నక్షత్రం ఉన్న సోమవారం నాటి సూర్యోదయం తదుపరి చేయవలసిన విధివిధానం ఏమిటంటే.... 5 తేనెచుక్కలు అరచేతిలో వేసుకుని సూర్యోదయం కాగానే, సూర్యనారాయణ మూర్తికి నమస్కరిస్తూ, అవకాశమున్నచో ఆదిత్యహృదయాన్ని పఠించటానికి ప్రయత్నం చేయండి. లేదా వినటానికి ప్రయత్నం చేయండి. ఆవిధంగా పఠించటానికి, వినటానికి అవకాశం లేకపోతే మనసులోని శ్రీ సూర్యభగవానుని ప్రార్థించండి. అరచేతిలో ఉంచుకున్న 5తేనె చుక్కలను శ్రీసూర్య భగవానునికి నివేదన ఇచ్చినట్లుగా, మనసులోనే భావించండి. ఆ తేనెను ఎవరైతే నివేదించారో... వారే ప్రసాదంగా అప్పుడే స్వీకరించండి.

3. పునర్వసు నక్షత్రం చివరి 5గంటలు మాత్రమే ఉన్న గురువారం నాటి సూర్యోదయం తదుపరి చేయవలసిన విధివిధానం ఏమిటంటే.... 5 తేనెచుక్కలు అరచేతిలో వేసుకుని సూర్యోదయం కాగానే, సూర్య నారాయణమూర్తికి నమస్కరిస్తూ, అవకాశము ఉన్నచో ఆదిత్యహృదయం పఠించటానికి ప్రయత్నం చేయండి. లేదా వినటానికి ప్రయత్నం చేయండి. పఠించటానికి, వినటానికి అవకాశం లేనిచో మనసులోనే శ్రీ సూర్యభగవానుని ప్రార్థించండి. అరచేతిలో ఉంచుకున్న 5తేనెచుక్కలు శ్రీసూర్య భగవానునికి నివేదన ఇచ్చినట్లుగా, మనసులోనే భావించండి. ఆ తేనెను ఎవరు నివేదించారో... వారే ప్రసాదంగా స్వీకరించండి.

## లక్ష్మీదేవి అనుగ్రహ ప్రాప్తి-3

ఇంతవరకు లక్ష్మీదేవి అనుగ్రహప్రాప్తికి కొన్ని పద్ధతులను తెలుసుకున్నాం. ఇప్పుడు మరో పద్ధతి ఏమిటంటే... జాతకచక్రాలలో ప్రతివారి రాశి నుంచి 10వ రాశిని లెక్కించండి. అలా లెక్కిస్తే 10వ రాశిలో మూడు నక్షత్రాలు ఉంటాయి. అందులోని మూడు నక్షత్రాలలో మధ్య నక్షత్రం అవసరమవుతుంది. పండితులు, జ్యోతిశ్శాస్త్రం నేర్చుకొనేవారు సులభంగా గ్రహించగలరు. ఇతరులు సులభంగా తెలుసుకోవటానికి ఏరాశివారికి ఏ నక్షత్రం అనుకూలమో ఈ దిగువన తెలియజేస్తున్నాను.

**మేషరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: శ్రవణం**

**వృషభరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: శతభిషం**

**మిధునరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: ఉత్తరాభాద్ర**

**కర్కాటకరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: భరణి**

**సింహరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: రోహిణి**

**కన్యరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: ఆరుద్ర**

**తులరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: పుష్యమి**

**వృశ్చికరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: పుబ్బ**

**ధనస్సురాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: హస్త**

**మకరరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: స్వాతి**

**కుంభరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: అనూరాధ**

**మీనరాశి జాతకులకు అవసరమైన నక్షత్రం: పూర్వాషాఢ**

**పద్ధతి :** శుభ్రం చేసిన గోధుమపిండి ప్యాకింగులలో లభ్యమవుతుంది. ప్రస్తుతం పొట్టున్న గోధుమపిండితోనే అవసరం. పొట్టు ఉన్న గోధుమపిండి మార్కెట్‌లో లభ్యమయితే కొనండి. లేదంటే గోధుమలని మర పట్టించి సిద్ధం చేసుకోండి. మరపట్టిన పొట్టు గోధుమపిండిని... ఆయా రాశులవారు, వారికి అనుకూల నక్షత్ర రోజులలో 200 గ్రాములు తీసుకొనండి. తియ్యని బెల్లం కలిపిన కొద్ది పానకాన్ని తయారుచేసుకోండి. ఈ బెల్లం పానకాన్ని మీరు తీసుకున్న గోధుమపిండిలో కలిపి చపాతీ ముద్దగా తయారు చేయండి. ఈ పిండిముద్దతో భక్తితో, విశ్వాసంతో లక్ష్మీదేవి అనుగ్రహాన్ని పొందాలనే తపనతో... సూర్యోదయం తదుపరి.... పూజా కార్యక్రమాలు పూర్తి కాగానే... 5 చపాతీలుగా వత్తుకుని నూనె లేకుండా కాల్చండి. కాల్చిన 5 చపాతీలను ఒక పాత్రలో ఉంచండి. చపాతీలు కాల్చే సమయం వరకు ఆ నక్షత్రం ఉంటే సరిపోతుంది. సాయంత్రం వరకు ఉండాల్సిన అవసరం లేదు.

మీ అనుకూల నక్షత్రం వచ్చిన రోజున్న రాహుకాల సమయంలో మీ అనుకూల నక్షత్రం ఉంటే మరీ మంచిది. లేకున్నా దిగులు చెందవద్దు. ఎటు తిరిగి సూర్యోదయం కాగానే నక్షత్రమున్న సమయంలోనే చపాతీలు చేసుకుంటారు గనుక ఇబ్బందేమీ లేదు.

మీ అనుకూల నక్షత్రం సోమవారం వస్తేనే...కొంత హడావుడి ఉంటుంది. లేనిచో హడావుడి పడవలసిన అవసరం ఉండదు. మీ అనుకూల నక్షత్రం ఈ క్రింది తెల్పిన వారాలలో ఉంటుంది కనుక ఆయా రోజులలో... ఉండే రాహుకాల సమయాలలోనే... చేసినటువంటి 5 చపాతీలను గోమాతకు భక్తి పూర్వకంగా సమర్పించండి.

**సోమవారము - ఉదయం 7.30 నుంచి 9.00 వరకు**

**మంగళవారము - మధ్యాహ్నం 3.00 నుంచి 4.30 వరకు**

**బుధవారము - మధ్యాహ్నం 12.00 నుంచి 1.30 వరకు**

**గురువారము - మధ్యాహ్నం 1.30 నుంచి 3.00 వరకు**

**శుక్రవారం - ఉదయం 10.30 నుంచి 12.00 వరకు**

**శనివారం - ఉదయం 9.00 నుంచి 10.30 వరకు**

**ఆదివారం - సాయంత్రం 4.30 నుంచి 6.00 వరకు**

పై సమయాలలోనే మీరు కానీ, మీ కుటుంబసభ్యులలో ఎవరైననూ, గోమాతకు ఆహారంగా సమర్పించి, మీ రెండు చేతులను మెలివేసి తోకభాగాన్ని భక్తితో నమస్కరించండి. అధికమాసాలు, గురు, శుక్ర మౌఢ్యమి ఉన్న రోజులలో ఆచరించవద్దు. మీ అనుకూల నక్షత్రానికి గ్రహణం కనుక పడితే ఆ నక్షత్ర రోజును 6 మాసాల వరకు విసర్జించండి. అలాగే సూర్యచంద్ర గ్రహణాలు వచ్చిన రోజును కూడా విసర్జించండి. రక్తసంబంధీకులు మరణిస్తే ఒక సంవత్సరం కాలం వరకు పాటించవద్దు. (వ్యవహారికంగా ఉన్న ఆచారానికి, దీనికి వ్యత్యాసం ఉంది.) ఋతుస్త్రీలు, గర్భిణులు ఆచరించవద్దు. - పంచాంగకర్త.

## నక్షత్ర ప్రకారం నామ నిర్ణయములు-1

శిశువులు జన్మించగానే, సమయాన్ని బట్టి నక్షత్ర నిర్ణయంచే... ఏ పేరుతో శిశువులను పిలుచుకోవాలనేది ప్రతివారు గమనించే అంశం. పంచాంగాలలో ప్రతి నక్షత్రానికి కొన్ని అక్షరాలు ఉండి, వాటితో పేర్లను నిర్ణయించుకోవటం జరుగుతుంటుంది. కానీ కొన్ని నక్షత్రాలకు ఇవ్వబడిన అక్షరాలతో పేర్లు నిర్ణయించటం అసంభవము. ఈ పరిస్థితులలో వేరే అక్షరంతో పేరును నిర్ణయించినప్పటికీ, భవిష్యకాలంలో శుభాలు జరగవని మానసికంగా బాధపడుతూ ఉంటారు.

ఇలా మానసికంగా బాధపడటం పొరపాటు. అసలు ఈ అక్షరాన్ని ఎందుకు తీసుకోవాలి అనేది... పాఠకులు ముందుగా గమనించాలి. పూర్వపురోజులలో అత్యధికులు విద్యాధికులు కాదు గనుక, ఆరోజులలో జన్మించిన వారి నక్షత్రాలను...వారి తల్లితండ్రులు గుర్తుంచుకొనటం కష్టమనే భావనతోనే... కొన్ని అక్షరాలతో పేర్లను నిర్ణయించుకొనమని పంచాంగాలలో ఇవ్వటం జరిగింది. ప్రస్తుత రోజులు వేరు, విద్యావిధానాలు వేరు. ప్రతివారు విద్యాబుద్ధులతో విజ్ఞానవంతులవుతున్నారు. ఇలాంటి పరిస్థితులలో నక్షత్రాలు గుర్తు పెట్టుకొనటం పెద్ద పనేమి కాదు. శిశువులు జన్మించినప్పుడు.. నచ్చిన మంచి పేరును నిర్ణయించుకొని, జన్మ నక్షత్రాన్ని గుర్తు పెట్టుకోవటం ఎంతో శ్రేయోదాయకం.

పంచాంగాలలో ఇచ్చిన అక్షరంతోనే పేరు పెట్టుకోవటం ప్రామాణికం కాదు. పూర్వపురోజులలో నక్షత్ర ప్రకారం అక్షరాన్ని పండితులు తెలియ జేసినప్పుడు... ఆ అక్షరంతో పేరును నిర్ణయించుకోవాలని అనుకున్నప్పటికీ, వారి వారి గృహాలలో చనిపోయిన పెద్దల పేర్లు ముందుగా రావాలనే నమ్మకాలు ఉండి, మానసికంగా ఆపేర్లకే ప్రాధాన్యత ఇస్తారు. అయితే పేరును పెట్టుకుంటారు కానీ నక్షత్రాన్ని గుర్తుంచుకోలేక పోతారు. ఇట్టి వారికి నక్షత్రం గుర్తుండటానికై... గుర్రము, ఏనుగు, మేక, పాము, కుక్క, పిల్లి వంటి జంతువుల పేర్లు నక్షత్రాలలో చోటుచేసుకున్నాయి.

కనుక పాఠకులు పై వివరాలను గుర్తుంచుకోవటమే కాకుండా వివాహ సమయాలలో విరోధ జంతువులు ఉంటే వివాహం తగదని అనుకుంటుంటారు. అనుభవంలో గమనిస్తే విరోధ జంతువులు గల నక్షత్రాలతో వివాహమైన కుటుంబాలు సుఖశాంతులతో కూడా ఉన్నాయి. కేవలం జాతకపొంతనలకే ప్రాధాన్యత ఇవ్వాలి తప్ప, విరోధజంతువులకు ప్రాధాన్యత ఇవ్వ తగదు. అంతేకాక ప్రస్తుత రోజులలో తమ పేరును ఇంగ్లీషు అక్షరాలలో వ్రాసినప్పుడు, సంఖ్యాశాస్త్ర ప్రకారం ఆ అక్షరాలలో మార్పులు చేసి, సరిక్రొత్త అక్షరాలతోను, అర్థం పర్థం లేని ఇంగ్లీషు అక్షరాలతోను పేర్లను పెట్టుకుంటున్నారు. ఇది పూర్తిగా అశాస్త్రీయమే.

వ్యక్తులు తమ పేరును ఇంగ్లీషు అక్షరాలలో లిఖించి, వాటికి సంఖ్యలనేర్పరిచి, వాటి మొత్తాలను కలుపుతూ.... జాతక ఫలితాలను విశ్లేషించే వారు ప్రస్తుతం వీధికొకరున్నారు. పేరు మార్చుకున్నంత మాత్రాన, జాతకం మారుతుందనుకోవటం పొరపాటు. శుభకరంగా సమస్యలు లేని జీవితం పొందాలనుకునే వారు...వీటికి ప్రాధాన్యత ఇవ్వటం కాదు. మనఃకారకుడు చంద్రుడు, బుద్ధి కారకుడు బుధుడు, ఆత్మకారకుడు రవి. రవి, చంద్ర, బుధుల స్థితిగతులను తెలుసుకుని.... ఏది మంచి ? ఏది చెడు అనే విచక్షణతో, నిర్ణయాలను తీసుకున్నప్పుడు మాత్రమే, జీవితాలు సుసంపన్నమై విజయబాటలో పయనిస్తూ అందరి మన్ననలను పొందగలరనేది అక్షర సత్యం.

కనుక నక్షత్రాన్ని గుర్తుంచుకుని నచ్చిన పేరును నిర్ణయించుకోండి. - శ్రీనివాసగార్గేయ

## నక్షత్ర ప్రకారం నామ నిర్ణయములు-2

ఇప్పటికీ చాలామంది నక్షత్రఅక్షరాలకు సంబంధించిన పేర్లనే నామకరణంగా పెట్టుకోవాలనే పట్టుదల ఉన్నవారున్నారు. ఇది శాస్త్రీయ పద్ధతి కాదని చెప్పిననూ ఎవరి పట్టుదల వారికుంటుంది. కొన్ని అక్షరాలతో పేర్లు నిర్ణయించటం అసంభవం. పాఠకులు నిజానిజాలు తెలుసుకుని, శిశు జన్మనక్షత్రాలను గుర్తుంచుకుని, వారికి అనుకూలమైన నచ్చిన మెచ్చిన పేర్లతో నామకరణం చేసుకొనేది. ఈ నక్షత్రఅక్షరాలు ఈ దిగువ పొందుపరుస్తున్నాం. వీటికి ఎలాంటి ప్రాధాన్యత ఇవ్వ వలసిన అవసరం లేనే లేదు. పాఠకులు తెల్సుకొనుటకని గమనించాలి. ఇందులో ఇచ్చిన అక్షరాలతో పేర్లు పెట్టుకొనమని మేము సలహా ఇవ్వటం లేదని పాఠకులు గమనించాలి.

| | |
|---|---|
| అశ్వని | చూ, చే, చో, లా |
| భరణి | లీ, లూ, లే, లో |
| కృత్తిక | ఆ, ఈ, ఊ, ఏ |
| రోహిణి | ఓ, వా, వీ, వూ - స్వా |
| మృగశిర | నే, నో, కా, కి-కృ, వై, శ్వే, క్ర |
| ఆర్ద్ర | కూ, ఖం, జ్ఞా, చ్ఛ |
| పునర్వసు | కే, కో, హా, హి |
| పుష్యమి | హూ, హే, హొ, దా |
| ఆశ్లేష | డీ, డూ, డే, డో |
| మఖ | మా, మీ, మూ, మే - మృ |
| పుబ్బ | మో, టా, టీ, టూ |
| ఉత్తర | టే, టో, పా, పి - ఫ, పౌ |
| హస్త | పూ, షం, ణా, ఠా |
| చిత్ర | పే, పో, రా, రి - ప్ర, శ్రీ, బ్ర |
| స్వాతి | రూ, రే, రో, తా - హ్రృ,ద్రో,ద్రౌ,త్రి |
| విశాఖ | తీ, తూ, తే, తో |
| అనూరాధ | నా, నీ, నూ, నే - స్నే |
| జ్యేష్ఠ | నో, యా, యి, యూ - శ్యా |
| మూల | యే, యో, బా, బి - జ్యో, భౌ |
| పూర్వాషాఢ | బూ, ధా, భా, డా - భై |
| ఉత్తరాషాఢ | బే, బో, జా, జీ |
| శ్రవణం | జూ, జే, జో, ఖా |
| ధనిష్ఠ | గా, గీ, గూ, గే |
| శతభిషం | గో, సా, సీ, సూ |
| పూర్వాభాద్ర | సే, సో, దా, ది |
| ఉత్తరాభాద్ర | దు, శ్యం, ఝా, ధా |
| రేవతి | దే, దో, చా, చి |

### ముఖ్యగమనిక

నక్షత్ర ప్రకారం...ఒక్కో నక్షత్రానికి ఒక్కొక్క జంతువును పంచాంగాలలో చూసి తెలుసుకుని... వివాహ నిర్ణయాలలో వధూవరులు వైర జంతువులుగా ఉన్నారని, సంబంధం తగదని అనుకునేవారు కొంతమంది. గతంలో వివాహం అయినప్పటికీ, ప్రస్తుత రోజులలో వారి నక్షత్రాలు వైరజంతువులుగా ఉన్నందున సమస్యలు వస్తున్నాయని ఆలోచించేవారు మరికొంతమంది ఉంటున్నారు.

నక్షత్రాలకు జంతు నామాలను ఉంచటం, వైరి జంతువులతో వివాహాలు చేయకూడదనటం సరికాదు. పూర్వకాలం నుంచి శిశు జన్మనక్షత్ర గుర్తుకై అక్షరాలను ఉద్దేశించగా, చనిపోయిన పెద్దల పేర్లు నిర్ణయించుకునేవారు ఉంటున్న సందర్భాలలో జన్మ నక్షత్రాలని మర్చిపోతుంటారు. కేవలం నిరక్షరాస్యులకు జన్మనక్షత్ర జ్ఞప్తికై జంతువులను ఇవ్వటం జరిగింది. కనుక మా పంచాంగాలలో ఇకపై జంతు వివరాలు ఉండవని పాఠకులు గమనించేది. - శ్రీనివాసగార్గేయ

## నక్షత్రవారీగా వివాహమునకు అనుకూల నక్షత్రాలు

| అశ్వని | భరణి | ★ కృత్తిక 1వపాదం |
|---|---|---|
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర1(సింహం) ఉత్తరాషాఢ మృగశిర అశ్వని చిత్ర3,4 (తుల) ధనిష్ఠ ఆర్ద్ర స్వాతి శతభిషం పుష్యమి ఉత్తరాభాద్ర ఆశ్లేష రేవతి | కృత్తిక ఉత్తర1(సింహం) ఉత్తరాషాఢ రోహిణి శ్రవణం ఆర్ద్ర స్వాతి శతభిషం పునర్వసు విశాఖ 1,2,3 (తుల) పూర్వాభాద్ర ఆశ్లేష రేవతి అశ్వని మఖ మూల | రోహిణి శ్రవణం మృగశిర చిత్ర3,4 (తుల) ధనిష్ఠ పునర్వసు విశాఖ 1,2,3 (తుల) పూర్వాభాద్ర పుష్యమి ఉత్తరాభాద్ర అశ్వని మఖ మూల భరణి పుబ్బ పూర్వాషాఢ |
| **★ కృత్తిక 2,3,4 పాదాలు** | **రోహిణి** | **★ మృగశిర 1,2 పాదాలు** |
| రోహిణి హస్త శ్రవణం మృగశిర చిత్ర1,2 (కన్య) ధనిష్ఠ పునర్వసు విశాఖ4 (వృశ్చికం) పూర్వాభాద్ర పుబ్బ పుష్యమి అనూరాధ భరణి ఉత్తరాభాద్ర అశ్వని మఖ | మృగశిర చిత్ర1,2(తుల) ధనిష్ఠ ఆర్ద్ర శతభిషం కృత్తిక పుష్యమి అనూరాధ రోహిణి ఉ.భాద్ర రేవతి ఆశ్లేష జ్యేష్ఠ భరణి పుబ్బ ఉత్తర ఉత్తరాషాఢ 2,3,4 (మకరం) | ఆర్ద్ర శతభిషం పునర్వసు విశాఖ4 (వృశ్చికం) శ్రవణం పూర్వాభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ రేవతి అశ్వని మఖ ఉత్తర కృత్తిక ఉత్తరాషాఢ2,3,4 (మకరం) రోహిణి హస్త |
| **★ మృగశిర 3,4 పాదాలు** | **ఆర్ద్ర** | **★ పునర్వసు 1,2,3 పాదాలు** |
| ఆర్ద్ర స్వాతి శతభిషం పునర్వసు విశాఖ1,2,3(తుల) పూర్వాభాద్ర ఆశ్లేష రేవతి అశ్వని మఖ మూల ఉత్తర కృత్తిక ఉత్తరాషాఢ1 (ధనస్సు) రోహిణి హస్త | పునర్వసు విశాఖ1,2,3(తుల) ఆర్ద్ర పూర్వాభాద్ర పుష్యమి ఉత్తరాభాద్ర అశ్వని మృగశిర మఖ మూల భరణి పుబ్బ హస్త పూర్వాషాఢ రోహిణి చిత్ర ధనిష్ఠ3,4 (కుంభం) | పుష్యమి ఉత్తరాభాద్ర ఆశ్లేష రేవతి భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ1 (ధనస్సు) చిత్ర మృగశిర ధనిష్ఠ3,4(కుంభం) ఆర్ద్ర స్వాతి శతభిషం |
| **★ పునర్వసు 4వ పాదం** | **పుష్యమి** | **ఆశ్లేష** |
| పుష్యమి అనూరాధ స్వాతి ఉత్తరాభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ రేవతి భరణి పుబ్బ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ2,3,4 (మకరం) మృగశిర చిత్ర ధనిష్ఠ1,2 (మకరం) ఆర్ద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి అశ్వని మఖ కృత్తిక ఉత్తర పుష్యమి ఉత్తరాషాఢ 2,3,4 (మకరం) రోహిణి హస్త శ్రవణం ఆర్ద్ర స్వాతి పునర్వసు విశాఖ పూర్వాభాద్ర4 (మీనం) | మఖ అశ్వని భరణి పుబ్బ రోహిణి హస్త శ్రవణం చిత్ర పునర్వసు విశాఖ పుష్యమి పూర్వాభాద్ర4 (మీనం) మృగశిర ధనిష్ఠ1,2(మకరం) అనూరాధ ఉత్తరాభాద్ర |

**గమనిక** రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, మఘు, విశాఖ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి అను 8 నక్షత్రములు వివాహాలలో స్త్రీ, పురుషులకు ఒకే నక్షత్రమైనచో శుభప్రదమే కానీ అశుభము కానే కాదు. కనుక పై 8 నక్షత్రముల వారు ఆ నక్షత్ర జాతకులని వివాహం చేసుకొనవచ్చును.

## నక్షత్రవారీగా వివాహమునకు అనుకూల నక్షత్రాలు

| మఘు | పుబ్బ | ★ ఉత్తర 1వపాదం |
|---|---|---|
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ1 (ధనస్సు) ఆర్ద్ర మృగశిర చిత్ర స్వాతి ధనిష్ఠ3,4 (కుంభం) శతభిషం పుష్యమి అనూరాధ ఆశ్లేష జ్యేష్ఠ రేవతి | ఉత్తర కృత్తిక రోహిణి హస్త ఉత్తరాషాఢ1(ధనస్సు) శతభిషం ఆర్ద్ర స్వాతి అశ్వని పునర్వసు విశాఖ జ్యేష్ఠ పూర్వాభాద్ర1,2,3(కుంభం) మూల ఆశ్లేష మఘు పుబ్బ | హస్త రోహిణి మృగశిర చిత్ర ధనిష్ఠ3,4 (కుంభం) మూల పునర్వసు విశాఖ అశ్వని పుష్యమి పూర్వాభాద్ర1,2,3 (కుంభం) అనూరాధ మఖ భరణి పుబ్బ పూర్వాషాఢ |
| **★ ఉత్తర 2,3,4 పాదాలు** | **హస్త** | **★ చిత్ర 1,2 పాదాలు** |
| హస్త రోహిణి శ్రవణం మృగశిర చిత్ర పునర్వసు ధనిష్ఠ1,2 (మకరం) విశాఖ పూర్వాభాద్ర4 (మీనం) పుబ్బ పుష్యమి అనూరాధ మఖ ఉత్తరాభాద్ర మూల పూర్వాషాఢ | మృగశిర చిత్ర ధనిష్ఠ1,2 (మకరం) ఆర్ద్ర స్వాతి హస్త పుష్యమి అనూరాధ రేవతి ఉత్తరభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ పుబ్బ పూర్వాషాఢ ఉత్తర ఉ.షాఢ కృత్తిక2,3,4 (వృషభం) | స్వాతి ఆర్ద్ర విశాఖ పునర్వసు పూర్వాభాద్ర4 (మీనం) రేవతి ఆశ్లేష జ్యేష్ఠ మూల మఖ ఉత్తర ఉత్తరాషాఢ కృత్తిక2,3,4 (వృషభం) రోహిణి హస్త శ్రవణం చిత్ర |
| **★ చిత్ర 3,4 పాదాలు** | **స్వాతి** | **★ విశాఖ 1,2,3 పాదాలు** |
| స్వాతి ఆర్ద్ర శతభిషం పునర్వసు ఆశ్లేష విశాఖ పూర్వాభాద్ర1,2,3 (కుంభం) జ్యేష్ఠ అశ్వని మఖ మూల ఉత్తర ఉత్తరాషాఢ కృత్తిక1 (మేషం) హస్త శ్రవణం చిత్ర | విశాఖ పునర్వసు హస్త ధనిష్ఠ మృగశిర3,4 (మిధునం) పూర్వాభాద్ర1,2,3 (కుంభం) పుబ్బ అశ్వని పుష్యమి మఖ అనూరాధ శ్రవణం మూల పూర్వాషాఢ భరణి చిత్ర | పుష్యమి అనూరాధ ఆశ్లేష జ్యేష్ఠ భరణి పుబ్బ స్వాతి పూర్వాషాఢ కృత్తిక1 (మేషం) ఉత్తర ఉత్తరాషాఢ ధనిష్ఠ చిత్ర మృగశిర3,4 (మిధునం) శతభిషం ఆర్ద్ర |
| **★ విశాఖ 4వ పాదం** | **అనూరాధ** | **జ్యేష్ఠ** |
| అనూరాధ పుష్యమి రేవతి ఉత్తరాభాద్ర పుబ్బ ఆశ్లేష చిత్ర జ్యేష్ఠ పూర్వాషాఢ ఉత్తర స్వాతి విశాఖ ఉత్తరాషాఢ శతభిషం ధనిష్ఠ కృత్తిక2,3,4 (వృషభం) మృగశిర1,2 (వృషభం) | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి మఖ మూల కృత్తిక2,3,4(వృషభం) స్వాతి ఉత్తర ఉత్తరాషాఢ రోహిణి హస్త విశాఖ శ్రవణం శతభిషం పూర్వాభాద్ర పునర్వసు (కర్కా) అనూరాధ | మూల మఖ పుబ్బ అనూరాధ పూర్వాషాఢ రోహిణి హస్త చిత్ర శ్రవణం మృగశిర1,2 (వృషభం) ధనిష్ఠ విశాఖ పుష్యమి పునర్వసు4 (కర్కాటకం) పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర |

**గమనిక** అశ్వని, కృత్తిక, మృగశిర, పునర్వసు, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్ర, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ అను 11 నక్షత్రములు స్త్రీ, పురుషులకు ఒకే నక్షత్రమైనచో మధ్యమ ఫలప్రదమే కానీ నింద్యము కాదు. భరణి, ఆశ్లేష, స్వాతి, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర అను 8 నక్షత్రములు స్త్రీ, పురుషులకు ఒకటైనచో వివాహము చేయరాదు.

## నక్షత్రవారీగా వివాహమునకు అనుకూల నక్షత్రాలు

| మూల | పూర్వాషాఢ | ★ ఉత్తరాషాఢ 1వపాదం |
|---|---|---|
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక1(మేషం) ఉత్తర చిత్ర ఉత్తరాషాఢ ధనిష్ఠ రేవతి మృగశిర3,4 (మిధునం) స్వాతి ఆర్ద్ర శతభిషం జ్యేష్ఠ ఉత్తరాభాద్ర అనూరాధ | ఉత్తరాషాఢ ఉత్తర అశ్వని కృత్తిక1 (వృషభం) శ్రవణం హస్త ఆర్ద్ర స్వాతి జ్యేష్ఠ మఖ శతభిషం పునర్వసు 1,2,3 (మిధునం) విశాఖ రేవతి మూల పూర్వాషాఢ పూర్వాభాద్ర | శ్రవణం హస్త చిత్ర భరణి మృగశిర3,4 (మిధునం)ధనిష్ఠ పునర్వసు1,2,3(మిధునం) మఖ పుబ్బ విశాఖ పూర్వాభాద్ర మూల పూర్వాషాఢ అనూరాధ ఉ.భాద్ర అశ్వని ఉత్తరాషాఢ |
| **★ ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు** | **శ్రవణం** | **★ ధనిష్ఠ 1,2 పాదాలు** |
| రోహిణి హస్త శ్రవణం చిత్ర ఉత్తరాషాఢ మృగశిర1,2 (వృష) ధనిష్ఠ పునర్వసు4 (కర్కా) విశాఖ మూల పూర్వాభాద్ర పుష్యమి అనూరాధ పూర్వాషాఢ ఉత్తరాభాద్ర అశ్వని భరణి | ధనిష్ఠ చిత్ర మృగశిర1,2 (వృషభం) కృత్తిక స్వాతి జ్యేష్ఠ శతభిషం పుష్యమి అనూరాధ ఉత్తరాభాద్ర రేవతి ఆశ్లేష భరణి పూర్వాషాఢ శ్రవణం ఉత్తర2,3,4 (కన్య) ఉత్తరాషాఢ | శతభిషం స్వాతి విశాఖ జ్యేష్ఠ పూర్వాభాద్ర పునర్వసు4 (కర్కాటకం) ఆశ్లేష రేవతి అశ్వని మూల కృత్తిక ఉత్తర 2,3,4 (కన్య) ఉత్తరాషాఢ రోహిణి హస్త శ్రవణం |
| **★ ధనిష్ఠ 3,4 పాదాలు** | **శతభిషం** | **★ పూర్వాభాద్ర 1,2,3 పాదాలు** |
| ఆర్ద్ర శతభిషం స్వాతి కృత్తిక పునర్వసు1,2,3 (మిధునం) విశాఖ పూర్వాభాద్ర జ్యేష్ఠ రేవతి అశ్వని మఖ మూల రోహిణి ఉత్తర1 (సింహం) ఉత్తరాషాఢ శ్రవణం | మూల పూర్వాభాద్ర విశాఖ పునర్వసు1,2,3(మిధునం) భరణి మృగశిర అనూరాధ పుబ్బ ఉత్తరాభాద్ర అశ్వని మఖ పూర్వాషాఢ ధనిష్ఠ శ్రవణం రోహిణి చిత్ర3,4 (తుల) | ఉత్తరాభాద్ర అనూరాధ రేవతి జ్యేష్ఠ పుబ్బ పూర్వాషాఢ భరణి కృత్తిక ఉత్తర1 (సింహం) స్వాతి ఉత్తరాషాఢ చిత్ర3,4 (తుల) ధనిష్ఠ మృగశిర ఆర్ద్ర శతభిషం |
| **★ పూర్వాభాద్ర 4వ పాదం** | **ఉత్తరాభాద్ర** | **రేవతి** |
| ఉత్తరాభాద్ర పుష్యమి అనూరాధ ఆశ్లేష ఆర్ద్ర జ్యేష్ఠ రేవతి భరణి పూర్వాషాఢ కృత్తిక ఉత్తర2,3,4 చిత్ర 1,2 (కన్య) ఉత్తరాషాఢ మృగశిర శతభిషం ధనిష్ఠ | రేవతి ఆశ్లేష జ్యేష్ఠ మూల హస్త అశ్వని కృత్తిక ఆర్ద్ర ఉత్తర 2,3,4 (కన్య) ఉత్తరాషాఢ రోహిణి శ్రవణం శతభిషం పునర్వసు ఉత్తరాభాద్ర విశాఖ4(వృశ్చి) పూర్వాభాద్ర | అశ్వని మూల భరణి హస్త పూర్వాషాఢ రోహిణి శ్రవణం మృగశిర చిత్ర1,2 (కన్య) ధనిష్ఠ పునర్వసు విశాఖ4 (వృశ్చి) పూర్వాభాద్ర రేవతి పుష్యమి అనూరాధ ఉ.భాద్ర |

**గమనిక** విశాఖ, కృత్తిక, మృగశిర, పునర్వసు, ఉత్తర, చిత్ర, ఉత్తరాషాఢ అను 6 నక్షత్రాలు స్త్రీ, పురుషులకు ఒకటైనచో వివాహము చేయవచ్చును. కానీ ఇవి 2 రాశుల సంబంధ నక్షత్రాలు. వీటిలో మొదటిది పురుషరాశిగను, 2వది స్త్రీరాశిగాను భావించాలి. అనగా విశాఖ1,2,3 పాదాలలో జన్మించినవారు పురుషుడు గాను, విశాఖ4వ పాదంలో జన్మించిన వారు స్త్రీ అని భావించాలి.

## వివాహ పొంతనలలో పాయింట్ల పట్టిక అశాస్త్రీయం

వివాహాలు నిర్ణయించటంలో జాతకపొంతనకు వధూవర గుణమేళన పట్టికను ఉపయోగిస్తారు. 18 పాయింట్లు లేక 18 కంటే అధికముంటే ఇరువురికీ వివాహం అనుకూలమని, 18 పాయింట్ల కంటే తక్కువుంటే వివాహం చేయకూడదనేది... వధూవర గుణమేళన పట్టిక భావం. అనుభవంలో పరిస్థితులను గమనిస్తే 18 పాయింట్ల కంటే అధికం వచ్చి వివాహం చేసుకున్న వారిలో అధికులు మనస్పర్ధలు, అభిప్రాయబేధాలు, దాంపత్యభంగములు ఏర్పడి, విడాకులు తీసుకోవటము జరిగినది. ద్వితీయ వివాహాలు చేసుకోవటము జరిగింది. 18 పాయింట్ల కంటే తక్కువ వచ్చినప్పటికీ సుఖ సంతోషాలతో ఉంటూ షష్ఠి పూర్తి కార్యములు జరుపుకున్న దంపతులు కూడా ఉన్నారు.

అనుభవంలో వేలాది దంపతుల స్థితిగతులను పరిశీలిస్తే వధూవర గుణమేళన పట్టిక పూర్తి అశాస్త్రీయమని ఋజువైనది. కనుక తల్లిదండ్రులు తమ సంతానానికి వివాహం చేసే సమయంలో వధూవర గుణమేళన పట్టికను చూడవద్దు. యువతీ యువకుల జాతకాలలో సంతాన కళత్ర ఆయు స్థానాధిపతుల మిత్రశతృత్వాలను, ఇతర గ్రహస్థితులను పరిశీలించి వివాహ నిర్ణయాలను చేయాలి.

ఇరువురికీ తారాబలగణనంలో కూడా గమనించాల్సిన అంశాలున్నవి. తారాబలంలో క్షేమతారను శుభకరంగా గుర్తిస్తాం. కానీ ఇరువురికీ తారాబలం చూస్తుంటే ఒక వైపు నుంచి క్షేమతారాబలం ఉండగా, మరోవైపు నుంచి నైధన తారాబలం ఉంటుంది. క్షేమతారను స్వీకరించాలా, లేక నైధన తారాబలం ఉందని విసర్జించాలా... అనే అనుమానాలు చాలామందికి వస్తుంటాయి. అనుభవంలో పరిశీలిస్తే వివాహ తారాబల నిర్ణయాలలో క్షేమతార, నైధనతారతో ఉన్న జంటలు సమస్యలతో ఉన్న వారు ఉన్నారు, సుఖశాంతులతో కూడా ఉన్నారు. కనుక వివాహ పొంతనకు తారాబలం మాత్రమే ముఖ్యమని భావించకుండా ఇతర గ్రహసంచారాలను, ఇరువరి జన్మ లగ్నాలను కూడా గమనిస్తూ నిశ్చయ తాంబూలాదులను తీసుకొనేది.

మేష, వృషభ తులాలగ్నాలలో జన్మించిన వారికి వివాహస్థానాధిపతి కుజుడవుతాడు. ఈ లగ్న జాతకులకు కర్కాటక సింహలగ్న జాతకులను వదిలి మిగిలిన జాతకులనే నిర్ణయించుకొనుట ఉత్తమం. కర్కాటక సింహలగ్న జాతకులకు వివాహస్థానాధిపతి శని. కుజ శనులిరువురు శతృవులయినందున విసర్జించాలి. కర్కాటక సింహలగ్నాలలో జన్మించిన జాతకులకు తులా వృషభాలతో పాటు కుంభ లగ్నాన్ని కూడా విసర్జించాలి. కర్కాటక సింహలగ్నాలకు వివాహస్థానాధిపతి శని. శని గ్రహానికి కుజుడు రవి శతృవులైనందున విసర్జించాలి. ఇతర గ్రహస్థితులను కూడా గమనిస్తూ... ఇరువురి జాతకాలను సశాస్త్రీయంగా పొంతన చేయాలే తప్ప, కేవలం పాయింట్ల పట్టికతో ముడిపెట్టకూడదు.

పంచాంగాలలో ఈ వధూవర గుణమేళన పట్టిక ఇచ్చిన కారణంగా పండితులు, వాటిని అనుసరించటం జరుగుతున్నది. దశాబ్దం నుంచి అనేక కోణాలలో వివాహమైన ఇరుజాతకాలను పరిశీలించిన తదుపరి తేలిన విషయం ద్వారా.... ఈ పట్టిక పూర్తి అశాస్త్రీయమైనది. కంప్యూటర్లలో కూడా ఈ పట్టికలనే ఫీడ్‌చేసి, వాటిద్వారా వివాహ పొంతనలు చూడటం జరుగుతున్నది. గనుక యువతీ యువకులకు వివాహ నిర్ణయాలలో, తల్లి తండ్రులు ఎట్టి పరిస్థితులలోను ఈ పట్టికను ఆధారితంగా చేసుకుని వివాహ నిర్ణయాలను చేయకండి. ఈ పట్టికద్వారా చేసిన వివాహాలు భంగమైనవి ఉన్నవి, శుభకరమైనవి కూడా ఉన్నవి. కనుక విచక్షణతో గమనించేది.

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | |
|---|---|
| 1. శ్రీ వినాయక వ్రతం | వెల రూ. 10-00 |
| 2. శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 25-00 |
| 3. శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. వరలక్ష్మి వ్రతం | 7-50 |
| 6. కేదారేశ్వర వ్రతం | 7-50 |
| 7. త్రినాధ వ్రతం(కలర్) | 7-50 |
| 8. త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. క్షీరాబ్ధి వ్రతం | 10-00 |
| 10. మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. వైభవలక్ష్మి వ్రతం ఫోటో యంత్రంతో | 20-00 |
| 12. శ్రీలక్ష్మి కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 20-00 |
| 13. కనకమహాలక్ష్మి వ్రతం (కామేశ్వరీపాటతో) | 20-00 |
| 14. సంతోషీమాతా వ్రతం | 20-00 |
| 15. ఏడు శనివారాల వ్రతం | 20-00 |
| 16. సత్యనారాయణవ్రతం | 20-00 |
| 17. శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 20-00 |
| 18. శివదీక్ష | 10-00 |
| 19. కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. స్త్రీల వ్రతకథలు | 30-00 |
| 23. స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. స్త్రీలపాటలు (కామేశ్వరీపాటతో) | 36-00 |
| 25. సర్వదేవతా పూజావిధానం | 20-00 |
| 26. ఆరువ్రతాలు | 30-00 |
| 27. ధన్వంతరీ వ్రతకల్పం | 10-00 |
| 28. రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |
| 29. తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 30. శ్రీ చక్రపూజ | 10-00 |
| 31. శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 32. శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 33. లక్ష్మి - గౌరీ నిత్యపూజ | వెల రూ. 10-00 |
| 34. శ్రీలలితానిత్యపూజ(లలితాసహస్రనామస్తోత్రంతో) | 10-00 |
| 35. శ్రీ గాయత్రీ నిత్యపూజ | 10-00 |
| 36. అన్నపూర్ణ నిత్యపూజ | 10-00 |
| 37. శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 38. మహిషాసుర మర్ధనీపూజ | 10-00 |
| 39. రాజరాజేశ్వరీ నిత్యపూజ | 10-00 |
| 40. శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 41. కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 42. శివపూజ | 10-00 |
| 43. వీరభద్ర పూజ | 10-00 |
| 44. ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 45. నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 46. సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 47. రామదేవుని కథ | 10-00 |
| 48. శివదేవుని కథ | 10-00 |
| 49. లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 50. వేంకటేశ్వరపూజ | 10-00 |
| 51. బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 52. సూర్య నిత్యపూజ | 10-00 |
| 53. నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 54. రుక్మిణీ కల్యాణం | 20-00 |
| 55. ఉమామహేశ్వర వ్రతం | 20-00 |
| 56. శ్రీ కామేశ్వరీ వ్రతం | 20-00 |
| 57. 16 సోమవారముల వ్రతము | 20-00 |
| 58. పార్వతీకల్యాణం | 20-00 |
| 59. సహస్రకమలవర్తి వ్రతము | 20-00 |
| 60. పంచముఖ ఆంజనేయనిత్యపూజ | 20-00 |
| 61. అష్టనాగపూజ | 36-00 |
| 62. పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 63. ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 64. ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 65. ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 66. ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 67. హనుమద్ వ్రతం | 36-00 |

